# స్వర్ణ కమలాలు

## పంచ నాటికా సంపుటి




యువకెరటం విద్యాధర్ మునిపల్లె B.A.,

# స్వర్ణకమలాలు

పంచనాటికల సంపుటి



యువకెరటం

**విద్యాధర్ మునిపల్లె B.A.,**

**ప్రచురణ : భజరంగీ పబ్లికేషన్స్**

**పట్టాభిపురం, గుంటూరు- 522006**

స్వర్ణకమలాలు
రచన : విద్యాధర్ మునిపల్లె బి.ఏ.,
సెల్:8522990888,7989483830

ముద్రణ : 10 సెప్టెంబరు 2023

ప్రచురణ : భజరంగీ పబ్లికేషన్స్,
పట్టాభిపురం, గుంటూరు- 522006

ముద్రణ : ఎం.ఎన్.ప్రెస్.
బెంగుళూర్

# ప్రకాశకుల మనవి

ఈ సంకలనంలోని ఏ నాటికనైనా ఎవ్వరైనా ప్రదర్శించ దలచిన వారు రచయిత విద్యాధర్ మునిపల్లె గారి అనుమతిని తప్పనిసరిగా పొందవలసినదిగా కోరుతున్నాం. రచయిత అనుమతి లేకుండా ఎవరైనా ఈ సంకలనంలోని నాటికలను ప్రదర్శించదలచిన, అట్లు ప్రదర్శించినట్లు మా దృష్టికి వచ్చినా ప్రకాశకులుగా మేము, రచయిత గారు తీసుకొని సివిల్ మరియు క్రిమినల్ చర్యలకు తామే బాధ్యత వహించగలరు.

కోర్టు లావాదేవీలేమైననూ మా ఊరిలోని కోర్టులోనే తేల్చుకో గలరు.

భజరంగీ పబ్లికేషన్స్,
గుంటూరు - 522006

# యువకెరటం

"తెలుగు నాటక యువకెరటం" విద్యాధర్ మునిపల్లె రచించిన ఎన్నో నాటికలలో ఆణిముత్యాలను పదింటిని తీసుకొని వాటిని భావి తర రచయితలకు అందించాలన్న సత్సంకల్పంతో ఈ సంకలనాన్ని ప్రచురించటం జరిగింది.

ఆధునిక భావాలతో.. అత్యాధునికమైన రచనాశైలితో వీరు రచించిన నాటికలు ప్రజాదరణ పొందటం జరిగింది. వీరి రచనల్లో ముఖ్యంగా కథాబలంతోపాటు కథనం ప్రేక్షకులను మంత్రముగ్ధుల్ని చేస్తుంది. అవసర మైన సంభాషణలే తప్ప అనవసరమైన సంభాషణలు వీరి నాటికల్లో ఎక్కడా కనిపించవు అంటే అతిశయోక్తి కాదు.

చిన్న వయసులోనే తెలుగు నాటక రచయితగా తనకంటూ గుర్తింపు తెచ్చుకున్న విద్యాధర్ మునిపల్లె గారు తాను చెప్పదలచుకున్న కథని ప్రేక్షకులకు చేర వేయటానికి ఎన్నో రకాలుగా పోరాటాలు చేశారు. ప్రతిభ వుండగానే చాలదు.. దానిని నిరూపించుకునే వేదిక కావాలి. ఆ వేదికని తనకిచ్చే వారూ కావాలని భావించి కొంతమంది మిత్రుల సలహాతో గంగోత్రి అనే నాటక సమాజ నిర్వాహకులు, దర్శకుడు అయిన " శ్రీ నాయుడు గోపి" గారిని ఆశ్రయించారు. అప్పటికే నాయుడు గోపిగారు తెలుగు నాటకరంగంలో తనకంటూ సుస్థిరమైన స్థానాన్ని సంపాదించు కున్నారు. నాటకంపై ఆయనకున్న అపారఅనుభవం.. రంగస్థలంపై ఆయన చూపించే దర్శకత్వవిన్యాసం, నటఛాతుర్యం అంతా ఇంతాకాదు.

ఆంధ్రనాటకరంగంలో ఆయన ఇప్పటివరకూ అందుకోని పురస్కారం లేదంటే అది అతిశయోక్తి కాదు. అటు వంటి వ్యక్తి పరిచయంతో విద్యాధర్ మునిపల్లె అనే రచయిత తెలుగు నాటకరంగానికి పరిచయం అవ్వటం, ఆ తర్వాత తనను తాను ఎప్పటికప్పుడు సమాజానికి తగిన విధంగా.. ప్రేక్షకుని ఆలోచనలకు దగ్గరగా పునఃసృష్టించుకోవటం వంటివి చేశారు.

అలా తెలుగు నాటకరంగంలోకి ప్రవేశించిన వీరు.. ఆ దర్శకుడినే గురువుగా భావించి ఆయన నుంచి ఎన్నోవిషయాలను నేర్చుకున్నారు.

"లోకోఃభిన్నరుచిః" అన్న వాక్యాన్ని అనుసరించి రకరకాల దర్శకులతో కలిసి పనిచేస్తూ వారి ఆలోచనలు చదవటం మొదలు పెట్టారు. అలా వీరు నాయుడుగోపి, పులగం నాగిరెడ్డి, ఎం.మధు, వేముల మోహనరావు, ఎల్. రామలింగస్వామి, జలదంకి రవీంద్ర, బసవరాజు జయశంకర్ ఇలా పలువురు వేర్వేరు వ్యక్తిత్వాలు, ఆలోచనలు కలిగిన దర్శకులతో కలిసి పనిచేశారు. అలా పనిచేస్తూ వారి నుండి తెలుసుకున్న అనుభవాలు, వారితో నిండిన అనుభూతులు వీరి రచనా గమనాన్ని మార్చేశాయి.

వీరు నాటిక రచన చేయటంతోనే ఆగిపోరు.. ప్రేక్షకుల మధ్యలో కూర్చొని తన నాటికను, వేర్వేరు నాటికలను పరిశీలించుకుంటారు. తన నాటికల్లో ప్రేక్షకులు ఎక్కడ ఎలా స్పందిస్తారో అర్ధం చేసుకుంటారు. తాను అనుకున్న రీతిలో ప్రేక్షక స్పందన లేకపోతే దానికోసం ఏం చెయ్యాలా అని ఆలోచించి తర్వాతి ప్రదర్శనకి మార్పులు చేర్పులు చేస్తారు. అందుకే వీరి రచనలకి తెలుగు నాటకరంగంలో ఒక ప్రత్యేకమైన స్ధానం వుంది.

వివాదాస్పద రచయితగా కూడా ఈయనకి ఒక పేరుంది. కాలం అన్నాక పగలు రాత్రి ఎలా వుంటాయో మనిషి అన్నాక మంచీ చెడు వుంటాయి. అయితే వీరు చేసిన కొన్ని రచనలవల్ల కొన్ని వివాదాలు అంటించుకున్న మాట వాస్తవమే.. ఆ వివాదాలు కూడా నాటకం కోసమే చేయటం జరిగింది. ఎంతో భవిష్యత్తువుండి.. జనాదరణ పొందవలసిన రచనలను కొంతమంది "కుహనా" వ్యక్తులు కావాలని పురిటిలోనే చంపేసేందుకు చేసిన ప్రయత్నాలపై రచయిత కన్నెర్రచేశారు. వారిపై తిరుగుబాటు చేశారు. కుహనా రాజకీయాలతో నాటకరంగంలో అన్యాయమై పోతున్నాం అనే వారి గళాన్ని తన రచనల్లో ప్రతిధ్వనింపచేశారు.. అలా ఆయన చేసిన "రంగస్థల నగ్నచిత్రం" అనే వెబ్ సీరియల్ తెలుగు నాటకరంగంలో చర్చ నీయాంశం అయింది. అటుపై విద్యాధర్ రచనలకు పెద్ద ఎత్తున ప్రదర్శనావకాశాలు వచ్చాయి. ప్రదర్శనావకాశాలు కోసం పోరాడితే సరిపోదు. వచ్చిన అవకాశాన్ని కూడా సద్వినియోగం చేసుకోవాలి. అలా సద్వినియోగం చేసుకొని నాటకరంగంలో తనకంటూ ఒక గుర్తింపుని తెచ్చుకున్న "యువకెరటం" విద్యాధర్ మునిపల్లె.

ఆయన కలం నుండి జాలువారిన రచనల్లో మాకు నచ్చిన పది నాటికలను "స్వర్ణకమలాలు" పంచనాటికా సంకలనం పేరుతో మీకు అందించటం జరిగింది.

భజరంగీ పబ్లికేషన్స్
గుంటూరు

# సజీవ పాత్రలతో సహజీవనం



" పిట్ట చిన్నది.. కూత గొప్పది" అన్న సామెత "విద్యాధర్ మునిపల్లె"కే వర్తిస్తుందేమో!!

ఎందుకంటే వీరు రాసిన నాటికలు అంత గొప్పగా ప్రేక్షక లోకానికి దగ్గరవుతున్నాయి. ఎన్నో బహుమతులను కైవసం చేసుకుంటున్నాయి. వీరు ఎంచుకున్న కథా వస్తువు ప్రస్తుత వాతావరణంకి దగ్గరలో ఉంటున్నాయి. ఎక్కువగా వీరి రచనలు కుటుంబ సమస్యలపై రాస్తూ దానికి పరిష్కారం కూడా చూపిస్తున్నారు. ఇది ఒక బాధ్యతగల రచయితకు ఉండవలసిన లక్షణం. ఇది వీరిలో కనిపిస్తుంది. వీరు రాసిన "కర్మ" నాటికను మా లలితశ్రీ కళాసమితి శ్రీకాకుళం వారిచే నా దర్శకత్వంలో ఢిల్లీ, విశాఖపట్నం, బిలాయిలో అలాగే మా శ్రీకాకుళం పట్టణంలోనే కాక పలు పట్టణాల్లో గ్రామాల్లో ప్రదర్శన ఇచ్చి ఎన్నో ప్రశంసలు అందుకున్నాను. మా ఈ " కర్మ" నాటిక చూసిన ప్రేక్షకులు నాటికలో "సజీవ పాత్రలు" కనిపిస్తున్నాయని రచయితను కీర్తించారు.

అలాగే నా దర్శకత్వంలో మరో మంచి నాటకం " మా వూరి మంత్రిగారి శతకం". ఈ నాటకాన్ని కూడా ప్రజలకు అందించి, ఒక నటుడిగా, దర్శకుడిగా, రచయితగా, తెలుగు కళాకారులు, దర్శకుల అభిమానం పొందాలని ఆ నటరాజస్వామి ఆశీర్వచనాలు కలగాలని, అలాగే ప్రత్యక్షదైవం, ఆరోగ్య ప్రదాత మా శ్రీకాకుళం అరసవిల్లి సూర్యనారాయణ స్వామి వారి కరుణాకటాక్షములు ఎల్లవేళలా కలగాలని కోరుకుంటూ...

లోకనాథం రామలింగస్వామి,
నటులు,దర్శకులు,గుణనిర్ణేత,
శ్రీకాకుళ రంగస్థల కళాకారుల సమాఖ్య,
(గౌరవాధ్యక్షులు)
(నెలవారి సాంస్కృతిక విభాగం, శ్రీకాకుళం)

# నిత్య నాటకోపాసకుడు



"సర్వ కళల సమాహారం నాటకం అన్నారు. నాటకంలో సాహిత్యం, సంగీతం, నాట్యం, అభినయం, పాత్ర చిత్రణ, రంగాలంకరణ, సందర్భోచిత సన్నివేశాలు తదితర అంశాలు మిళితమై జీవన చలన దృశ్యాన్ని సజీవంగా ఆవిష్కరిస్తాయి. మానవ జీవన ఉత్థాన పతనాలు, సుఖదుఃఖాలు అనుపానాలు, లోతుపాతులు మొదలైన అన్ని ప్రాకంపనలు నాటకం సమాంతరంగా చూపగలదు. అందుకే నాటకం అలరించే వినోద స్థాయి నుంచి దాటుకుని అలోచనామృత స్థాయికి ఎదిగింది." విద్యాధర్ మునిపల్లె క్రమ శిక్షణ కలిగిన నాటక రచయిత. వివేచనా శక్తి గల రచయిత. నిత్య నాటకోపాశకుడు. అందుకు ఆయన ప్రతి నాటిక ఒక ఉదాహరణగా నిలుస్తుంది.

ఈ సంపుటిలోని అయిదు నాటికలు దేనికదే భిన్నంగా ఉంటాయి. ప్రతి నాటికా ఆలోచింప జేస్తుంది. కళాకారుల అత్యాశలు, పాత్రికేయుని కష్టాలు, ప్రేమికుల త్యాగాలు, భార్యాభర్తల ప్రేమానురాగాలు... ఇలా మధ్యతరగతి బతుకుల లోలోతుల్లోకి వెళ్లి పరిశీలించిన రచయితగా నిలుస్తాడు. ఆయన నాటికలు చదువుతున్న కొద్దీ మనల్ని వాటితో తీసుకుపోతుంటాయి.

విద్యాధర్ అన్యాయం పట్ల ఆగ్రహం, అణచివేత పట్ల ద్వేషం వ్యక్తపరిచిన సామాజికుడు. ఆయనలో సమాజానికి పనికొచ్చే ఒక రచయిత ఉన్నాడు. జీవితంలో వాస్తవికతకు, నిరాడం బరతకు, సమరసతకు ప్రాధాన్యతనిస్తాడు. మాటల్లో చెప్పలేని జీవితానుభవాలను తన నాటికలు ద్వారా చెప్తాడు. అతని నాటికలు ప్రదర్శన యోగ్యంగా ఉంటాయి. ఆయన నాటికల్లోని సన్నివేశాల్లో తానూ ఒక పాత్ర అయి కనిపిస్తాడు. విద్యాధర్ నటుడు కావడంతో అది సాధ్యపడి ఉండొచ్చు. నాటక రచనలో ఆయన పూర్ణత్వం సాధించాడనే చెప్పాలి.

"స్థిరమైన గమ్యాన్ని చేరు కోవాలంటే గమనం ఉండాలి అంటాడు.

తల్లిదండ్రులు తమ అభిప్రాయాలను పిల్లలపై రుద్దకూడదని చెబుతాడు. ఆవేశంలో తీసుకున్న నిర్ణయాలు అనర్థాలకు దారితీస్తాయి అంటాడు.

ప్రజలు ప్రశ్నించనంత కాలం వెధవలు పుట్టికొస్తుంటారని 'ఉత్తిష్ఠ భారతి' లో అంటాడు. జర్నలిజంలోని లోపాలను ఎత్తి చూపుతాడు. విద్యాధర్ స్వయంగా పాత్రికేయుడు గనుక ఆ వృత్తిలోని కష్టాలను బలంగా హత్తుకునేలా చూపగలిగాడు. ప్రజా ప్రయోజనాల ముసుగులో జనాన్ని దోచేస్తూ వాళ్లకు తెలియకుండా వాళ్ల జేబులు కొట్టేస్తున్నా పట్టించుకోని ప్రజలపై ఆగ్రహం వ్యక్తపరుస్తాడు.

'దగ్ధగీతం' లో వాడెవడో విసిరిన ఎరకి చిక్కిపోయిన అమాయకురాలు దేహాన్ని దోచుకున్నంత దోచుకున్నాక దొంగలా జారిపోయిన మోసగాడిని చూస్తాం. ప్రేమకై తపించిన ప్రేమికుడినీ చూస్తాం. ప్రేమికులకు మరణం ఉండొచ్చేమో గానీ ప్రేమకు మరణం లేదని అంటాడు.

మనిషికి ఆవహించిన అరిషడ్వర్గాలు విడనాడినపుడే నిష్కల్మషమైన మనసుతో స్వర్ణకమలంగా వెలుగొందుతాడని 'స్వర్ణకమలాలు లో అంటాడు.

జగమంతా ప్రేమే నిండి ఉంది. దాన్ని ఆస్వాదించాలి అని 'సావిరహే...' లో చెబుతాడు.

ఈ సంపుటిలోని ప్రతి నాటిక మానవ జీవితాన్ని ప్రతిబింబిస్తాయి. నాటికలు పాత్రలు మీద కాకుండా పరిస్థితుల మీద అధారితాలు. ఆ పరిస్థితులు సంఘర్షణ పూరితాలు. నాటక గమనం, నాటకీకరణ, మలుపులు తీసుకునే సన్నివేశాలు, సంభాషణలు ఆయన్ని గొప్ప నాటక రచయితగా మనకు చూపెడతాయి. విద్యాధర్ సాంఘిక నాటికలు రాసే ముందు పౌరాణికాలు రాశాడు. నాటకాలు రాయడం ఆయనకు తండ్రి నుంచి వారసత్వంగా వచ్చింది. విద్యాధర్ మునిపల్లె కలం నుంచి మరిన్ని మంచి రచనలు రావాలని కోరుకుందాం.

- లండ రుద్ర మూర్తి,

నటుడు, దర్శకుడు, రచయిత, న్యాయ నిర్ణేత

# తెలుగు నాటకరంగంలో యువకెరటం



అతి చిన్న వయసులోనే తెలుగు నాటక రంగంలో ప్రవేశించి పద్యనాటక రచయితగా, సాంఘిక నాటక రచయితగా, నటునిగా, దర్శకునిగా, పరిషత్ నిర్వాహకునిగా విభిన్న పాత్రలు పోషిస్తున్న సరస్వతీ పుత్రుడు శ్రీ మునిపల్లె విద్యాధర్. చిన్నతనంలోనే శ్రీ గురురాఘవేంద్రచరితం వంటి పద్యనాటకాన్ని రచించి నాటక రచయితగా ప్రస్థానాన్ని ప్రారంభించిన విద్యాధర్ అనతికాలంలోనే గొప్పగొప్ప నాటికలు రచించి, నటించి, దర్శకత్వం చేపట్టి తెలుగు నాటకరంగంలో కళామతల్లి ముద్దుబిడ్డగా పేరుగాంచారు.

నాటకం రచించటం గొప్పకాదు. ఆ నాటకం రచన అందరినీ ఆకట్టుకున్నప్పుడే ఆ రచయిత జీవితం ధన్యం. విద్యాధర్ రచించిన గొప్పనాటకాల్లో 5 నాటికలను “స్వర్ణకమలాలు” అనే పేరుతో సంకలనంగా ప్రచురించటం అభినందనీయం. ఆ రచయిత జన్మపావనం. ఎందుకంటే ఈ నాటికల పుస్తకం భావితరాల వారికి తీపిగుర్తుగా వుంటుంది.

పిల్లలు తమ మనోభావాలకు వ్యతిరేకంగా వ్యవహరించినా తల్లిదండ్రులు తమ మనోధైర్యాన్ని కోల్పోకుండా జీవించిన కథాంశంతో రచించిన నాటికే “గమనం”. ఈ నాటిక విద్యాధర్ రచించిన సాంఘిక నాటిక రంగంలో తొలి విజయంగా భావించవచ్చు. విద్యాధర్ ఇంకా ఎన్నో నాటికలు రచించటానికి పునాది ఈ గమనం నాటిక.

సంపుటిలో మరో నాటిక “ఉత్తిష్ఠభారతి”. ఈ నాటిక నిజాయితీ పరుడైన జర్నలిస్ట్ మెడికల్ మాఫియా గుట్టు రట్టు చేసే క్రమంలో ఎదుర్కొన్న సమస్యలను ఆవిష్కరించింది. జర్నలిస్టులు సమాజంలో నిజమైన హీరో అని చాటి చెప్పిన నాటిక.

సంకలనంలో మరోకథ “దగ్ధగీతం”. స్వర్గీయ పెద్దిభొట్ల సుబ్బరామయ్య గారి కథకు విద్యాధర్ నాటకీకరణ చేయటం జరిగింది.

ఇద్దరు కళాకారుల మధ్య ప్రేమకధను అందంగా తీర్చదిద్దారు.

సంకలనంలో నాల్గవ నాటిక "స్వర్ణకమలాలు". ఒక వ్యక్తిలో ఈర్ష్యా ద్వేషాలు మొదలైతే ఎంత పతనస్థితికి చేరుకుంటారో తెలియజెప్పిన నాటిక. శ్రీహర్షఅనే పేరుమోసిన నవలా రచయిత, తన ఊహల్లో కలలుకనే నవలా కధానాయికను వివాహము చేసుకొని చదువు నేర్పించి, నాగరికత నేర్పించి, మంచి నవలా రచయితగా తీర్చదిద్దుతాడు. ఆమె ఉన్నత స్థితికి చేరుకునే సరికి అతనిలో ఈర్ష్యాద్వేషాలు పెరిగిపోతాయి. ఆమె ఎదుగుదలను తట్టుకోలేక పోతాడు. ఈ నాటిక శృంగారభరితంగా వుంటుంది. కవిసార్వభౌముడు శ్రీనాధుని యొక్క శృంగార కోరికలు ఈ నాటికలో కధానాయకుడు శ్రీహర్ష పాత్రలో కనిపించటం విశేషం.

ఈ సంకలనంలో చివరి నాటిక "సా విరహే". రాధాకృష్ణుల అమరప్రేమని ఆవిష్కరించిన నాటిక.

ఈ సువర్ణకమలాలుగా నిలిచిన ఈ ఐదునాటికలను "స్వర్ణకమలాలు" అనేపేరుతో సంకలనంగా ప్రచురించటం అభినందనీయం. ఈ సంకలనానికి స్వర్ణకమలాలు అనే పేరు సమంజసం. ఈ నాటికల సంకలనం భావితరానికి ఓ తీపిగుర్తుగా మిగులుతుందనటం నిశ్చయం.

శ్రీ మానాపురం సత్యనారాయణ గారు,
గుణనిర్ణేత,నటుడు,
పలు పరిషత్ కార్యనిర్వాహకులు.
పాలకొల్లు, ఆంధ్రప్రదేశ్

# భవిషత్ దార్శనికుడు



విద్యాధర్ మునిపల్లె గారు నాకు సడెన్ గా ఫోన్ చేసి నాగిరెడ్డి "స్వర్ణకమలాలు" పేరుతో ఐదు నాటికలను సంకలనంగా తీసుకొస్తున్నాను. దానిలో ఉత్తిష్ఠభారతి నాటిక కూడా వుంది. సంకలనంలో వున్న నాటికల దర్శకులతో నేను ముందుమాటలు రాయిస్తున్నాను. నువ్వు కూడా ముందుమాట రాయి అన్నారు. విద్యాధర్ గారూ నేను ఏం రాయగలను.. వద్దులే అన్నాను. లేదు నాగిరెడ్డి నువ్వు రాయగలవు. రాయాలి.. రాయగలవు.. అని వత్తి తెచ్చారు. సరే ప్రయత్నం చేస్తాను. రాయగలిగితే రాస్తాను.. రాయలేకపోతే ఏమీ అనుకోవద్ద అని చెప్పాను. ప్రయత్నం చెయ్యి అన్నారు విద్యాధర్ గారు. నేను సరే అన్నాను. ఆలోచనలో పడ్డాను. విద్యాధర్ గారికి ఎంత ముందు చూపు వుంటుందంటే దాదాపు 10 సంవత్సరాలు ముందుకు చూడగలరు. ఒకే సారి పది రకాలుగా ఆలోచించి వాటిలోంచి ఏది రైటో దానిని గ్రహించి మనకి అందిస్తారు. ఒక్కోసారి ఎదుటి మనిషి మనసుని సైతం చదివేసి మనసులోనే మన ప్రశ్న వుండగానే సమాధానం ఆయన నోటి వెంట వచ్చేస్తుంది. కొన్నిసార్లు సమాధానం నోటితో చెప్పకుండా చిన్నచిన్న సంఘటనను సృష్టించి మనకే అర్థమయ్యేలా చేస్తారు. పైగా ఈయన భవిషత్ దార్శనికుడు. అలాంటి ఆయన నాటికల పుస్తక సంకలనానికి నేను ముందుమాట రాయగలనా? అని ఆలోచిస్తుండగా... కాసేపటికి నాకే ఒక ఆలోచన వచ్చింది. విద్యాధర్ గారితో పరచియం.. ఆ అనుభవాలను రాసే ప్రయత్నం చేద్దామనుకున్నాను..

అది 2012 సంవత్సరం. వెనిగండ్ల గ్రామంలో ఉషోదయ ఆర్ట్స్, వెనిగండ్ల అనే పేరతో అసోసియేషన్ ప్రారంభించి అంచూరి నర్శిరెడ్డి రచన అయిన "శ్రేయోజీవనం" నాటిక 36 ప్రదర్శనలు ఆంధ్రరాష్ట్రం అంతా ప్రదర్శించాము. తరువాతి సంవత్సరానికి మాకు నాటికలేదు. అప్పుడే మా గురువుగారైన నాయుడు గోపిగారు విద్యాధర్ రచనలో "గురురాఘవేంద్రచరితం" పద్యనాటకం ఉధృతంగా రిహార్సిల్ చేస్తున్నారు. ఆ నాటకంలో మా టీమ్ సభ్యుడు కె.పి.రెడ్డి వేషం వేస్తున్నాడు. అతనితో కలిసి నేను కూడా అప్పుడు రిహార్సిల్స్ చూడ్డానికి వెళ్ళేవాడిని. ఆ సందర్భంగా విద్యాధర్ మునిపల్లె గారు పరిచయం జరిగింది. కొంతకాలం తర్వాత విద్యాధర్ గారితో " ఏవండీ

మాకు ఒక టీమ్ వుంది. 2012 లో ఒక నాటిక ఆడటం జరిగింది. ఇప్పుడు మా చేతిలో నాటిక లేదు. మీరు పెద్ద మనసుతో ఒక నాటిక ఇవ్వగలరా అని అడిగాను. నాదగ్గర ఏ నాటికా లేదు. రాసే ఆలోచనాలేదు అని చెప్పారు. వెంటనే నా దగ్గర "పెన్ కౌంటర్ " అనేపేరుతో నాటిక వుంది. నంది నాటికలకు స్క్రూటినీ ఇచ్చి ఆగిపోయిన నాటిక వుంది. మీకు అభ్యంతరం లేకపోతే రీడింగ్ ఇస్తాను అన్నారు. సరే అన్నాను. మరుసటి రోజే మా ఊరు వచ్చి నాటిక వినిపించారు. నాటిక మాకు నచ్చింది. కానీ నాటికలో ఇంకా ఏదో కావాలి అనిపించి ఆమాటే చెప్పాము. నేను కూడా ఆలోచిస్తాను అని వెళ్ళిపోయారు. మరుసటి రోజే నాగిరెడ్డి నేను వెనిగండ్ల వస్తున్నాను అన్నారు. రండిసార్ అన్నాను. విద్యాధర్ గారు వెనిగండ్ల వచ్చారు. మాట్లాడుకున్నా ఒక ఆలోచనకి రాలేకపోయాం. వరుసగా నాలుగురోజులు గుంటూరు నుండి వెనిగండ్ల వస్తున్నారు. విషయం ఒక కొలిక్కి వచ్చింది. నాటిక పేరు " ఉత్తిష్ఠభారతి" గా రూపాంతరం చెందింది.

నేను నాతోపాటు పులగం శంకరరెడ్డి, కొండమడుగుల పిచ్చిరెడ్డి, చమళ్ళమూడి గ్రామం నుండి వై.హనుమంతరావుగారు, గోరంట్ల నుండి రాణిగారు నాటిక రిహార్సిల్స్ ప్రారంభించాం. 100 రోజులు రిహార్సిల్స్ చేశాము. 13 స్క్రూటినీలు ఇచ్చాము. అదేమి విచిత్రమో మూడు పరిషత్తులకు నాటిక ఎంపికైంది. ఆ మూడు పరిషత్ నిర్వాహకులే స్క్రూటినీ జడ్జీలుగా వచ్చారు. మిగిలిన పరిషత్ లకు ప్రతినిధులు వచ్చారు. ఇప్పుడే కాదు మా మొదటి నాటిక శ్రేయోజీవనానికి కూడా 12 స్క్రూటినీలు ఇచ్చాను. అప్పుడు కూడా మూడు పరిషత్ లలో ఆ నాటిక ఎంపికఅయింది. 9 పరిషత్ లలో ఎంపిక కాలేదు. నిర్వాహకులు వచ్చిన మూడు పరిషత్తులకు ఎంపిక అయింది. ఈ విషయం ఇప్పటికీ, ఎప్పటికీ అర్ధంకాని విషయం. ఉత్తిష్ఠభారతి ఆడిన ప్రతిచోటా ఒక విలన్ బహుమతి తప్పనిసరిగా వచ్చేవి.

ఈ సందర్భంగా దర్శనాపురి పరిషత్ లో ఈ నాటికను అనుకోని సందర్భంలో ప్రదర్శించాల్సి వచ్చింది. సభాకార్యక్రమం ప్రారంభం అయింది. ఆ రోజు అందరికీ అన్న నల్లూరి వెంకటేశ్వరరావు గారు ముఖ్య అతిధిగా ఉపన్యాసం ప్రారంభించారు. ఉపన్యాస సభ ప్రారంభంలోనే మా నాటిక ప్రస్తావన పరిషత్ లో ఆడిన నాటికల గురించి మాట్లాడకూడదు కానీ ఉత్తిష్ఠభారతి గురించి మాట్లాడకుండా ఉండలేకపోతున్నాను. అన్యధా భావించకండి అంటూ నాటిక గురించి దాదాపు 25 నిమిషాలపాటు మాట్లాడారు. మాట్లాడే క్రమంలో

సమయం మించిపోతుంది.. న్యాయనిర్ణేతలు వచ్చి జడ్జిమెంట్ ప్రకటించండి అని పదే పదే విజ్ఞప్తి. ఒక గంటసమయం తర్వాత న్యాయనిర్ణేతల ప్రకటన ఆశ్చర్యం. ద్వితీయ ప్రదర్శన, ఉత్తమ ద్వితీయ నటుడు, ఉత్తమ రచన, ఉత్తమ విలన్, ఉత్తమ సంగీతం వరించాయి. ఇలా ఈ నాటిక ఎన్నో ప్రదర్శనలు, మరెన్నో పురస్కారాలతో కొనసాగింది. ఈ నాటికను మాకు అందించిన విద్యాధర్ గారికి రుణపడి వుంటామని తెలియజేస్తూ.. సెలవు.

పులగం నాగిరెడ్డి,<br>
నటుడు, దర్శకుడు<br>
ఉషోదయ ఆర్ట్స్, వెనిగండ్ల<br>
గుంటూరుజిల్లా, ఆంధ్రపదేశ్

# మనసుతో మాట్లాడే మునిపల్లె



సాధారణంగా అందరూ మనుషులతో మాట్లాడతారు.. కానీ విద్యాధర్ మునిపల్లె మనసులతో మాట్లాడతారు. మనసుతోనే మాట్లాడతారు.. అలా ఇద్దరు మనుషుల మనసులమధ్య ఏర్పడిన అంతర్మథనమే నాకోసం రాసిచ్చిన స్వర్ణకమలాలు నాటిక. అయితే ఈ సంకలనానికి నాకోసం ఆయన మంచి మనసుతో రాసిచ్చిన స్వర్ణకమలాలు అనే నాటిక పేరే పెట్టటం చాలా సంతోషం. నేను కోరగానే కాదనకుండా నాకోసం రాసిచ్చిన నాటిక అది. ఈ నాటిక నేను తీసుకోవటానికి కారణం విద్యాధర్ మునిపల్లె గారు అందించిన కథ, కధనం, సంభాషణలూ, నాటకీయత బాగా నచ్చాయి. ఎంతో సున్నితమైన అంశాన్ని తీసుకొని దానిని ఎంతో అందంగా నాటకీకరణ చేయటం నాకు చాలా బాగా నచ్చింది. ప్రతి పాత్రా కూడా మనసుతో మాట్లాడతాయి. ఒక్క కధానాయకుని పాత్ర తప్ప. అది కేవలం మెదడుతోనే మాట్లాడుతుంది.

అదేవిటీ..? మనసుకీ, మెదడుకీ తేడా అంటే... మనసు తనకు తోచింది చెప్తుంది. కానీ మెదడు మాత్రం ఆలోచించి మరీ నిర్ణయం తీసుకొంటుంది. అలాంటి పాత్రే శ్రీహర్షది. పైకి నవ్వుతూ కనిపించినా లోలోపల రగిలిపోతుంటాడు.ఇలాంటి మనషుల్ని మనం తరచూ చూస్తుంటాం.. కొంతమందిని గుర్తిస్తాం.. మరికొంతమందిని గుర్తించలేం.

నేను గొప్పవాడిని..అనేదానికీ నేను మాత్రమే గొప్పవాడిని అనేదానికి తేడా వుంటుంది. అయితే ఈ సమాజంలో చాలా మంది నేను మాత్రమే గొప్పవాడిని. నేను మాత్రమే తెలివైన వాడిని గట్టిగా నమ్ముతారు. ఏదో ఒక సందర్భంలో ఇది బయటికి కనబరుస్తారు. అదెలా అంటే తనకంటే చిన్నవారికి సలహాలు ఇచ్చే సమయంలో తమ అనుభవాలను బహిర్గతం చేస్తూ తమ పరిజ్ఞానాన్ని ప్రదర్శిస్తుంటారు. ఇది మనిషి సహజనైజం. అయితే ఆ మనిషికి తెలుసు తనకంటే గొప్పవారున్నారని.. కానీ జీర్ణించుకోవటం ఆమనిషికి కష్టం. పైకి ఒప్పుకున్నట్లే నటిస్తాడు కానీ నిజాన్ని అంగీకరించేవారు ఏ కొందరో.. అయితే ఇందులో కధానాయకుడు నేను మాత్రమే గొప్పవాడిని అని బలంగా నమ్ముతాడు. కాలం కలిసి వచ్చి పెద్ద రచయితగా నలుగురిలో గౌరవ మర్యాదలు పొందాడు. ఇక్కడి వరకూ బానే వుంది. కానీ తనతోటి

రచయితలంతా తనకంటే చిన్నచిన్న రచయితలనీ, వారి రచనల్లో పసవుండదనీ భావిస్తూ చిన్నచూపు చూస్తాడు. తను ప్రేమించి పెళ్ళిచేసుకున్న కమలకి తనే చదువు నేర్పించి, నవల రచన చేయటం నేర్పించి ఆమె వున్నత స్థాయికి చేరుకుంటే చూసి ఓర్వలేకపోతాడు.

తన రచనలతో నలుగురికీ దిశానిర్దేశం చేసే రచయిత అరిషడ్వర్గాల మాయలో పడిపోయి పతనమైపోతాడు. రచనల్లో విలువలు తగ్గిపోతాయి. తనకంటే గొప్పరచనలు చేస్తున్న తన భార్యని చూసి తనలో తనే కుళ్ళిపోతాడు. మెదడంతా కుళ్ళిపోయి తనేం చేస్తున్నాడో కూడా తెలియని స్థితికి చేరుకుంటాడు.

ఇదంతా ఎప్పుడు జరుగుతుంది? ఒక వ్యక్తి తనను తాను తానే గొప్పవానిగా ఊహించుకోవటం, ఎదురు దెబ్బలు తగిలితే విలవిలలాడిపోవటం, కారణాలను విశ్లేషించుకోకపోగా పదేపదే అదే తప్పు చేస్తూ చివరికి తనకు తానే పతనమైపోవటం వంటివి జరుగుతాయని.. రచయిత చెప్తాడు. అందరు వ్యక్తులూ తనలాగే ఆలోచిస్తారని భావిస్తాడు.

అయితే తన అభిప్రాయం తప్పని తెలుసుకున్నాక తనలోని అరిషడ్వర్గాలను వదిలిపెట్టి పసిపాపగా మారి కొత్త జన్మఎత్తుతాడు శ్రీహర్ష.. స్వర్ణకమలాలు నాటికను ఎంతో చక్కగా రచన చేసిన విద్యాధర్ మునిపల్లె గారికి ఎప్పటికీ ఋణపడి వుంటాను. వీరు మరిన్ని రచనలు చేయాలని ఆ భగవంతుని నిత్యం ప్రార్థిస్తాను. తెలుగు నాటకం వున్నంతకాలం వీరికో పేజీ ఖచ్చితంగా వుంటుందని నమ్ముతాను.

కత్తి శ్యాంప్రసాద్
రంగస్థల నటుడు, దర్శకుడు
హర్షక్రియేషన్స్, విజయవాడ
ఆంధ్రప్రదేశ్

# శరీరాలే వేరు ఆత్మ ఒక్కటే



మిత్రుడు విద్యాధర్ మునిపల్లె మనసున్నోడు. కాకపోతే ఇన్ని నాటికలు ఇంత గొప్పగా ఎలా రాయగలడు. మనుషుల్ని చదివేస్తాడు.. వాళ్ళ మనసుల్నీ చదివేస్తాడు. ఎదుటి వారికి ఏం కావాలో ముందే తెలుసుకొని వారు అడగక ముందే తనవద్ద వుంటే ఇచ్చేస్తాడు. తనకు సాధ్యం కాదని తెలిసిన వెంటనే మొహమాట పడకుండా సూటిగా చెప్పేస్తాడు. అందుకే అతని వ్యక్తిత్వం అంటే నాకు ఇష్టం. మనసులో ఏదీ దాచుకునే వ్యక్తికాదు. అది ప్రేమైనా, కోపమైనా, బాధైనా మరేదైనా..

నాకు విద్యాధర్ మునిపల్లెతో పరిచయం అతను నాటకరంగంలోకి వచ్చిన తొలినాళ్ళలోనే కలిగింది. ఆ పరిచయం స్నేహంగా మారటానికి ఎక్కువ రోజులు కూడా పట్టలేదు. నాటకంమీద నాకున్న మక్కువతో గతంలో చాలా నాటకాలు చాలా మంది దర్శకులతో అనేక సమాజాల్లో వేషాలు వేశాను. అయితే కొన్ని కారణాంతరాలవల్ల నేను కొంతకాలంపాటు రంగస్థలానికి దూరమయ్యాను. తిరిగి నేను రంగుపూసుకొని రంగస్థలం ఎక్కుదామంటే నన్ను నాటకంలోకి తీసుకోటానికి ఆయా సమాజాలవారు సిద్ధంగా లేరు.

అప్పుడపపుడే కొత్తగా రచనలు మొదలు పెట్టి.. నా గురువుగారైన నాయుడు గోపిగారికి "గమనం" అనే నాటిక ఇచ్చాడని తెలిశాక నా మనసు ఆగలేదు. నాయుడు గోపి గారు అంత సామాన్యంగా ఎవరి నాటికలు పడితే వారివి తీసుకోరు. ఆయనకి బాగా నచ్చాలి. అప్పటికే ఆయన్ని అందరూ నందుల గోపి అని పిలుస్తున్నారు. ఆయన ఇంట్లో ఎన్ని నందీ అవార్డులున్నాయో.. అలాంటి గురువుగారు ఇతని నాటిక తీసుకున్నారంటే ఏదో వుందనిపించింది రిహార్సిల్స్ చేస్తున్న చోటికి వెళ్ళి నాటిక చూశాను. నాకు పేరుమోసిన రచయితలెవ్వరూ నాటికివ్వరు... ఇతనైతే కొత్త రచయిత ఇతనిని అడిగి చూద్దాం అనుకున్నాను.

అలాగే నేను విద్యాధర్ మునిపల్లెని అడిగాను నాటిక కావాలని.. సరేలే చూద్దాం అన్నాడు. అందరి రచయితల్లాగే ఇతను కూడా చూద్దాం అంటున్నాడులే అని అనుకున్నాను. అయితే రెండు రోజుల వ్యవధిలో నాకు "శిక్ష" అనే నాటిక రాసి పంపించాడు. ఆ నాటికను నేను నందికి ఎంట్రీ

పంపాను. సెలక్ట్ అవ్వలేదు.. కొత్త సమాజం అవ్వటం వల్ల సమాజసభ్యులు నిరుత్సాహ పడుతున్నారని గ్రహించి మాలో ఉత్సాహాన్ని నింపుతూ తనే మాకు రేపల్లెలో ప్రదర్శన ఇప్పించాడు. అంతే ప్రదర్శన అద్భుతంగా వచ్చింది. ప్రేక్షకులు నాటికను మెచ్చుకున్నారు. అప్పుడు నాతో అతను అన్నమాటేంటంటే

"మధు.. నాటిక గొప్పదే.. కాకపోతే స్ర్కూటినీ చూడటానికి వచ్చిన వారికి నచ్చలేదు అంతే..." అని.

ఆ తర్వాత నాటికపై పలువురు పనికట్టుకొని చెడు ప్రచారం చేసి ప్రదర్శనలు లేకుండా చేశారు. ఆతర్వాత నాటికను పేరుమార్చి ప్రదర్శించుకోమని సలహా ఇచ్చాడు. అలా నాటిక పేరు మార్చి దాదాపు 36 ప్రదర్శనలిచ్చి ప్రేక్షకులతో శభాషనిపించుకున్నాం.. నాటకంగా మలచి 18 ప్రదర్శనలిచ్చాం. మిత్రుడు విద్యాధర్ మునిపల్లె నాటిక సక్సెస్, ఫెయిల్యూర్స్ అనేవి ముందుగానే చూస్తాడు. ఫెయిల్ అవుతుందనుకుంటే వద్దని ముందే చెప్తాడు.. అది తన రచనైనా సరే... మొహమాటపడడు.. మొహానే చెప్పేస్తాడు. అందుకే అతనికి నాటకరంగంలో ఎంతమంది మిత్రులున్నారో అంతమంది శత్రువులూ వున్నారని నా నమ్మకం.

ఆ తర్వాత మరో నాటిక రాసివ్వమని అడిగాను.. దానికి అతను నువ్వే రాసుకో.. నువ్వురాయగలవు కదా అన్నాడు.. నాలోని రచయితను అతను గుర్తించాడు. సాధారణంగా ఒక రచయిత మరో రచయితను ఒప్పుకోలేడు. కానీ ఇతను ఒప్పుకుంటాడు.. అలాంటి మంచి మనసు ఏ కొద్ది మందికో వుంటుంది.

విద్యాధర్ రచయితగా బిజీగా వున్న సమయంలో నేను రాసిన నాటికలో ఒక వేషం కావాల్సి వచ్చి అడిగితే చెయ్యను అని చెప్పకుండా వెంటనే ఒప్పుకున్నాడు.పాత్ర నిడివి చిన్నదే అయినా చెయ్యటానికి ముందుకొచ్చాడు. ఆతర్వాత నేను రాసిన నాటికల్లో పలు ప్రధానపాత్రలు పోషించి నన్ను రచయితగా ప్రోత్సహించాడు..

మా ఇద్దరి శరీరాలు వేరుకావచ్చు ఆత్మలు మాత్రం ఒకటే..

ఎం.మధు
తుళ్ళూరు కళాపరిషత్, నిర్వాహకుడు
నటుడు, దర్శకుడు, తుళ్ళూరు
ఆంధ్రప్రదేశ్

# నామాట



ముందుగా నాకు జన్మనిచ్చిన తల్లిదండ్రులు (పద్మ, సూర్యనారాయణ) గార్లకి నమస్కారాలు తెలియజేసుకుంటున్నాను. నన్ను ఒక రచయితగా మలచటానికి చిన్నతనం నుండి తన ఒడిలో నన్ను కూర్చోపెట్టుకొని, అక్షరాలు దిద్దించి, పాఠాలు చెప్పి, అవసరమైన సమయంలో దండించి, నాకు అక్షర జ్ఞానంతోపాటు, నా బాల్యంలో నాటకాన్ని పరిచయం చేసిన వ్యక్తి మా నాన్న. ఆ తర్వాత నేను రాసిన గమనం నాటిక విషయంలో నన్ను రచయితగా మలచటానికి కూడా ఆయన చేసిన సాయం సామాన్యమైనది కాదు. అలాగే నా గురువుగా భావించే నాయుడు గోపిగారు కూడా పక్కనే కూర్చోపెట్టుకొని కథ రాయటం, కథలో నాటకీయతను జోడించటం, గుండెలని మీటే సంభాషలు రాయించటం వంటివి ఎన్నో రకాలుగా సాయంచేశారు.. నన్ను వీరిద్దరూ రచయితగా సమాజం ముందు నిలిపారు. వారికి నేను శిరసువంచి ప్రణామం చేస్తూ.. కొనసాగుతున్నాను.

నేను రచించిన నాటికలు, కథా నాటికలను ఒక సంపుటిగా ప్రచురించాలని సంకల్పించిన భజరంగీ పబ్లికేషన్స్ వారికి హృదయ పూర్వకంగా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

నా గురించి, నా రచనల గురించి పూర్తిగా తెలుసుకొని వాటిలో ఐదు నాటికలు ఎంపికచేసి ప్రచురించటం, నా నాటికలకు చిరస్థాయిగా అక్షరాకృతిన కల్పించటం నాకు చాలా ఆనందం కలిగించింది.

నేను మొదటరాసిన ''గమనం'' నాటిక... నా ఊహలకు ప్రాణం పోసుకొని రంగస్థలంపై రూపుదాల్చుకొని ప్రేక్షకులచే చప్పట్లు కొట్టించుకుని మేధావుల మన్ననలు పొంది ప్రతి పాత్ర వ్యక్తిగత బహుమతులు పొందటమేకాక నేను రచించిన సంభాషణలు ప్రేక్షకుల నోటినుండి పలకటం నేను రచయితగా సాధించిన ఒక రకమైన విజయంగా నాడు భావించాను. అంతేకాక నాటిక సమాజంలోని కొందరు వ్యక్తులను ప్రభావితం చెయ్యటం.. వారు వారి అనుభవాలను సభాముఖంగా ప్రస్తావించటం నేను విన్నాను.

ఆ సమయంలో నాకు అనిపించిందేంటంటే " ఒక నాటకం వ్యక్తులపై ఇంత ప్రభావం చూపుతుందా అని.. ఎవరండీ నాటకం చచ్చిపోతోంది అని చెప్పింది? నాటకం సజీవం.. అది ప్రదర్శించే కళాకారుడు వున్నంతవరకూ.. రచయితలున్నంత వరకూ సజీవంగానే వుండిపోతుంది. "అని. ఆదరణ కరువైన కళారూపాల జాబితాలోకి నాటకం వెళ్ళిపోవచ్చును గాక..అయినా సరే.. నాటకానికుండే ప్రత్యేకత నాటకానిదే.

రంగస్థలీమాత వున్నంత వరకూ నాటకం వుంటుంది. నాటకం రకరకాలుగా రూపాంతరం చెంది వుండచ్చు.. రకరకాల వేదికలను నిర్మించు కొంటూ వుండచ్చు.. నాటకం తల్లి.. ఏదేశంలో అయినా, ఏ జీవిలో అయినా, ఎప్పుడైనా, ఎక్కడైనా తల్లి తల్లే - బిడ్డ బిడ్డే. నాటకం నటీనటులకు తల్లి లాంటిది. రూపాంతరం చెంది ఆకర్షిస్తున్న సినిమాలు కానీ, సీరియల్స్ కానీ మరేపైనా కానీ ఆకర్షణీయమైన హంగులతో అలరించవచ్చు.. కానీ అంత మాత్రానికే తల్లి లాంటి నాటకాన్ని నిర్లక్ష్యం చెయ్యటం తప్పు.

ఈ విషయంలో నాకు పలువురు సినీ, టీ.వీ రచయితలు, దర్శకులతో వాగ్వాదాలు జరిగాయి. వారి దృష్టిలో వారు ఎంచుకున్న రంగం ఏదైతే వుంటుందో అది వారికి తల్లిలాంటిది. అది మంచిదే కానీ తల్లికి తల్లి అయిన నాటకాన్ని అసహ్యించుకోవాలసిన ఆవస్యకత వుండదు. ఏదైనా నా దృష్టిలో నాటకమే.. ఎందుకంటే నాటకీయతలేకుండా సినిమాకానీ, సీరియల్స్ కానీ మరే ఇతరాలైనా కానీ వుండవు కదా..

కథలో నాటకీయత, కథనంలో నాటకీయత, పాటలోనూ నాటకీయత, మన జీవితంలో కూడా నాటకీయ పరిణామాలు లేకుండా వుండవు. నాటకీకరణ అనేది లేకపోతే అది ఎలాంటి కళారూపమైనా, కథా వస్తుపైనా, ఇతరత్రా మరేదైనా అచేతనావస్థ కలిగిన అందమైన శవంలా నాకు అనిపిస్తుంది. శవం కొంతకాలానికి కుళ్ళిపోయి దుర్గంధం వెదజల్లి నట్లు.. ఈ నాటకీయత లేనిది ఏకథావస్తుపైనా కుళ్ళిన శవంలా దుర్గంధం వెదజల్లుతుంది అనుటకు ఎలాంటి సందేహం లేదన్నది నా అభిప్రాయం.

నా రచనల్లో క్రమేణా మార్పులు చోటు చేసుకుంటూ వచ్చాయి. గమనం నాటికతో మొదలైన నా నాటక గమనం ఈ సంవత్సరం

స్వర్ణకమలాలు నాటిక వరకూ దశలవారీగా పరిణామక్రమం చెందటం గమనించాను. ఇంకా పరిణతిగా ఆలోచించాల్సిన అవసరం వుంది. పదాలకు పదును పెడుతూ.. కథనంతో కథంతొక్కొలా కథలను కళ్ళకు కడుతూ.. అవసరమైన విషయాలను అందించాలన్న నా అభిలాషకి సహకరించిన,సహకరిస్తున్న మిత్రులు, నటదర్శకులు, ప్రేక్షకులకి, పాఠకులకీ నా హృదయపూర్వక నమఃసుమాంజలి.

మీ
విద్యాధర్ మునిపల్లె
నాటక రచయిత,దర్శకుడు
గుంటూరు

గంగోత్రి, పెదకాకాని

# గమనం (సాంఘికనాటిక)

**దర్శకత్వం : శ్రీ నాయుడు గోపి**

విశ్వం : నాయుడు గోపి
విజయ : టి. లక్ష్మి
విఠల్ : గుమ్మడి నాగేశ్వరరావు
పీటర్ : బి.బాబూరావు
శామ్యూల్ : శివరామకృష్ణ
సంగీతం : టి.సాంబశివరావు
లైటింగ్ : రాజా రత్నం
సెట్ : నాగేశ్వరరావు

## నాటిక రచన వెనుక

" గమనం " అనే ఈ నాటిక నా నాటకరంగ జీవన గమనాన్ని నిర్దేశించింది. అప్పటి వరకూ నేను సాంఘిక నాటికలు, నాటకాలు రాయటానికి ఏమాత్రం ఆసక్తి చూపించలేదు. తొలిసారిగా నేను " శ్రీ గురురాఘవేంద్ర చరితం " పద్యనాటకం రాసి ప్రముఖ నాటకరంగ దర్శకుడు, నటుడు అయిన శ్రీ నాయుడు గోపిగారిని కలవటం జరిగింది. ఆయన పద్య నాటకానికి దర్శకత్వం చేసేందుకు ముందుకు వచ్చారు. అదే సమయంలో నాలో సాంఘిక నాటికలు, నాటకాలు రాసే టాలెంట్ వుందని గుర్తించి ఆ దిశగా నన్ను ప్రోత్సహించారు. అలా ఆయన నాకు అందించిన ప్రోత్సాహం, నాటకీకరణ, కథావస్తువు, శిల్పం అనేటు వంటి అంశాలను నాకు బోధిస్తూ చేయించిన రచనే ఈ గమనం. అలా నాకు ఆయన గురువు అయ్యారు. ఇప్పటికే కాదు.. నేను జీవించి వున్నంతవరకూ నాకు శ్రీ నాయుడు గోపి గారు నాకు గురువే.. నేనెక్కడున్నా.. వారెక్కడున్నా ప్రతి రోజూ వారి పాదపద్మాలకు మనసులో నమస్కారం చేసుకోకుండా నా దినచర్య ప్రారంభం కాదు. ప్రత్యక్షంగా ఎదురు పడితే ప్రత్యక్షపాదనమస్కారం చేసుకుంటాను.

గురువుగారు నాటిక రాయమన్నారు బానే వుంది.. మరి కథావస్తువు ఎక్కడ నుండి తీసుకోవాలి అనే విషయంలో మల్లగుల్లాలు పడ్డాను. అప్పటి వరకూ కథను సృష్టించే సామర్ధ్యం నాకులేదు. అందుకే మా నాన్నగారు కీ.శే. సూర్యనారాయణ గారు రాసిన "సన్ స్ట్రోక్ "నాటిక స్ఫూర్తితో పలు మార్పులు చేసి రూపొందించినదే గమనం. ఎ.వి.కె. ఫౌండేషన్ వారి 2013 నాటికల పోటీకి ఎంపికైంది. గుర్తింపు తెచ్చిన నా తొలిరచన.

# గమనం

## కథాసంగ్రహం

విశ్వం రిటైర్ట్ స్కూల్ మాస్టారు. ఆయన మానవతావాది. ఆ ఊళ్ళో పలుకుబడి ఉన్న వ్యక్తి. ఆయన భార్య విజయ గృహిణి. విరల్ విశ్వం మాస్టారి కొడుకు. నిరుద్యోగి. నిబద్ధతలేని వ్యక్తి, మహాలక్ష్మి విశ్వం మాస్టారి కూతురు. తండ్రి ఆశయాలకు తగ్గట్లు డాక్టర్ చదివింది. తండ్రి మాట జవదాటదు. పీటర్ విశ్వం మాస్టారి ద్వారా సాయం పొంది అంచెలంచెలుగా ఎదిగిన వ్యక్తి. చదువు లేకపోయినా ఎదుటి మనిషిని చదువగలిగే నేర్పరి. అతని కొడుకు శ్యామ్. విదేశాల్లో డాక్టర్ ఉద్యోగం చేస్తున్నాడు.

విరల్ నిర్దిష్ట జీనగమనం లేకపోవటంతో తరచూ విశ్వం కొడుకుని వ్యతిరేకిస్తుంటాడు. విజయ ప్రతి విషయంలోనూ విరల్‌ని వెనకేసుకొస్తుంది. దీంతో విశ్వం మహాలక్ష్మి ఒకటిగా, విజయ విరల్‌లు ఒకటిగా ఆ కుటుంబంలో కనిపిస్తుంటారు. విశ్వం తన ఆశలన్నీ కూతురు మహాలక్ష్మి మీదే పెట్టుకుంటాడు. అలాంటి సమయంలో విరల్‌ని కొన్ని కారణాలవల్ల తల్లి విజయ వ్యతిరేకిస్తుంది. విశ్వం కొడుకు విరల్‌ను ఇంటినుండి గెంటేయటం జరుగుతుంది. తక్కువ కాలంలో ఎక్కువ డబ్బు సంపాదించుకు వస్తానని సవాల్ చేస్తూ ఇంటినుండి వెళ్లిపోతాడు విరల్. మహాలక్ష్మి తనకి నచ్చిన వాడిని ఇంట్లో వాళ్ళకి చెప్పకుండా పెళ్ళి చేసుకొని వెళ్ళిపోతుంది. దీంతో వృద్ధ దంపతులైన విశ్వం, విజయలు ఒంటరివారైపోతారు. అటువంటి సమయంలో పీటర్ తాను అండగా వుంటాడు. అయినా విశ్వం, విజయలు తమ మనోధైర్యాన్ని కోల్పోకుండా ఒకరికొకరై ఎలా జీవించారు. అటుపై అనేక భిన్నమైన సంఘటనలు చోటుచేసుకొని కథ ఎలా సుఖాంతమైందనేదే ఈ నాటిక "గమనం".

మీ
విద్యాధర్ మునిపల్లె

# గమనం

దర్శకత్వం : శ్రీ నాయుడు గోపి

## సీన్-1

(వేదికపై ఓ మధ్యతరగతి ఇల్లు. హాలు వాతావరణం. గోడకి ఒక ప్రక్కన ఉంచిన టేబుల్ మీద షీల్డులు తుడుస్తుంటాడు విశ్వం మాస్టారు. టేబుల్మీద తన కూతురు ఫోటోను చూసి మురిసిపోతుంటాడు.)

విజ : ఏమండోయ్.. మిమ్మల్నే.. (అంటూ వేదిక మీదకు వస్తుంది. విశ్వం మాస్టారు తనపనిలో వినిపించుకోలేదు) అబ్బబ్బబ్బ పిలిచినా పలక నంతగా ఏం చేస్తున్నారు?

విశ్వ : ఏంటే నీగోల?

విజ : నాది గోలలాగే వుంటుంది. ఇంతకేం చేస్తున్నారని?

విశ్వ : కనబడ్డంలే! నా చిట్టితల్లి సాధించిన మెడల్స్ కి దుమ్ముపడితే క్లీన్ చేస్తున్నానోయ్!

విజ : ఆడపిల్ల దానిపని అది చేసుకోవద్దూ..

విశ్వ : చదువుకుంది కదే! అది చదివిన చదువు నలుగురికీ ఉపయోగ పడాలిగా!

విజ : మీరిలా దాన్ని వెనకేసుకొస్తారు కాబట్టే నా మాటవినదు.

విశ్వ : నేను వింటున్నానుగా?

విజ : ఏం ఉపయోగం? ఇలా వింటారు.. అలా వదిలేస్తారు?

విశ్వ : అసలు భార్యమాటవిని బాగుపడ్డదెవరే?

విజ : మీ ఉద్దేశం?

విశ్వ : ఆనాటి శ్రీరాముడు కూడా సీతమ్మకోరిందని మాయలేడి వెంట పడ్డాడా లేదా, తర్వాత చిక్కులు కొని తెచ్చుకున్నాడా లేదా?

విజ : భార్యమాట లెక్కచెయ్యకుండా నాశనమైన రావణాసురుడూ అదే రామాయణంలో వున్నాడని మర్చిపోకండి. అయినా సీతమ్మవారు అలా కోరకపోతే అంత పెద్ద రామాయణమే వుండేది కాదు.

విశ్వ : అబ్బో.. అయితే.. ఇప్పుడేంటి? నీకు సాయం చెయ్యటానికి రిటైరై ఇంట్లోనే పడున్నాగా? చదువకున్న పిల్ల దాన్నెందుకే?

విజ : చదువుకున్న పిల్లయితే ఏంటంట గొప్ప? మొగుడితో కాపురం చెయ్యదా? ఇంత వండి పెట్టదా?

విశ్వ : వంట చెయ్యాల్సిన కర్మ దానికేంటే? అది మహారాణి.! దానికి తగ్గ ఏ రాకుమారుడో వస్తాడు గుర్రంమీదెక్కి?

విజ : మా నాన్నకూడా మా అమ్మతో సరిగ్గా ఇలాగే అనేవాడు? ఏమైంది? నన్ను చూడ్డానికి మీరు రిక్షాలో వచ్చారు.

విశ్వ : నామాలు పెట్టుకున్న ప్రతి కోతీ ఆంజనేయస్వామినే అనుకుంటే ఎలా? మీ నాన్న చాదస్తం కాకపోతే?

విజ : మా నాన్నది చాదస్తం అంటారేంటి?

విశ్వ : లేకపోతే ఏంటే? డాక్టర్ చదివిన నాకూతురెక్కడ? ఐదో క్లాసు కూడా పాసుకాని నువ్వెక్కడ? రాకుమారుడు.. బడిపంతులొచ్చాడు అదే గొప్ప.. నా కూతురుతో నీకు పోలికా?

విజ : మీకు గాంగా కూతురుందని..?

విశ్వ : కొడుకుని కూడా కన్నాంగదే..

విజ : వాడంటేనే మీకు పడదు.

విశ్వ : (వెటకారంగా) గొప్ప ప్రయోజకుడనీ.. (గొప్పగా) నా కూతరు నా మాటెప్పుడూ జవదాటదు. అదే నీకొడుకో..

విర : (లోపలనుంచి) అమ్మా కాఫీ..!

విశ్వ : అదిగో.. లేచింది అడ్డగాడిద.

విజ : స్టౌమీద కాఫీపెట్టి మీతో మాట్లాడుతూ మర్చిపొయ్యా..

విశ్వ : వెళ్ళు.. మిట్టమధ్యాహ్నం నిద్రలేచి కాఫీ అడుతున్న జాతిరత్నాన్ని కన్నందుకూ.. (ఏదో చెప్తాడన్నట్లు అక్కడే నిలబడి చూస్తుంటుంది.) ఏంటలా చూస్తున్నావ్.. తిడితే వినే ఓపిక మీ అమ్మాకొడుకులకుందేమో... తిట్టే ఓపిక నాకు లేదు. వెళ్ళి పనిచూసుకో!

విర : అబ్బా.. కాఫీనే.. (లోపలినుంచే)

విశ్వ : ఓండ్రు పెడుతున్నాడే..

విజ : నా కొడుకేం గాడిద కాదు. ఏమన్నా అంటే వాడిమీద పడతారు.

(వంటగదిలోకెల్తుంది. విశ్వం కూడా ఆమె వెనుకే వెల్తూ..)

విశ్వ : నాకదేపనే..! ఎద్దంత ఎదిగి ఎందుకూ పనికిరాని కొడుకుని చూసుకొని బాధపడేకన్నా, అత్తింట్లో కూడా కన్నవారికి గౌరవం తెచ్చే కూతుర్ని చూసుకొని గర్వపడమన్నారు.

విజ : మీరలాగే గర్వపడండి (బయటికొస్తుంది.)

విశ్వ : నువ్వేం చెప్పక్కర్లే..! నీ కొడుకులాగా..అది చవటకాదు. డాక్టర్ మహాలక్ష్మి. ఎంబిబిఎస్., యూనివర్సిటీ ఫస్ట్, గోల్డ్ మెడలిస్ట్. ఈ రోజో రేపో అమెరికా వెళుతుంది. ఎమ్మెస్ కూడా పూర్తి చేసుకొస్తుంది.మరి నీ కొడుకో.. బొటాబొటి మార్కులతో ముక్కాడు. ఎం.కాం.,! ఉద్యోగం దొరుకుతుందన్న ఆశకూడా లేదు.

విర : అమ్మా.. అరచి అరచి గొంతెండి పోతుంది.

విశ్వ : త్వరగాపో.. గొంతెండి పోయినా పోతాడు.!

విర : కొడుకుని పట్టుకొని ఏంటా మాటలు.(కాఫీ గ్లాసుతో కొడుకు గదిలోకి వెల్తుంది.)

విశ్వ: భూమ్మీద తిండిగింజలు ముక్కిపోతాయని కాబోలు భగవంతుడు ఇలాంటి కొడుకుల్ని పుట్టిస్తుంటాడు.(అని తనలో తనే గొణుక్కుం టూ వెళ్ళి తన సీట్లో తను కూర్చుంటాడు. విఠల్ కాఫీ తాగుటూ బయటికి వస్తాడు. అతని వెనుకే విజయకూడా వస్తుంది.)

విఠ : ఏంటమ్మా కాఫీ ఇలా వున్నాయ్.!

విజ : అదీ..! మీ నాన్నతో మాట్లాడుతూ.. స్టౌమీద కాఫీ పెట్టి మర్చిపా య్యారా! అందుకే..

విఠ : పొద్దునే మొదలెట్టుంటాడు కాకిగోల.!

విశ్వ: (వెటకారంగా) పొద్దున్నే.. ఏమేవ్.. పొద్దునే అట.. (గడియారం వైపు చూస్తూ..) విఠల్ గారికి మిట్టమధ్యాహ్నం పన్నెండున్నరైతేనే తెల్లా రుతుందని తెలీదే. అందుకే అందరూ అనుకునే పొద్దనే ఐదుగంటల కే నిద్రలేచి పాలపేకట్లు, న్యూసుపేపర్లు తీసుకొచ్చా.! వాకింగ్ కి వెళ్ళి కూరలు పట్టుకొచ్చా! నేను నిద్రలేచేసరికి సూర్యడు తూర్పునుండి వస్తుంటే తెల్లారిందనుకున్నా.! కాదే.! సూర్యుడు మన నడినెత్తినున్న ప్పుడే నీ సుపుత్రుడికి తెల్లారుతుంది. (విఠల్ ఏదో మాట్లాడబోతాడు. విజయ అతన్ని వారిస్తుంది.) ఒక టైం పంక్చువాలిటీలేదు. అడ్డగాడిదలా ఊరంతా తిరగటం.. ఏ కోడికూసే టైంకో కొంపకి చేరటం. అది అయ్య గారి దినచర్య.! దిక్కుమాలిన స్నేహాలు.. దిక్కుమాలిన స్నేహాలు. (విఠల్ కాఫీ గ్లాసు విజయ చేతిలో పెట్టాడు.)

విజ : అదేంటిరా సగం కాఫీ ఇందులోనే వుంచేశావ్.

విఠ : ఆయన మాటల్లాగే కాఫీ కూడా ఛండాలంగా వుంది.(విశ్వం ఆవేశంతో ఏదో అనబోతాడు. విజయ సైగలతోనే భర్తని ఆపుతుంది.) నువ్వెళ్ళి వేణ్ణీళ్ళు పెట్టు. స్నానం చేయాలి.!

విశ్వ: మనిషన్నవాడెవ్వడూ మిట్టమధ్యాహ్నాలు వేన్నీళ్ళు పోసుకోడు. పైగా ఎండాకాలం. చెప్పు నీ కొడుక్కి.

విఠ : ఆయన దృష్ఠిలో నేను మనిషిని కాను. గాడిదని కదా.. చెప్పాయనకి.

విజ : కాగేవున్నాయిరా (అంటూ వంటగదిలోకి వెళుతుంది.)

విశ్వ: గ్యాస్ సిలెండర్ల కోటా సగానికి కోసింది గవర్నమెంటు. కోటాదాటితే రేట్లు తట్టుకోటం నావల్లకాదు.

విఠ : నాలాంటి అడ్డగాడిదలతో చెప్పినా ఒకటే గవర్నమెంటుకి చెప్పినా ఒకటే. (అంటూ వేణ్ణీళ్ళ గిన్నె పట్టుకొని విఠల్ గదిలోకి వెళుతుంది.)

విశ్వ: అంటే.!

విఠ : విని ఊరుకుంటాం.!

విశ్వ: వీటికేం తక్కువలేదు.!

విజ : నీళ్ళుతోడారా.! (విఠల్ పేపర్ కిందపడేసి తనగదిలోకి వెళతాడు. విశ్వం వంగి తియ్యబోతాడు. విజయ భర్తని ఆగమని తనే తీసి సర్దుతుంది.)

విశ్వ: ఓరి భగవంతుడా.! కొడుకు పుట్టాడని అందరి తండ్రుల్లానే ఆనందించాను..

పుత్రోత్సాహము తండ్రికి పుత్రుడు జనియించి నపుడు పుట్టదు, జనులా పుత్రుని కనుగొని పొగడగ, పుత్రోత్సాహము నాడు పొందుతారని ఎందుకన్నారో ఇప్పుడర్థమైంది.

విజ : (లోపలినుండి వస్తూ..) ఏమని?

విశ్వ : కన్నది కొడుకుని కాదని..

విజ : అంటే?

విశ్వ : ఏళ్ళొచ్చినా తండ్రి పెన్షన్ మీద, చెల్లి సంపాదనమీదా ఆధారపడి బతుకుతున్న బడుద్దాయని..!

విజ : ఇంకోసారి వాణ్ణంటే ఊరుకోను.

విశ్వ : ఏం చేస్తావే.. విడాకులిస్తావా? పెళ్ళయిన దగ్గర్నుండి ఇలాంటివి వింటాడనే ఆశ. ఇది వాడికివ్వు.

విజ : ఏంటండీ ఇది?

విశ్వ : మీరే ఇవ్వచ్చుగా.!

విజ : నేనిస్తే ఏం జరుగుతుందో చూస్తున్నావ్ గా.! ఎంతమంది కాళ్ళూ గడ్డాలు పట్టుకొని అడగను చెప్పు. నాకు తెలిసిన వాళ్ళలో చిట్ట చివరి వ్యక్తి ఇతను. దీన్ని కూడా ఇంతకు ముందులా చేస్తే..

విజ : సరే.. ఇస్తాలెండి..(దేవుడి దగ్గర పెడుతుంది) అది సరే.! పొద్దుననగా డెలివరీ కేసని వెళ్ళింది అమ్మాయ్. ఈ పెళ్ళి చూపులవాళ్ళు సాయంత్రానికి వస్తానన్నారు. ఇది చూస్తే ఇంతవరకూ రాలేదు. అసలు పెళ్ళి చూపులని అమ్మాయికి చెప్పారాలేదా?

విశ్వ : చెప్పాలేవే.!

విజ : ఫోన్ చెయ్యండి ఎక్కడిదాకా వచ్చిందో?

విశ్వ : (ఫోన్ చేస్తాడు. మహాలక్ష్మి సెల్ స్విచ్ఛాఫ్ వస్తుంది. భార్య ఆతృతగా చూస్తుంది.) ఫోన్ స్విచాఫ్ చేసిందే..ఆపరేషన్ థియేటర్లో వుందేమో. కాసేపాగి ట్రై చేద్దాం.!

విజ : ఓసారి హాస్పిటల్ కు చెయ్యకూడదా.!

విశ్వ : నీమాట నీదేకానీ నా మాట వినవా?

విజ : అది కాదండీ.. మూడు రోజుల నుండి వరుసగా ఆపరేషన్లు.. వేళాపాళా లేకుండా ఏంటీ ఉద్యోగం. అసలీ డాక్టరీ చదివించద్దో అన్నా.. మీరు వినలా.. అదీ వినలా.. ఇప్పుడు చూడండి.

విశ్వ : అబ్బబ్బబ్బ.. మీ పుట్టింటోళ్ళంతా ఒకలా వుంటారేంటే.!

విజ : అంటే?

విశ్వ : వాళ్ళకు తోచదు. ఇంకోళ్ళు చెప్తే వినరు.

విజ : నన్ననండి..! మధ్యలో మావాళ్ళ గోలెందుకు. ముందు ఫోన్ చేస్తారా లేదా?

విశ్వ : చెయ్యక చస్తానా.! చెయ్యకపోతే చస్తాను. (ఫోన్ డైల్ చేస్తుంటాడు) ఫోన్

మోగుతోందే.. (ఉరుములు, మెరుపులు) అదిగో వానపడేట్టుంది. పైకెళ్ళి ఆరేసిన బట్టలు తీసుకురా.!

విజ : ఎండాకాలం వానలేంటండీ.!

విశ్వ : రోహిణీకార్తె మొదలైందిగా ! రోళ్ళు కూడా పగులుతాయంటారు. (విజయ డాబా మీదకెళుతుంది) హలో.. అమ్మా.. నేను డాక్టర్ మహాలక్ష్మి గారి ఫాదర్ ని. డాక్టర్ గారూ.. ఆ. వెళ్ళిపోయారా? ఎప్పుడూ? ఎంతసేపైందమ్మా.! పందింటికే.. ఏంలేదు తల్లీ ఇంకా ఇంటికి రాలేదు..! సెల్ స్విచాఫ్ లో వుంది.! సరేనమ్మా.! ఒకవేళ ఆసుపత్రికి వస్తే నేను ఫోన్ చేశానని చెప్పమ్మా..! (విజయ ఆరేసిన బట్టలు తీసుకొని హాల్లో వున్న దివాన్ కాట్ మీద వుంచి మడతలేస్తూ. భర్తవైపు చూస్తుంది.) అమ్మాయి హాస్పిటల్ నుండి బయల్దేరి చాలా సేపయిందట.

విజ : మరి సెల్ స్విచాఫ్ ఎందుకు చేసిందో.!

విశ్వ : ఏంటే ! నువ్వు ప్రతిదానికీ అలా కంగారు పడతావ్. సెల్ ఛార్జింగ్ అయిపోయి వుంటుందిలే.

విజ : ఏమే.! ఆ వీధి చివరిదాకా వచ్చింది ఇంటికిరాదా.! నువ్వూ నీ చాదస్తం కాకపోతే.! సరే.! నీ కొడుకుతో ఈ రోజు వాడిపెత్తనాలన్నీ వాయిదా వేసుకొని ఇంట్లోనే వుండమని చెప్పు. సాయంత్రం నా కూతురికి పెళ్ళి చూపులు.

విజ : పోయినసారి కూడా ఇలా వుండమన్నారు. అందరినీ పరిచయం చేసి వీడిని మాత్రం పరిచయం చెయ్యలేదు. ఎంత బాధపడ్డాడో తెలుసా?

విశ్వ : ఏమని చెయ్యమంటావే.! విశ్వం మాస్టారి కూతురు డాక్టర్ మహాలక్ష్మి ఎంబిబిఎస్. నువ్వు విశ్వం మాస్టారి భార్యవి గృహిణి. మరి విశ్వం మాస్టారి అబ్బాయ్ .. ఏం చేస్తున్నాడని అడిగితే నేనేం చెప్పను. ఎంతోమందికి ఎన్నో సలహాలిచ్చి బాగుచేసిన నేను, సొంత కొడుకుని బాగు చేసుకోలేక పోయానని చెప్పమంటావా? చేతికి అందిరావాల్సిన వయసులో కూడా ఎందుకూ పనికిరాకుండా పోయాడని చెప్పమంతావా? నా మాటంటేనే గిట్టదు వాడికి. పైగా నాతో మాట్లాడటానికి పౌరషమొకటి. వాడు స్థిరపడాలన్నదే నా బాధ కూడా.. ఎప్పటికి అర్థం చేసుకుంటాడో. చెప్పు వాడికి పనులు చూసుకోటానికి మాత్రమే దానికి తోడబుట్టినోడిగా ఈ రోజు ఇంట్లో పడుండమను.

విర : (నీట్ గా డ్రస్ అయ్యి బయటకొస్తాడు. ఇంటర్వ్యూకి వెళ్ళేలా ఫైల్ ఒకటి చేతిలోవుంటుంది. విజయ దేవుడి దగ్గర పెట్టిన జాయినింగ్ ఆర్డర్ తీసుకొస్తుంది. ఫ్రెండ్స్ బైక్ హారన్లు మోగిస్తుంటారు. వస్తున్నా అని సైగ చేస్తాడు.) అమ్మా భోజనం బైట చేస్తాను.(వెళ్ళబోతాడు.)

విజ : ఒక్క నిమిషం నాన్నా.. ఇదిగో.. ఇదీ..!

విర : ఏంటిది?

విజ : అదీ.! అదీ.! నువ్వే చూడు.! (విఠల్ చేతిలో పెడుతుంది. విఠల్ దాన్ని చదివి, ముక్కలు ముక్కలుగా చించి పారేస్తాడు. విశ్వంకి కోపం వస్తుంది. ఏమీ మాట్లాడలేక కుర్చీలో కూలబడ్డాడు.)

విఠ : ఇంకెప్పుడూ ఇలాంటి తలకుమాసిన కంపెనీల్లో ఉద్యోగాలున్నా యంటూ లెటర్స్ తీసుకురావద్దమ్మా.!

విజ : ఆ ఉద్యోగం కోసం.!

విఠ : ఎవరెంత పలుకుబడి ఉపయోగించారో.. నాకు బాగా తెలుసు. ఒకప్పుడాడికి లేకపోతే మనం సాయం చేశాం. బైటోడికి అడ్డం వుండి మరీ లోనిప్పించిన పెద్ద మనిషికి తన కొడుక్కిప్పించాలని తెలీదా? బైటోడు బాగుపడాలి. కొడుకు మాత్రం బాగుపడితే ఓర్చుకో లేడు. ఇప్పుడా దిక్కుమాలినోడికి కంపెనీలో నేను పనిచేయాలా? మన ముందు కుర్చీలో కూర్చునే అర్హత లేని ఆ లోక్లాస్ ఫెలోగాడి కంపెనీకెళ్ళి, బాబూ..! నా కొడుక్కి ఉద్యోగం కావాలని అడుక్కొని తెచ్చిన ఈ ముష్టి నాకవసరంలేదు. చెప్పాయనకి. (బైటికెళ్ళబోతాడు)

విశ్వ : ఎంతోమందికి పాఠాలు చెప్పి రిటైరయ్యాను. ఒకళ్ళతో చెప్పించుకునే స్థితిలో లేనని చెప్పు నీ కొడుక్కి.. అయినా ఏళ్ళు దాటుతున్నా పైసా సంపాదించటం చేతకాని వెధవలకి మాట్లాడే అర్హత లేదని చెప్పు. (విఠల్ మౌనం)

విశ్వ : స్వశక్తి మీద పైకొచ్చి, ఎంతో మందికి ఉపాధి కల్పిస్తున్న అలాంటి వ్యక్తి దగ్గర పనిచేస్తూ జీవితంలో ఎలా ఎదగాలో తెలుసుకుంటాడని అపాయింట్మెంట్ ఆర్డర్ తెస్తే చించేశాడు. దరిద్రుణ్ణి ఎవ్వరూ బాగు చెయ్యలేరు. ఎలాంటి నిర్దిష్ట జీవన గమనంలేని ఇలాంటి కొడుకుని కన్నందుకు మనలాంటి తల్లి దండ్రులకీ శిక్ష తప్పదే.!

విఠ : ఆయనగారన్నట్లు ఇక్కడెవ్వరూ ఖాళీగా కూర్చోట్లేదు. యూత్ లో ఏదో చెయ్యాలనే తపన ఉంది. అవకాశాలు రాకే ఎదురు చూస్తున్నారు.

విశ్వ : వచ్చిన అవకాశాలను వదులుకునే వాళ్ళనేమంటారే?

విఠ : బూట్ల కంపెనీలో గుమస్తా ఉద్యోగాలు, దేవాలయాల్లో చెప్పుల స్టాండు ఉద్యోగాలు.. మావల్లకాదు.

విశ్వ : రైట్..! ఈ తడికచాటు మాటలొద్దు. ఫేస్ టూ ఫేస్ మాట్లాడు. చెప్పు. నీ జీవితంలో నువ్వేమవ్వాలను కుంటున్నావ్?

విఠ : ధనవంతుడ్నవ్వాలనుకుంటున్నా.!

విజ : రేయ్.!

విఠ : నిజమేనమ్మా.. తప్పేముంది? ఒక్కోళ్ళకీ ఒక్కో ఆశయం వుంటుంది. ఒకళ్ళకి డాక్టర్ అవ్వాలనీ, ఒకళ్ళకి లాయరవ్వాలనీ, నాకు ధనవం తుడవ్వాలనీ.

విశ్వ : ఆశయముండగానే చాలదుసార్..! దానికి తగిన కృషి వుండాలి.

విఠ : ఆ ప్రయత్నంలోనే వున్నా

విశ్వ : రైట్.. నువ్వు కృషిచేసే ప్రయత్నంలో వున్నావ్.. కానీ కృషి మాత్రం చెయ్యట్లేదు.

విఠ : నాన్నా..

విశ్వ : ఏం.. ఆవేశం పొడుచుకొచ్చిందా?

విజ : అదికాదండీ

విశ్వ : మధ్యలో మాట్లాడకు. ప్రతిదానికీ కొడుకుని వెనకేసుకస్తావ్..

విఠ : ఏంటమ్మా ఈన.. కొడుకుని అర్థం చేసుకోడా?

విశ్వ : కన్న మాకే కాదురా.. నీకు నువ్వు కూడా అర్థంకావు. ఎందుకంటే నీకంటూ ఒక వ్యక్తిత్వంలేదు. నీకు దేనిమీద అవగాహన లేదు. నువ్వు ఒకళ్ళ సలహాతీసుకోవు.

విఠ : మీమాట మీదే కానీ, నామాట వినరా?

విశ్వ : ఇక వింటానికేంలేదు. నేను చెప్పటమే మిగిలింది. నీ కాళ్ళమీద నువ్వు నిలబడు.

విఠ : అంటే.. ఇంట్లోంచి వెళ్ళిపోమనా.?

విశ్వ : కరెక్ట్ గా క్యాచ్ చేశావ్.. గెట్ లాస్ట్.

విఠ : ఆస్తిలో నాకివ్వాల్సిన వాటా నాకిస్తే నాదారి నేను చూసుకుంటా..

విజ : ఆయనేదో ఆవేశంలో అంటే నువ్వేంటిరా? చెప్పు నాన్నగారికి ఆయన చెప్పినట్లే వింటానని.

విఠ : నేనెందుకు చెప్పాలి? అసలు నాన్నంటే ఎలా వుండాలి. కొడుకు ఎదుగుతానంటే వాడికి సాయం చెయ్యాలి. అంతేకానీ

విజ : నువ్వూరుకోరా..

విశ్వ : సిగ్గులేకుండా మళ్ళా మాటలొకటి..

విజ : మీరుకూడా ఏంటండీ..?

విశ్వ : చూస్తున్నావ్ గా.. కుక్కవాగినట్లు వాగుతున్నాడు ఇందాకట్నుంచి. అరిచే కుక్కల్ని రాళ్ళతో తరిమేస్తారు.

విఠ : నన్ను డబ్బుతో తరిమెయ్యండీ..

విశ్వ : చిల్లిగవ్వ ఇవ్వక్కర్లేదు. నీకు దిక్కున్నచోట చెప్పుకో.. (విజయ ఏదో చెప్పబోతుంది. విఠల్ వినకుండా)

విఠ : నువ్వూరుకోమ్మా..నీకు తెలీదు.. చెల్లెలి మెర్చూర్ ఫంక్షన్ ఎంత గ్రాండ్ గా చేశాడు. దాని మెడిసిన్ కి ఎంత ఖర్చుపెట్టాడు. సగం ఆస్తి అమ్మేశాడు. రేపు దాని పెళ్ళి ఇంకెంత గ్రాండ్ గా చేస్తాడో.. దీన్ని చేసుకోటానికొచ్చినోడు ఊరకే వుంటాడా.. లక్షల్లో అడుగుతాడు. అప్పుడున్న కాస్తా అమ్మేస్తే నాసంగతేంటి? అందుకే నాకు రావాల్సిన వాటా నాకిస్తే నాదారి నేను చూసుకుంటా.. నువ్వూ నాతో వచ్చేద్దుగాని.

విశ్వ : ఇది నేను సంపాదించుకున్న ఆస్తి.. నా ఇష్టమొచ్చినట్లు ఖర్చుచేసు కుంటా.. అడిగే అధికారం ఎవ్వరికీలేదు.

విఠ : కనమని నేనడిగానా? దానికంతంత ఖర్చుపెట్టి నాకెందుకివ్వవు. అదేనా నీకు

పుట్టింది నేను కాదా?

విశ్వ : నోర్ముయ్.. నేను చదవమన్న చదువు నువ్వు చదివావా? నేను చెప్పినట్లు ఏరోజన్నా విన్నావా? అదిరా నాకు సరైన వారసురాలు. నేను చెప్పినట్లు అది డాక్టర్ చదివింది. ఈ రోజుకూ నామాట జవదాటదు. అయినా దానికీ పైసా ఇవ్వలేదు. నీకూ ఇవ్వాల్సిన అవసరంలేదు.

విఠ : నా చదువుకు తక్కువ ఖర్చయింది. దానికి ఎక్కువ ఖర్చయింది. అంటే నేను నీకు డబ్బు ఆదాచేశాను. ఆ డబ్బే నాకిస్తే ఏ వ్యాపారమో చేసుకుంటా..

విశ్వ : నేనేవిషయమైనా ఒకసారే చెప్తాను. నీకింకోసారి చెప్తున్నా.. నీ దంటూ ఈ ఇంట్లో ఏదీ లేదు. ఆఖరికి నువ్వేసుకున్న బట్టలతో సహా.. అన్నీ నేను కొనిచ్చినవే..

విఠ : నేను కొన్నాను.. నేను కొన్నాను అంటున్నావ్.. ఎవరికోసం కొన్నావ్? నీకు పుట్టినోళ్ళకోసమేగా.. అయినా చస్తూ.. చస్తూ పట్టుకు పోతాడా.. (అంటూ తల్లికి చెప్పబోయాడు..విజయ విఠల్ చెంప పగిలిపోయేలా కొట్టింది. విఠల్ షాక్ అయ్యాడు.)

విజ : నోర్ముయ్.. ఇందాకట్నుంచి చూస్తున్నా.. నోటికెంతమాటొస్తే అంత మాటా అంటున్నావ్.. ఇప్పటిదాకా నేను నిన్ను వెనకేసుకొచ్చి పెద్ద తప్పేచేశా.. రేయ్.. అలా ఎందుకు చేశానో తెలుసా? ఏరోజుకన్న నువ్వు తెలుసుకుంటావ్ లే అన్న ఆశతో.. నాకిప్పుడు అర్థమైంది.. నువ్వు ఎప్పటికీ తెలుసుకోలేవని.

విఠ : ఆల్రైట్. మీ మొగుడూ పెళ్ళాలిద్దరూ ఒకటయ్యారన్నమాట. మీ ఇద్దరికీ కూతురే కావాలి.. కొడుకు వద్దనమాట.. ఇక ఈ ఇంట్లో వుండాల్సిన అవసరంలేదు. కేవలం కట్టుబట్టలతో వెల్తున్నా.. కోట్లు సంపాదించాకే వస్తా..

విజ : నువ్వే రాక్కర్లేదు.

విఠ : నీకూ నీ మొగుడికి పట్టిన పిచ్చే పట్టింది. అందుకే ఇలా అంటున్నావ్. కట్టుబట్టలతో వెల్తున్నా.. (విఠల్ ఆవేశంగా బయటికెల్తాడు. విశ్వం విఠల్ బాధపడుతూ ఒకరికొకరు దగ్గరగా వస్తారు.. ఇంతలో పీటర్ లోనికొస్తాడు)

పీట : నమస్కారం మాస్టారూ..

విశ్వ : రా పీటర్.. రా..రా..

పీట : అయ్యా.. తమరూ అమ్మగోరూ.. అలా పక్కపక్కనే నుంచోండి.

విశ్వ : ఏంటి పీటర్?

పీట : నుంచోండయ్యా..

విశ్వ : రావే..రా.. (పక్కపక్కనే నుంచుంటారు. పీటర్ తన సంచీలోంచి రెండు జతల చెప్పులు తీసి ఇస్తాడు.)

విశ్వ : పీటర్.. ప్రతి సంవత్సరం ఇలా చెయ్యటం ఏం బాలేదు.

పీట : అయ్యా.! నేనీ స్థితిలో వుంటానికి కారణం మీరు. ముప్పై ఐదేళ్ళ క్రితం ఇదే రోజు నేను పొట్టచేత్తో పట్టుకొని కులవృత్తి చేసుకుందామని ఈ ఊరొచ్చాను.

దేవుడిలా మీరు నాకు ఆరోజు డబ్బుసాయం చేశారు. బ్యాంకులో మీరు అడ్డముండి చెప్పుల దుకాణం పెట్టిచ్చారు. అంచెలంచెలుగా ఈ రోజు ఇన్ని దుకానాలకి యజమానినయ్యానంటే అదంతా మీ చేతి సలవేనయ్యా..

విశ్వ : పొగడ్త పన్నీరులాంటిదయ్యా.. మీద చల్లుకోవాలే కానీ తాగెయ్య కూడదు.

పీట : మీరు చేసిన పనులు గుర్తచేస్తే మీకు పొగడ్తలాగే అనిపిస్తది. కానీ నిజం నిజంకాకుండా పోదుగా.. చెప్పులు కుట్టుకుంటా బతకాల్సిన నా కొడుకుని ప్రయోజకుడ్ని చేసిన గొప్ప మనసయ్యా మీది.. ప్రతి సంవత్సరం మీ ఇద్దరికీ నేనే చెప్పులు కుట్టి తెస్తాను. కాదనకుండా తీసుకోండి.. (దణ్ణంపెడతాడు.)

విశ్వ : ఎప్పుడూ ఏదో ఒకటి చెప్పి ఒప్పించేస్తావ్..(చెప్పులు తొడుక్కుంటారు ఇద్దరూ..) ఆరోజు నేనొక సామాన్యునిలా స్పందించానంతే.

విజ : చేసిన చిన్న సాయాన్ని గుర్తుపెట్టుకునే నీలాంటివాళ్ళు ఎంతమంది వుంటారు పీటర్?

పీట : బాబుగారు ఉద్యోగంలోకి ఎప్పటి నుండివస్తామన్నారయ్యా..

విశ్వ : నువ్వు మరెవరినైనా చూసుకో పీటర్.

పీట : అదేందండీ.. (విజయవైపు చూశాడు. విజయ తలదించుకుంది. దివాన్ కాట్ మీదున్న బట్టలు తీసుకొని లోనికి వెళ్ళిపోయింది.)

విశ్వ : వాడా ఉద్యోగం చెయ్యనన్నాడయ్యా..

పీట : ఏం? నాదగ్గర పనిచెయ్యటానికేమైనా ఆలోచిస్తుంటే చెప్పండి మాట్టారూ.. వ్యాపారంలో వాటా ఇస్తానని ఎప్పుడో చెప్పాను. మీరే వద్దన్నారు. ఇప్పటికైనా ఫర్వాలేదు.

విశ్వ : నువ్వు వాటా ఇవ్వటానికి, నేను తీసుకోటానికి మనిద్దరి మధ్య వున్నది వ్యాపార సంబంధం కాదు.

పీట : క్షమించండయ్యా.. నా ఉద్దేశం అదికాదు. మీరే అన్నారుగా బాబుగారు ఉద్యోగం కోసం అక్కడా ఇక్కడా తిరుగుతున్నారు. ఎక్కడా రావట్లేదని. మన కంపెనీలోనే అయితే మన మనిషిగా, బాధ్యతగా వుంటాడని అనుకున్నాను. యాపారంలో వాటా ఇస్తానని ఎందుకన్నానో తెలుసా.. యాపారానికి కావాల్సింది నమ్మకం. యాపారమే ఆయనదైతే అభివృద్ధి చేసుకోటానికి ఎక్కవ శ్రమచేస్తాడు. మరి కొంతమందికి పని దొరికిద్ది.. ఇయన్నీ ఆలోచిచ్చే అపాయింట్మెంటు ఆర్డరిచ్చా..

విశ్వ : వాళ్ళకి కావాల్సింది హక్కులేనయ్యా.. బాధ్యతలు కావు. అయినా మనం అనుకున్నవన్నీ జరిగితే అది జీవితం ఎందుకవుతుంది. ఆ లెక్కలేవో నేనే చూసిపెడతాలే..

పీట : వద్దయ్యా.. ఈ వయసులో మిమ్మల్ని కట్టపెట్టటం.. వద్దులేయ్యా.. నేనే ఏదోటి ఆలోచిత్తాలే.. టౌన్ లో ఇంకో రెండు దుకానాలు కొనిపెట్టా.. మంచి రోజు చూసి

మీరు ప్రారంభిస్తే,..

విశ్వ : పీటర్.. ఎంతోమందికి ఉపాధి కల్పించాలన్న నీ సంకల్పం చాలా గొప్పది. నీలాంటి వాడికి ఆ దేవుడు ఎప్పుడూ మంచే చేస్తాడు. ఇప్పుడు పంచాంగం చూడలేను. తర్వాత చూసి చెప్తాలే.

పీట : అయ్యా.. నేనెల్లొత్తా..

విశ్వ : మంచిది వెళ్ళిరా.. (పీటర్ వెళ్ళిపోయాడు. లోపలి నుండి విజయ కేక పెట్టింది. విశ్వం ఏమైందంటూ పరుగుపరుగున లోనికెళ్ళాడు.. విజయ ఏడుస్తూ వచ్చి దివాన్ కాట్ మీద కూర్చుంది. ఆమె వెనకే విశ్వం చేతిలో లెటర్తో వచ్చాడు. లెటర్ చదువుతూండగానే ఫోన్ రింగయింది. విశ్వం వెళ్ళి ఫోన్ లిఫ్ట్ చేశాడు.)

విశ్వ : హలో.. మహాలక్ష్మి.. ఎందుకిలా చేశావ్? ఆ.. ఎందుకిలా చేశావ్.? నా మర్యాదని మంట గలిపి ఎవడో అనామకుడితో వెళ్ళిపోయావ్.. నోర్ముయ్.. పెళ్ళిచేసుకొని వెళ్ళిపోయావు అనరే.. లేచిపోయిందని నా మొహాన ఉమ్మేస్తారు. ఇంకెప్పుడూ నాతో మాట్లాడాలని ట్రై చెయ్యకు. నేను చచ్చినా కూడా నా మొహం చూడ్డానికి రాకు. (బాధపడుతూ ఫోన్ పెట్టేశాడు. విజయ, విశ్వం ఇద్దరూ ఏకాకులై పోయామన్న బాధతో వుండిపోతారు.)

# లైట్స్ ఆఫ్

## సీన్ 2

(విశ్వం మాస్టారు కుర్చీలో కూర్చొని కూతురు సాధించిన మెడల్స్ నే తడుముతూ వుంటాడు. ఇంతలో వంటగదిలోంచి పెద్ద చప్పుడు అవుతుంది. హడావుడిగా లేస్తాడు.)

విశ్వ : ఏం జరిగిందే.. కిందపడ్డావా ఏంటి? (నడవబోతూ కాలికి కుర్చీతగిలి ముందుకు పడబోయి అంతలోనే తమాయించుకుంటాడు.)

విజ : యిస్.. యిస్.. (అని మూలుగుతూ వేదిక మీదికొస్తుంది విజయ. విశ్వం ఎదురెళ్ళి ఆమెను దీవాన్ కాట్ మీద కూర్చోబెడతాడు.) కుక్కర్ కాలిమీద పడిందండీ..

విశ్వ : సాయం కోసం పిలిస్తే రానా.!

విజ : అవసరమైతే నేను పిలవనా?

విశ్వ : ఏం పిలిచావ్ ఇప్పుడు

విజ : పిలిచేలోపే ఇలా జరిగింది.

విశ్వ : అందుకే ఏ పనీ ఒంటరిగా చేయద్దని చెప్తా..

విజ : నా ఒంట్లో ఎపికుందిగా..

విశ్వ : నువ్వు చిన్నపిల్లవి కావుగా..

విజ : మీకన్నా చిన్నదాన్నేగా..

విశ్వ : విజయా.. వయసు మీదపడుతున్నా నీ చలోక్తులకి లోటులేదు. నీ ఆరోగ్యాన్ని కూడా చూసుకోవాలిగా.. డాక్టర్ బరువులు మోయ ద్దన్నాడా లేదా.. ఇంకెప్పుడూ ఇలాంటి సాహసాలు చెయ్యకు. అవసరమైతే నన్ను పిలువు.

విజ : సరేలెండి..

విశ్వ : నువ్వలాగే అంటావ్.. పిలవ్వు..

విజ : పిలుస్తాలెండి..

విశ్వ : చూస్తాగా..

విజ : ఏమండీ.. (ఏదో చెప్పబోయి ఆగిపోతుంది)

విశ్వ : ఏంటే..? (విజయ మొహం తిప్పుకుంటుంది. ఆమెలో అంతర్లీనంగా ఏదో తెలీని ఆర్ద్రత.. భర్తకు ఎలా చెప్పాలో అర్థంకాని పరిస్థితి. కలసి ఆమె కళ్ళలో నీటిధారలు భర్తకు కనబడనీకుండా దాచేస్తుంది. కానీ విశ్వం ఆమె గడ్డం పట్టుకొని తనవైపు తిప్పుకుంటూ..)

విశ్వ : ఏంటే.. నాతో చెప్పకూడదా..

విజ : ఏంలేదండీ.!

విశ్వ : విజయా.! ఈ వయసులో మనిద్దరం ఒకరికొకరం సాయంగా వుండాలి. నీ మనసులో ఏదో పెట్టుకొని కేవలం నువ్వే బాధపడటం మంచిది కాదే.! నీకో విషయం చెప్పనా..! బాధను నలుగురితో పంచుకుంటే మనసు తేలికవుతుంది, ఆనందాన్ని పంచుకుంటే మనసు రెట్టింపు ఆనందాన్ని పొందుతుందే. ఏదైనా నీతో పంచుకో టానికి నేనున్నాను. (విజయభోరున భర్త గుండెలమీద వాలుతుంది.)

విశ్వ : (ఆమె తల నిమురుతూ..) పిచ్చిదానా..! ఏం జరిగిందనే.. ఇప్పుడు.. ఎందుకలా బాధపడుతున్నావ్..!

విజ : నేను పొయ్యేలోపు ఒక్కసారి పిల్లల్ని చూడాలనుందండీ..

విశ్వ : (అతనుకూడా చలించిపోతాడు) నాకు మాత్రం లేదనుకున్నావా? ఎక్కడున్నారో తెలిస్తే నేనే వెళ్ళి వాళ్ళను తీసుకొస్తా..!

విజ : యావండీ.. మీకు వాళ్ళమీద కోపం లేదా.?

విశ్వ : నీకుందా?

విజ : నా సంగతి వదిలెయ్యండి.. మీరు చెప్పండి?

విశ్వ : లేదు.

విజ : అమ్మాయి మీదకానీ, అబ్బాయి మీద కానీ..,

విశ్వ : ఇప్పుడెందుకే ఇవన్నీ?

విజ : చెప్పండీ..

విశ్వ : నాకు ఇద్దరిమీదా కోపం లేదు. ఎందుకిలా వాళ్ళ జీవితాల్ని నిర్ణయిం చుకున్నారా అని బాధతప్ప. ఎందుకడుగుతున్నావ్ ఇదంతా?

విజ : ఏంలేదులెండి?

విశ్వ : విజయా..! ప్రతి తల్లీతండ్రి ఎప్పుడో అప్పుడు వాళ్ళ బిడ్డల్ని వదులు కోవాల్సిన సమయం వస్తుంది. ఒకటి బిడ్డలే మనల్ని వదిలేసి వెళ్ళి పోవటమో, లేక మనమే ఈ భూమిమీద నుంచి వెళ్ళిపోవటమో జరిగితే..

విజ : ఏం మాటలండీ..

విశ్వ : వేదాంతమే.. ఈ వయసులో మనకి కావాల్సిందిదే..! జీర్ణించుకో టానికి మనకి కష్టంగానే వున్నా.. అలవాటు పడక తప్పదు.

విజ : బాధపడకండీ.. మీకు నేనున్నాను, నాకు మీరున్నారు.

విశ్వ : (నవ్వి) నాది నాకే చెప్తున్నావా?

విజ : మీకు ఓ విషయం చెప్పనా(ఏంటన్నట్లు చూస్తాడు) మన మహాలక్ష్మి ఫోన్ చేసి మీ గురించి అడిగింది. (కొంత ఆనందానికి లోనవుతాడు. కానీ దాన్ని కప్పిపుచ్చుకుంటూ..)

విశ్వ : ఏమని?

విజ : నాన్నగారి ఆరోగ్యం ఎలా వుంది. టైంకి భోజనం చేస్తున్నారా? మాత్రలు వేసుకుంటున్నారా? నాన్నగారికి వండే ఆహారపదుర్థాల్లో ఉప్పు,కారం తగ్గించు ఆయని బీపీ వుంది. అలాగే షుగర్ ఫ్రీ పంచదార మార్కెట్లోకి వచ్చింది, నీకు తెలీకుండా ఆయనకి చాలా సార్లు తియ్య కాఫీ ఇచ్చాను. తియ్యటి కాఫీ తాగుతుంటే ఆయన మొహంలో ఆనందం నేనింకా మర్చిపోలేదంటూ.. గలగలా మాట్లాడిందండీ..

విశ్వ : ఇవన్నీ ఈ పోనులోంచేనా?

విజ : కాదండీ.. మన రామారావుగారమ్మాయి వనజకి ఫోన్ చేసిందట. పేరంటానికెల్తే వనజ చెప్పింది.

విశ్వ : మన ఫోన్ కే చేస్తే నువ్వూ మాట్లాడుకుంటావ్ గా.. ఈ సారి వనజకి ఫోన్ చేస్తే మనింటికే చేసి మాట్లాడమన్నానని చెప్పు.

విజ : సరే. ఇంకో విషయమేంటంటే.. మీరు తాత కాబోతున్నారట.. ( విశ్వం మాస్టారి ఆనందానికి అవధులు లేవు. మరోసారి చెప్పమన్నట్లు భావోద్వేగానికి గురయ్యాడు. ఇది నిజమా అన్నట్లు మైమ్ లో ఎక్స్ ప్రెషన్ ఇచ్చాడు.) మీరు తాత కాబోతున్నారట.. నేను అమ్మమ్మనవు తున్నానట.!

విశ్వ : మా అమ్మ.. అమ్మవుతోందా.. మా అమ్మ అమ్మవుతోంది. ఇంత మంచిమాట మనకే చెప్పచ్చుగదే.. సరే.. ఇంకా.. ఇంకా చెప్పు నా చిట్టితల్లి గురించి.. ఇంకేం చెప్పింది.

విజ : ఈరోజు అమ్మాయికి అల్లుడు సీమంతం చేస్తున్నాడట.

విశ్వ : అల్లుడు నా చిట్టితల్లిని బాగా చూసుకుంటున్నాడా?

విజ : కాలు కిందపెట్టనీకుండా. కంటికి రెప్పలా చూసుకుంటున్నాడటండీ..

విశ్వ : అమ్మాయినీ, అల్లుడుగారినీ బయల్దేరి మనింటికొచ్చెయ్యమను. ఆ సీమంతం మనమే చేద్దాం.. లేదు మనం చెయ్యాల్సిందే..

విజ : వాళ్ళు మనదేశంలో లేరటండీ.. ఏదో చెప్పింది కానీ గుర్తులేదు. కానీ రెండు రోజులకొకసారి చేస్తుందట.. (ఫోన్ రింగవుతుంది. విశ్వం ఫోన్ అందుకుంటాడు)

విశ్వ : హలో.. హలో..

విజ : ఎవరండీ..

విశ్వ : ఎవరో తెలీదు.. రోజూ ఇదో తంతయిపోయింది. ఫోన్ చేస్తారు.. మాట్లాడరు. (ఫోన్ పక్కన పెట్టేస్తూ..) పట్టీ కట్టుంచమని కిరాణా కొట్లో చెప్పొచ్చా.. నేనలా ఎటిఎం దాకా వెళ్ళి పెన్షన్ డ్రా చేసి సరుకులు పట్టుకొస్తా.. నువ్వే పనులూ చెయ్యద్దు.. నేనొచ్చి సాయం చేస్తా.. నా చిట్టి తల్లికీరోజు మనం సీమంతం చేద్దాం..!

విజ : (ఫోన్ వైపూ భర్తవైపూ చూస్తుంది. భర్త వెళ్ళగానే పరుగున ఫోన్ దగ్గరికొస్తుంది.) హలో.. మహాలక్ష్మి.. మీ నాన్నగారికి నీమీద అసలు కోపమేలేదు. నువ్వు వనజకి ఫోన్ చేస్తున్నవాని చెప్పా.. యనతో కాకుండా నాతో మాట్లాడుతున్నావని తెలిస్తే ఆయన తట్టుకోలేరే. ఒక్కసారి ఆయనతో మాట్లాడచ్చు కదా.. యన నీమీదే పంచ ప్రాణాలు పెట్టుకున్నారే. వద్దమ్మా.. ఏడవద్దు. కడుపుతో వున్నవాళ్ళు ఏడిస్తే పుట్టేబిడ్డకి మంచిదికాదమ్మా.. ఇప్పుడు బాధపడి ఏం ఉపయోగం చెప్పు మాతో ఒక్కమాట ముందే చెప్తే మేమే నీ పెళ్ళి చేసేవాళ్ళం కదమ్మ..

పీట : (తెరలోంచి) మాట్టారూ..మాట్టారూ.. (అంటూ లోనికొస్తాడు)

విజ : రా పీటర్.. మాస్టారు అలా ఎటిఎం దాకా వెళ్ళారు. వచ్చేస్తారు. నేను మళ్ళా మాట్లాడతాను. వుంటాను. (ఫోన్ పెట్టేస్తుంది.) మంచినీళ్ళు తాగుతావా పీటర్.

పీట్ : వద్దమ్మా.. తాగే వస్తున్నా

విజ : కూర్చోపీటర్.. (అంటూలో లోపలికెళ్ళింది)

పీట : ఫర్వాలేదమ్మా.. (పీటర్ సెల్ మోగుతుంది.) అలో.. ఒరే అబ్బాయ్. ఇప్పుడే మాట్టారికాడికొచ్చారా? డాక్కుమెంటు కాయితకాలు పట్టుకొచ్చా.. ఆ రాయుడిగోరి పొలం కూడా అమ్మకానికొచ్చిందని చెప్పాగా.. కొనమంటావా? ఆ కాయితకాలు కూడా తెచ్చా.. (విశ్వం మాస్టారు సరుకుల సంచీతో వస్తాడు.) నేను మాట్టారితో మాట్టాడతా.. నువ్వూ ఓపాలి మాట్టాడరా.. ఆ పెబువు దయవల్ల ఈయన తప్ప మనకి పెద్దదిక్కెవరు న్నారని.

విశ్వ : (సంచి పక్కనపెట్టి) ఏంటి పీటర్? ఎవరితో మాట్లాడుతున్నావ్.

పీట : పిలగాడితో..

విశ్వ : ఫోన్ చెవిలోనేవుందిగా.. కెనడాదాకా వినిపించేలా మాట్లాడాలా? (నవ్వుకుంటారిద్దరూ)

పీట : ఒరేయ్ అబ్బాయ్.. మాట్టారొచ్చాడు. మాట్టాడు. (ఫోన్ ఇస్తాడు)

విశ్వ : చెప్పరా శ్యామ్. ఏం డాక్యుమెంట్లు.. ఆ.. అవా.. సరే.. నేను చూస్తాలే. రాయుడిగారి పొలం మంచిదేరా.. ఎందుకమ్ముతున్నాడో.. నేను చూస్తాలే.. పేదలకి సహాయం చెయ్యాలన్న మీ సంకల్పం మంచిది నాన్నా.. ఆ ఏర్పాట్లు నేను దగ్గరుండి చూస్తాలేరా? ఎప్పుడొస్తున్నావ్.. సరే..

పీట : ఏంది మాట్టారూ.. ఏందిసయం.. ఇన్ని సరుకులు.. పండగేమన్నా సేత్తున్నావా ఏంది?

విశ్వ : మా అమ్మాయి మహాలక్ష్మికి ఈ రోజు సీమంతం చేస్తున్నాం పీటర్.. (విజయ బయటికొస్తుంది.)

పీట : ఏందీ.. అమ్మాయిగారొచ్చారా? అమ్మాయిగారూ.. అమ్మాయిగారూ.. ఓపాలి బైటికి రామ్మా.. అబ్బా.. ముందే తెలిత్తే మా మేరిని కూడా ఎంటబెట్టుకొచ్చేవాడ్నే.. ఇప్పుడే వత్తానుండండె..

విజ : తను రాలేదు పీటర్

పీట : మరి సీమంతమన్నారు?

విశ్వ : నీ మేరిని నువ్వెలా తీస్తావయ్యా..

పీట : ఫోటో తెత్తా.. పిచ్చిది ఏడనున్నా నిన్నే సూసుకోవాలి మావా.. అనేది.. ఏడికెల్లినా నన్నెంటబెట్టుకెల్లు మావా.. అనేది.. అందుకే నాతోపాటే దాని ఫోటో కూడా కారులో పెట్టుకొని తిరుగుతుంటా..

విశ్వ : ఇప్పుడు నా కూతురికీ సీమంతం అలాగే చెయ్యాలనుకున్నా.. కూతురికి సీమంతం చేయాల్సింది పుట్టింటి వాళ్ళే.. అది బాధ్యతతత కాదు.. కూతురుమీద ఆ ఇంటికున్న మమకారంతో..

పీట : అంటే..

విశ్వ : తను ఈ దేశంలో వుంటే అందరిలాగే చేసేవాడిని. కానీ మనకి అందుబాటులో లేదుగా.. అందుకని నా కూతురు మిగిల్చిన జ్ఞాపకాలకు చేస్తున్నా.. విజయా.. ఇక్కడే నా కూతురు నాచేతి గోరుముద్దలు తిన్నది. తను నామీద అలిగినప్పుడు ఇదిగో ఇక్కడే ఈ దివాన్ కాట్మీదే కాళ్ళు ముడుచుకొని నేను సారీ చెప్పిందాకా మాట్లాడేది కాదు. ఇదిగో ఈ కుర్చీలో కూర్చొని చదువుకునేది. పరీక్షలకు చదువుతూ కునికిపాట్లు పడుతుంటే నేన ఇక్కడ నుంచొని తనకి టీ ఇచ్చేవాడిని. ఇది తను యూనివర్సిటీలో సాధించిన గోల్డ్ మెడల్. చూడు నా తల్లి నవ్వుతూ దిగిన ఫోటో. ఇన్ని జ్ఞాపకాలు మా అమ్మ నాకోసం వదిలేసి వెళ్ళిపోతే నేను తనకేమిచ్చాను. నీ మొహం చూపించద్దు, ఇంటినుంచి వెళ్ళిపో అన్నాను.

పీట : మాట్టారూ.. ఇంత అభిమానం గుండెల్లో దాచుకున్న మీరు అమ్మాయిగార్నెందుకు వెలేశారయ్యా..

విశ్వ : నేను దానితో ఒక తండ్రిలా కాదు స్నేహితుడిలా వున్నాను. అది నన్ను స్నేహితుడిలాకాదు..తండ్రిలా చూసింది. అందుకే తను నాకే విషయం చెప్పకుండా దాచింది. తండ్రిలా స్పందించాను. మీరంతా అనుకున్నట్లు తనను నేను శిక్షించలేదు.. ఆ శిక్షను నేను అనుభవిస్తున్నాను.

విజ : యావండీ..

విశ్వ : అవును విజయా.. నేను పిల్లలని అర్థం చేసుకోలేదో.. వాళ్ళే మనల్ని అర్థం చేసుకోలేదో.. జరిగిందేదో జరిగిపోయింది. తను ప్రేమించిన విషయం ఒక్కమాట నాతో చెప్తే నేను ఆలోచించేవాడిని కాదా?

పీట : బాధపడకండయ్యా.. ఆ పెబువు మంచోల్లకి మంచే చేస్తాడు. చెడ్డోల్లని కూడామంచి మార్గంలో పెడతాడు. ఏ రోజుకైనా మీకు మంచిరోజులొత్తాయ్. ఆ నమ్మకం నాకుంది మాట్టారూ..

విజ : నీ నోటి పుణ్యమా అని ఆ రోజులొస్తే నీపేరు చెప్పుకుంటా పీటర్.

పీట : అమ్మా.. పెబువు సేతిలో గొఱ్ఱెపిల్ల ఎందుకుంటుందో తెలుసా? గొఱ్ఱెపిల్ల అంటే మనుసులు. దారి తప్పుతున్న గొఱ్ఱెలని ఆ తండ్రి ప్రేమగా దగ్గరికి తీసుకొని వాటిని సరైన దారిలో పెడతాడంటానికి గుర్తు. ఆ ప్రేమ తప్ప ఆ తండ్రి దగ్గర ఇంకేమీలేదమ్మా.. మీకు తప్పకుండా పెబువు ఆశీస్సులుంటాయి. మీకంతా మంచే జరిగిద్ది.

విశ్వ : పీటర్ మాటలతో మనసు తేలికయింది. అందుకే అంటారే.. సజ్జన సాంగత్యంలో అంతులేని ఆనందం దొరుకుతుంది అని..

పీట : ఇంతకీ అమ్మాయిగారు గర్భవతి మీకెవరు చెప్పారు మాట్టారూ..

విజ : ఇప్పుడెందుకులే పీటర్..

విశ్వ : మన రామారావు కూతురు వనజకి ఫోన్ చేసి మాట్లాడుతుందట.

విజ : అవును (తడబడుతుంది)

పీట : రామారావుకి చెవుడొచ్చి నాలుగు నెలల కితమే ఫోను తీసేశాడు కద మాట్టారూ. ఆల్లింట్లో సెల్ పోను కూడా లేదు.

విశ్వ : (విజయవైపు చూస్తాడు. ఆమె తలొంచుకుంది.) నిజం చెప్పు. మన అమ్మాయి వనజకి ఫోన్ చేయలేదు కదూ. ఎందుకు చెప్పావలా.. అంటే ఇదంతా.. నేను చేసినదంతా... కాలమే నాతో ఆడుకుంటుంది అనుకున్నాను. నువ్వు నాతో ఆడుకుంటున్నావా విజయా.. (పీటర్ క్షమించండి అన్నట్లు విజయ వైపు చూశాడు)

విజ : లేదండీ! మన అమ్మాయి ఫోన్ చేసిన మాట నిజం. వనజకి కాదు. మన ఇంటికి. రోజు మీరు ఫోన్ ఎత్తినప్పుడు మాట్లాడకుండా ఏడుస్తోంది కూడా మన మహాలక్ష్మేనండి.

విశ్వ : నువ్వు చెప్పేది?

విజ : నిజమండీ

విశ్వ : నా కూతురు రోజూ ఫోన్ చేస్తోందా.. అంటే నీతో మాట్లాడుతోంది. మరి నాతో ఎందుకు మాట్లాడటం లేదు. నేను దానికి అంత కానివాడినయ్యానా?

విజ : కాదండి అది ఎప్పటికీ మీ కూతురే. మీమాటే వింటుంది. దానిని మీతో మాట్లాడొద్దు అన్నారట. అందుకే అది మీ మాట వింటూ.. మీతో మాట్లాడలేక పోతున్నందుకు కుమిలి కుమిలి ఏడుస్తోందండీ..

విశ్వ : తండ్రిగా తన భవిష్యత్ గురించి ఎన్నో కలలు కన్నాను. అవి నిజాలు ఎలా చేసుకోవాలో వివరించి చెప్పాను. ఫోన్ లో ఆరోజు అది మాట్లాడిన ప్రతి మాట తూటాలా నా గుండెని చిద్రం చేస్తుంటే, తట్టుకోలేక నాతో మాట్లాడొద్దు. ఇంకెప్పుడు నీ మొఖం చూపించొద్దు అన్నాను. నన్ను నేను శిక్షించుకుంటున్నాను అనుకున్నాను. ఇప్పుడే తెలిసింది ఆ శిక్ష నా కూతురు కూడా అనుభవిస్తోంది అని. ఫోన్ చేయవే... ఒక్కసారి నా చిట్టి తల్లి తో మాట్లాడాలి. ఫోన్ చెయ్యి.

విజ : ఫోన్ నెంబరు తెలీదండీ.. తనే చేస్తుంటుంది.

విశ్వ : విజయా.. ఆ సంచీలోంచి పట్టుచీరె తియ్.. గాజులు కూడా.. పీటర్.. ఆ కుర్చీ ఇక్కడెయ్.. చలిమిడి కూడా వుంది చూడు. (అంటూ అక్కడి నుండి సీమంతం చేసే కార్యక్రమాన్ని ఫోటోకి నిర్వహిస్తారు. ఇల్లంతా చాలా ఆనందంగా వుంటుంది. ఇలాంటి సమయంలో విఠల్ వస్తాడు. జరిగే తంతుని గమనిస్తాడు. చప్పట్లు కొడుతూ లోనికొస్తాడు.)

విఠ : శభాష్.. ఎలా వుంటారని నేను ఎక్స్పెట్ చేశానో సరిగా అలాగే వున్నారు. ఈనగారైతే రెండు మూడాకులు ఎక్కువే.

విజ : ఎందుకొచ్చావ్..

విఠ : కోట్లు సంపాదించాకొస్తానన్నానుగమ్మా.. కోట్లు సంపాదించా.. వచ్చా..

విశ్వ : వచ్చావు కదా.. సంతోషంరా.. ఈ రోజు నీ చెల్లికి సీమంతం చేస్తున్నాం.. వచ్చి అక్షింతలేసి ఆశీర్వదించు.

విఠ : ఈయనగారి కూతురు ఎవడితోనో కడుపు చేయించుకున్నదంట. దానికీ తండ్రి సిగ్గూ ఎగ్గూ లేకుండా సీమంతం చేస్తున్నాడు. అది కూడా ఫోటోకి.. అసలు ఫోటోలకి కార్యక్రమాలు చేసేది ఏ సందర్భంలో.. ఆమాత్రం ఆలోచన కూడా లేకుండా బ్రతికున్న కూతురు ఫోటోకి సీమంతం చేస్తున్నావంటే నీకు మెంటల్ ఏ రేంజ్ లో డెవలప్ అయిందో అర్థమవుతోంది. అమ్మా బయల్దేరు.

విశ్వ : నాన్నా విఠల్.. మన భావనని పట్టి చేసే క్రియలకి అర్థం ఫలితాలుం టాయ్.. నీ ఫీలింగ్స్ నేను అర్థం చేసుకోగలను. బ్రతికున్న మనిషి ఫోటోకి నేను సీమంతం చెయ్యటాన్ని తప్పు అంటున్నావ్.. సీమంతం అనేది ఒక పవిత్రమైన కార్యక్రమం.

సృష్టి యజ్ఞానికి ప్రతి ఫలం అనుగ్రహించబోతున్న స్త్రీమూర్తి దేవతామూర్తితో సమానం. అటువంటి దేవతామూర్తికి చేసే చిరుసత్కారమే సీమంతం.ప్రత్యక్షంగా ఉన్న ప్రేమూర్తికి శ్రీమంతం చేయటం తరతరాలుగా వస్తున్న ఆనవాయితీ.! పరోక్షంగా ఉన్న దేవతామూర్తులను ఇలా ఫోటో ద్వారా అర్చించటం, సత్కరించటం తప్పేంగాదే.!

విర : నీతో వాదిస్తే నాకు మెంటలెక్కుతుంది. రామ్మా వెళదాం.!

విజ : ఎక్కడికిరా.!

విర : పెద్ద బంగ్లా.. రెండు కార్లు.! పనిచెయ్యటానికి పాతికమంది నౌకర్లు..! అక్కడన్నీ సుఖాలే.. కష్టాలు లేవు. చూడు ఎంతగాచిక్కిపొయ్యావో..! ఇప్పటిదాకా నన్ను చదివించి నందుకూ, నాకు తిండి పెట్టినందుకూ, నాకు బట్టలు కుట్టించినందుకు అంతా... అంతా కలిపి ఎంత ఖర్చుపెట్టావో ఆ పద్దు తియ్..! ఆ డబ్బు నీ ముఖాన కొడతా..!

విశ్వ : పెద్దయ్యాక నువ్విలా అడుగుతావని తెలీదురా.! అందుకే పద్దులు రాద్దామన్న ఆలోచనే నాకు రాలేదు.!

విర : ఓకె ఏం చేస్తాం.! (ఏవో లెక్కలేస్తాడు) కోటి రూపాయలుదాకా పెట్టి వుండచ్చు.. కాదు.. ఇంకొంచెం ఎక్కువై కూడా వుండచ్చు.ఓకె. రౌండ్ ఫిగర్‌గా ఐదు కోట్లు నీకిస్తున్నాను. నీకింకో బంపర్ ఆఫర్ కూడా వుంది. నీ ఆస్తి కూడా నువ్వే వుంచుకో.! నాకస్సలు వాటా ఇవ్వక్కర్లేదు. ఇదిగో చెక్కు,(తండ్రి చేతిలో పెడతాడు.)పదమ్మా వెళదాం.!

విజ : ఇంతడబ్బు ఎలా సంపాదించావ్ రా..!

విర : మెట్టు మెట్టు ఎక్కి పైకొచ్చే వ్యాపారాలు కొన్ని వుంటాయ్.! ఒక్క రాత్రిలో కోట్లు సంపాదించే వ్యాపారాలు ఇంకొన్నుంటాయ్.! నాది రెండోదారి.! నాన్నా అమ్మ మీతో వుండదు... నాతో వచ్చేస్తుంది. లీగల్‌గా మీకు రావాల్సిన డైవర్స్ నోటీస్ కూడా పంపిస్తాను. కోర్టులో కలుసుకుందాం.! విసిగించక విడాకులిచ్చెయ్యండి. మీక్కావాల్సింది కూడా అదే కదా.!

విజ : (విరల్‌ని చెంపమీద కొడుతుంది) విడిపోయే ఇద్దరిని కలపాలని చూస్తారురా ఎవరైనా.. అలాంటిది కలిసుండే అమ్మానాన్నల్ని విడకొట్టే కొడుకుని నిన్నే చూస్తున్నాన్రా.! అసలు నువ్వు మనిషి వేనా.! అయినా నేను నీతో వస్తానని ఎలా అనుకున్నావ్.?

విర : నీకూ ఆయనలాగే మెంటలెక్కిందని తెలీదుకదా.! ఇట్స్ ఓకె.!

విశ్వ : నాకు చెక్ ఇచ్చావ్.! మరి అమ్మకేమివ్వవా నాన్నా.!

విర : నాతో వస్తానన్నదని ఆలోచించలా.! ఇప్పుడు పడేస్తా.!

విజ : నాకవసరంలేదు.?

విశ్వ : వాడిస్తాడంటున్నాడుగా తీసుకోవే.!

పీట : అదేంటి మాట్టారూ.! అబ్బాయేందో తెలీకంటుంటే.!

విఠ : ఒరేయ్.! నువ్వు నోరుమూసుకో.! నా ఫ్యామిలీ మేటర్స్‌లో తలదూర్చద్దు.!

పీట : మీ నాన్నగారు ఎప్పుడూ అంటుంటారు.. నేనూ ఈ ఇంట్లో మనిషినే అని. అందుకే..!

విఠ : ఆయనకేమవుతావో కానీ.! నాకేం కావు.!

పీట : నీకేం కానా విఠల్ బాబూ.! చిన్నప్పుడు అంకుల్... అంకుల్ అంటా భుజాలమీద గుర్రం ఆట ఆడినప్పుడు,నువ్వేడుస్తుంటే బజారుకి తీసుకెల్లి నువ్వడిగినవన్నీ కొనిచ్చినప్పుడు, మీ నాన్నగారు నిన్ను కొడుతుంటే అడ్డం వచ్చినప్పుడు... నిన్ను ఇంజనీరు చదివిస్తానని మీ నాన్నంటే నీకిట్టంలేదంటూ మీ నాన్నమీద అలిగి మా ఇంటికొచ్చినపుడు.! నీకిట్టమైన చదువే చెప్పించమని మీ నాన్నతో మాట్లాడి ఒప్పించనపడు.! అప్పుడూ ఈ పీటర్ అంకుల్ కావాల్సి వచ్చాడు. ఈ రోజు ఈ పీటర్ నీకేం కాదు.

విఠ : నీ సెంటిమెంట్లు, నక్కవేషాలు నాదగ్గర కాదు. నీలాంటి లోక్లాస్ ఫెలోతో మాట్లాడటమే నాన్సెన్స్. ఇదిగోమ్మా బ్లాంక్ చెక్. తీసుకో..! అవతల చాలా పనులున్నాయ్.!

విశ్వ : ఎందుకునాన్నా బ్లాంక్ చెక్.! ఎంతో కొంత వేసివ్వరా.!

విఠ : చూడండి.! అమ్మ మీలా నా అవసరాలు తూతూమంత్రంగా చూడలేదు. అమ్మా.! ఎన్నోసార్లు నీదగ్గరనుండి డబ్బులు తీసుకున్నా.! అలాగే నువ్వూ ఏవో సేవలు చేసే వుంటావ్. వాటన్నింటికీ లెక్కలేస్తే కోటి రూపాయలు కూడా ఉండకపోవచ్చు. కానీ చిన్నప్పటినుంచి నాన్నని నా వైపు నుండి గెలుస్తూ వచ్చావ్. అందుకే ఈ బ్లాంక్ చెక్.

పీట : విఠల్‌బాబూ .! తొందరపడుతున్నారయ్యా.! ప్రపంచంలో డబ్బు పోసి అమ్మతనాన్ని కొనేవాళ్ళున్నారేమో కానీ అమ్మ ప్రేమను కొనే వాళ్ళుండరయ్యా..!

విఠ : ఒక ఇల్లిటరేట్ కూడా నీతులు చెప్పేవాడయ్యాడు.! యూ బాస్టర్డ్.!

విశ్వ : ఒరేయ్.. ఏం కూశావురా.. అతన్ని.! (బాస్టర్డ్ అన్నందుకు విశ్వం మాస్టారు విఠల్ చొక్కా పట్టుకుంటాడు. విఠల్ కూడా విశ్వం మాస్టారి చొక్కా పట్టుకుంటాడు.)

విఠ : నాకా తేడా లేదు.

పీట : విఠల్ బాబూ..! తప్పు నాన్నగారిని వదులు.. వదులుతావా లేదా.! (అంటూ విడిపించబోతాడు. విఠల్ పీటర్‌ని ఒక్కతోపు తోస్తాడు. పీటర్ కిందపడతాడు. విజయ విఠల్ చెంపమీద ఒకటి పీకుతుంది.)

విజ : వదల్రా..! వదులు.! నువ్వూ వద్దు నీ డబ్బూ వద్దు..! ఇంకెప్పుడూ నీ ముఖం చూపించద్దు.!

విఠ : అమ్మా..! ( విశ్వాన్ని ఒక్క తోపుతోస్తాడు. విశ్వం కిందపడతాడు. పీటర్, విజయ ఇద్దరూ అతన్ని పైకి లేపుతారు. విశ్వం

పీటర్‌ని క్షమాపణ కోరబోతాడు. పీటర్ విశ్వం చేతులు పట్టుకుంటాడు.)

విజ : నీ పాపిష్టి నోటితో ఇంకోసారి అలా పిలవద్దు. నాకు కొడుకు పుట్టలేదు. పుట్టినా పురిట్లోనే చచ్చాడనుకుంటాం.! పో.. ఇక నీకూ మాకూ సంబంధంలేదు. (చెక్కులు రెండూ విరల్ ముఖాన కొడుతుంది.)

విర : సో.. శాడ్..! రియల్లీ... బ్యాడ్ టైం.! ధనవంతులుగా దర్జాగా బతికేరాత మీ ముఖానలేదు. (వెళ్ళిపోతాడు)

విజ : రేయ్.! అమ్మా నాన్నల్ని కాదనుకొని వెళుతున్నావ్..! నడమంత్రపు సిరి పట్టిన నీలాంటోళ్ళు తప్పకుండా నాశనమైపోతారు. పురుగుల పడిపోతారు.! పుట్టగతులుండవు.!

విశ్వ : విజయా..!

విజ : తప్పుచేశానండీ.! మనిషినే కన్నానని అనుకున్నా.! పెద్దయి వీడిలా విషం కక్కుతాడని తెలిసుంటే పురిటిలోనే వాడి పీకపిసికి చంపేసేదాన్ని.!

విశ్వ : విజయా..! తల్లితండ్రులుగా మనం వాళ్ళు బాగుండాలని దీవించాలే కానీ శపించకూడదే.! పీటర్ మా దౌర్భాగ్యానికి ఫలితంగా ఇలాంటి కొడుకుని కన్నాం.! నీకు జరిగిన ఈ అవమానానికి పెద్దమనసుతో నన్ను క్షమించు.

పీట : ఏంమాటలు మాస్టారూ అయి.!

విశ్వ : నిజం పీటర్.! కొడుకు పెరిగి ప్రయోజకుడవుతాడని అనుకుంటాడు ఏతండ్రైనా.! నేనూ అంతే.! విజయా.! పిల్లలెన్ని చేసినా మనం ఆనందంగా అనుభవించాల్సి ందే. కన్నందుకు తప్పదే..! తప్పదు..!

## లైట్స్ ఆఫ్

## 3.వసీన్

(విజయ విశ్వం కోసం ఎదురు చూస్తుంటుంది. ఇంతలో విశ్వం ఉసూరుమంటూ వస్తాడు.)

విజ : ఏంటండీ ఇంతాలస్యమైంది.

విశ్వ : ఏం చెప్పమంటావే.! ఎటిఎంల్లో కూడా దొంగనట్లు చెలామణి అవుతుంటే వాటిని అరికట్టాల్సిన బ్యాంకువాళ్ళు ఏం చేస్తున్నారు.? ప్రభుత్వం ఏం చేస్తోందని అనిపిస్తోంది.!

విజ : ఇప్పుడేమైందండీ.!

విశ్వ : ఏమైందా.! నేను నా ఫించను డ్రా చేసుకుందామని ఎటిఎంకి వెళ్ళానా అందులో ఐదొందలరూపాయల నోట్లు నాలుగు నకిలీవి వచ్చాయి. అక్కడే చూశాను కాబట్టి సరిపోయింది. గార్డుతో సంతకం పెట్టించి పక్కనే బ్యాంకుకెళ్ళి జరిగింది చెప్పి అసలు నోట్లు తెచ్చుకునే సరికి ఇదిగో ఈ టైమైంది. (గడియారం వైపు చూస్తుంటాడు) అమ్మాయి ఫోన్ చేసిందా.!

విజ : ఇంకా లేదండీ.!

విశ్వ : ఈరోజు నా చిట్టి తల్లితో ముందు నేను మాట్లాడతాను.

విజ : అలాగేనండి.!

విశ్వ : ఎన్నాళ్ళనుండో మా అమ్మ గొంతు విని.!

విజ : ఎన్నాళ్ళోనా..? నిన్నగాక మొన్నేకదండీ అంతసేపు మాట్లాడింది.

విశ్వ : మొన్నకదా.. (ఇంతలో కాలింగ్ బెల్ మోగుతుంది. విశ్వం ఫోన్ లిఫ్ట్ చేసి) హలో.. హలో... (అంటాడు. విజయ విశ్వంతో కాలింగ్ బెల్ అని సైగచేస్తూ నవ్వుకుంటుంది. విశ్వం కూడా నిజమే అన్నట్లు వెళ్ళి తలుపు తీస్తాడు. దెబ్బలతో ఉన్న విరల్‌ని పీటర్ తీసుకొస్తాడు)

విశ్వ : ఏంటి పీటర్ ఏంటా దెబ్బలు.

పీట : ముందలా లోనికి రానీండి మాట్టారూ..! (అంటూ విరల్‌ని లోనికి తీసుకొస్తాడు)

విజ : ఏం జరిగింది.!

పీట : మీరు కంగారు పడకండమ్మా.! ఏంకాలేదు.!

విజ : ఏం కాలేదంటావేంటి పీటర్.. ఆ దెబ్బలు..!

పీట : (పీటర్ విశ్వాన్ని ఓపక్కకి తీసుకెళ్ళి) మాట్టారూ..! అబ్బాయిగార్ని దొంగనోట్ల చెలామని కేసులో పోలీసులు అరెస్ట్ చేశారు. వాళ్ళు కొట్టిన దెబ్బలే ఇయన్నీ.! జామీనిచ్చి తీసుకొచ్చానండీ.!

విజ : పోయింది..! అంతా అయిపోయింది.! ఈ రోజుతో ఈ ఇంటి పరువు పోయింది. రేయ్.! రేయ్.! ఈ వయసులో కూడా ఆయన్ని సుఖంగా ఉండనీవా.! పోలీసు రికార్డుల్లో కూడా ఆయన పేరెక్కాలా.! ఇంత గొప్ప కొడుకు ఏ తల్లిదండ్రులకూ ఉండకూడదు.

విర : అమ్మా..!

విజ : వద్దు.! నన్నలా పిలవద్దు. నీ నోట్లోంచి అమ్మా అన్న పిలుపుకూడా అర్థం మారిపోయి వస్తోందిరా.!

విర : అదికాదమ్మా.!

విజ : నీ బతుకేదో నువ్వ బతుకుతానన్నోడివి మళ్ళీ ఎందుకొచ్చావ్.! ఏ అర్హతుందని మళ్ళీ ఈ ఇంట్లో అడుగుపెట్టావ్.!

పీట : నువ్వాగు విరల్ బాబూ.! (వెళ్ళబోతున్న విరల్‌ని ఆపుతాడు. అతని బుజంమీద చెయ్యేస్తాడు.)

విజ : వాడీ ఇంట్లో ఒక్క క్షణం వున్నా కూడా నేను సహించలేను పీటర్. వాడ్ని పంపించెయ్.! స్టేషన్ నుంచి ఇంటికి కాకుండా ఏ వల్లకాటికో తీసుకెళ్ళినా బాధపడేదాన్ని కాదు.

పీట : ఏం మాటలమ్మా అయన్నీ.! ఇంట్లో ఉండద్దంటే యాడికిపోతాడు.! అలా అన్నందుకే ఇయన్నీ...

విజ : నువ్వనేదేంటి పీటర్.! వీళ్ళిన్ని అడ్డమైన పనులు చేస్తున్నా భరిస్తుండమంటావా.!

పీట : భరించే ఓర్పూ, సహనం ఆ దేవుడు తల్లిదండ్రులకి కాక ఇంకె వరికిచ్చాడమ్మా.. ఏమ్మా.! దెబ్బలు తగిలి ఇంటికొచ్చిన కొడుకుని దగ్గరకు తీసుకొని మందురాయాల్సిన నువ్వు మనసుని దెబ్బతీసేలా మాట్లాడితే..!

విజ : వాడు చేసిందేంటో తెలిసికూడా ఇలా ఎలా మాట్లాడుతున్నావ్ పీటర్ .!

పీట : పిల్లలన్నాక తప్పులు చేస్తారు. పెద్దమనసుతో మనం వాటిని సరిదిద్దేందుకు సూడాలని మీరే సెప్పారు కదా మాస్తారు.!

విశ్వ : నువ్వచెప్పేదేంటి?

పీట : ఇలా అంటున్నానని ఏమీ అనుకోరుగా.!

విశ్వ : చెప్పదలచుకుంది సూటిగా చెప్పు.

పీట : నువ్వూ ఈ ఇంట్లో మనిషివే అని ఎప్పుడో చెప్పారుగా పీటర్.!

పీట : సంతోసమమ్మా.! మీ అంత సదుకోక పోయినా ఓ బిడ్డని కన్న తండ్రిగా మాట్టాడుతున్నా.! యాపారం సేసుకునేటోన్ని ఎదుటోల్ల మనసుని సదివి బేరం చెయ్యాల. నేను సదివింది ఆ సదువే..! మాట్టారూ మీ మాటిని నేను బాగుపడ్డా.! మరి మీ అబ్బాయ్ ఎందుకిలా తయారయ్యాడో ఆలోచించారా.!

విశ్వ : ఆలోచించలేదంటావా..!

పీట : మాట్టారూ.! ఏరోజన్నా మీరు మీ అబ్బాయితో మనసిప్పి ప్రేమగా మట్లాడారా.!

విశ్వ : నీకు తెలీదా పీటర్.!

పీట : అందుకే అడుగుతున్నా.! డబ్బు సంపాదించు.. సంపాదించటం నేర్చుకో.. సంపాదించటం చేతకాదనే అన్నారు కానీ, ఏరోజన్నా ఎలా సంపాదించాలో చెప్పారా మాట్టారూ.! బయటోల్లందరికీ అర్ధమయ్యేట్టు మాట్లాడే మీరు మీ పిల్లలదగ్గర అలా మాట్టాడారా మాట్టారూ.! మీకాడే సదుకున్న మీ పిల్లలు ఎప్పటికీ మీలో ఒక మాస్టారినే చూశారు కానీ తండ్రిని మాత్రం చూడలేకపోయారు.! అందుకే మీ పిల్లలు మీ నుంచి మానసికంగా దూరమయ్యారు. ఇది నిజం. ఇదే నిజం మాస్టారూ.!

విశ్వ : నా కూతురితో నేను స్నేహంగానే వున్నాను. అదెందుకలా చేసింది.?

పీట : చెప్పాకదయ్యా.! ఆల్లుమీలో చూసింది మాస్టారినే కానీ, నాన్నని కాదు.

విశ్వ : తప్పుచేశాను విజయా.! ఇవన్నీ ఇన్నాళ్ళూ నాకెందుకు చెప్పలేదు పీటర్.!

పీట : తెలీనోల్లకైతే చెప్పచ్చు కానీ అన్నీ తెలిసిన మీలాంటోల్లకి ఎట్టా చెప్పాలి మాస్టారూ.!

విశ్వ : (పీటర్ చెయ్యిపట్టుకొని) నీకెలా కృతజ్ఞత చెప్పుకోవాలో అర్ధం కావట్లదు ఏటర్.! (శ్యామ్ వస్తాడు)

శ్యాం: నమస్కారం మాస్టారూ.!

పీట : అబ్బాయ్ వచ్చాడు.! చెప్పటం మర్చిపోయాను.

శ్యాం: నువ్వెప్పుడొచ్చావ్‌రా.!

పీట : రాత్రే వచ్చాను మాస్టారు.

విశ్వ : రారా కూర్చో.!

శ్యాం: మీముందు కూర్చునేంత వాడినా మాస్టారు.!

విశ్వ : అదేంటిరా.! ఇప్పుడు నువ్వు పెద్ద డాక్టర్‌వి.!

శ్యాం: మీరిచ్చిన అక్షర జ్ఞానమే కద మాస్టారూ.!

విశ్వ : చాలురా శ్యామ్.! ఏగురువైనా శిష్యుడినుండి కోరే గురుదక్షిణ ఇదే.!

శ్యాం: మాస్టారూ.! నేను కెనడాలో ఉంటున్నానా ఆలోచనలన్నీ కూడా నేను పెరిగిన ఈ ఊరిచుట్టే తిరుగుతుంటాయ్.! ఇక్కడే హాస్పిటల్ ప్రారంభించి పేదలకి వైద్య సేవలు అందించాలనుకున్నా.! మా అమ్మ మేరి వైద్యసాయం అందక చనిపోయింది. ఆమె ఎప్పుడూ అంటుండేది అబ్బాయ్ ఎంతో మంది పేదలు వైద్యం అందక చనిపోతున్నారు. అలాంటి వాళ్ళకు నువ్వు ఉచితంగా వైద్యం అందించు అని. అందుకే నేను డాక్టర్‌నయ్యా..! అమ్మ కోసం, అమ్మలాంటి ఊరికోసం నా భార్య కూడా తన వైద్యసేవలు అందించటానికి ముందుకొచ్చింది. ఆమె నా జీవితంలోకి వచ్చిన దగ్గరనుండీ మా అమ్మని మరిపించింది మాస్టారూ.! అంత బిజీ లైఫ్‌లో కూడా అన్నీ దగ్గరుండి తనే చూసుకుంటోంది. ఈ ప్రాజెక్ట్ కోసం తను రోజుకి 16 గంటలు కష్టపడుతోంది. అలాంటి భార్యని కని నాకందించిన ఆమె తల్లిదండ్రులు నిజంగా పుణ్యాత్ములే.!

విజ : రేయ్. విఠల్.! కొడుకంటే వాడురా.! నీ ఈడువాడేగా.! ఈ ఊరంతా కూడా గర్వంగా తలెత్తుకునేలా తల్లిదండ్రులకి పేరుతెచ్చాడువాడు. తల్లిదండ్రుల ఆస్తుల్ని పంచుకునే వాళ్ళు కారురా వారసులంటే, వాళ్ళ ఆశయాలు పంచుకోవాలి. ఇప్పటికైనా వాణ్ణి చూసి బుద్ధితెచ్చుకో..!

విఠ : అదే..! అదే ..! నాకు నచ్చనిది.! చిన్నప్పటి నుండి ఎవరితోనో పోలుస్తారు.! నన్ను నన్నుగా గుర్తించరు.! స్కూల్లో నాన్న..! ఇదిగో ఇప్పుడు నువ్వు.! నా జీవితం ఇలా చేసింది మీరే.! నాన్నా నేనిది చేస్తా అంటే ముందు వద్దు అంటారు.! అప్పుడే మొదలౌతుంది ఎలాగైనా నా ఇష్టాన్ని నెగ్గించుకోవాలనే పట్టుదల. ఎలాగోలా నెగ్గించుకుంటా.! కానీ ఏదో తెలీని అసంతృప్తి.! నాన్నా.! ఎవడో పెద్ద పెద్ద చదువులు చదివాడనీ, పెద్ద ఉద్యోగాల్లో ఉన్నాడని, నీ కొడుకు అలాగే వుండాలని ఎందుకు మీకు మీరు నిర్ణయించుకుంటారు.! మా మీద ఒత్తిడి తెస్తారు.!

విశ్వ : ఏంటిరా నువ్వనేదీ.!

పీట : మాస్టారూ.! ఇప్పుడే అతను మీతో మనసిప్పి మాట్లాడుతున్నాడు.!

విర : నాన్నా.! మీలో ఎన్నోసార్లు తండ్రిని చూద్దామనే ప్రయత్నించా.! కానీ అదేంటో ఎప్పుడు చూసినా బెత్తంపట్టుకొని దండించే మాస్టారినే చూశా.! నాకు స్వేచ్ఛకావాలని పించింది.! ఎప్పుడెప్పుడు మిమ్మల్ని ఎదిరించి నా స్వేచ్ఛను తనివితీరా అనుభవిద్దామా అనిపించేది! నాకు నేనుగా ప్రిపేర్ అవ్వటానికి చాలా టైమ్ పట్టింది.! అలాగే ప్రిపేర్ అయ్యాను. కానీ విచ్చలవిడి స్వేచ్ఛే నన్నీ స్థితికి తెచ్చింది.!

శ్యాం: విరల్..! (అంటూ శామ్యూల్ విరల్ బుజంమీద చెయ్యివేస్తాడు. అందరూ ఆలోచనలో పడతాడు. వేడి వాతావరణం నెలకొని ఉంటుంది. ఎవరికి వారు ఆలోచిస్తుంటారు.)

పీట : మాస్టారూ..! ఏందదండీ..! ఏం మాట్లాడరు?

విశ్వ : నాదగ్గర మాటలు నేర్చుకున్న వాడు ఈరోజు నాకే మాటలు అందకుండా మాట్లాడుతుంటే.! నేను చేసిన తప్పులు ఒక్కొక్కటే నాకు తెలుస్తుంటే..! నేనేస్థితిలో వున్నానో..!

పీట : ఇప్పుదేమైందని.! అన్నట్లు మా కోడలు పిల్లని మీరు సూడలేదు కదూ.!

శ్యాం: నువ్వూ చూడలేదుకద నాన్నా!

విజ : నీ భార్యను కూడా తీసుకొచ్చావా శ్యాం.!

పీట : వాడెందుకు తెత్తాడండీ.! ఫోటో ఆల్బం తెచ్చాడంట..! ముందు మీకే చూపిత్తాడంట.!

విశ్వ : తప్పురా శ్యామ్.! మాతృదేవో భవ. పితృదేవోభవ.! అని ముందు రెండు స్థానాలూ వారిద్దరికీ ఇచ్చారు. ఆ తర్వాతనే మూడో స్థానం మాది. ముందు నాన్నకి చూపించు.

శ్యాం: మీరన్నట్లు వాళ్ళు నాకు జన్మనిచ్చారు. కానీ అక్షర జ్ఞానంతో పునర్జన్మనిచ్చింది మీరే కదా సార్.!

విజ : ఎవరి స్థానాలు వాళ్ళవేగా.!

శ్యాం: కానీ మీకే ముందుగా ఈ ఆల్బమ్ చూపించాలనుకున్నా.!

పీట : చూడండి మాస్టారూ.! (విశ్వం ఫోటో ఆల్బమ్ చూసి విజయకిస్తాడు. శామ్యూల్ భుజంమీద చెయ్యివేస్తాడు. శామ్యూల్ మాస్టారి కాళ్ళకి నమస్కరిస్తాడు. విరల్ కూడా ఆల్బమ్ చూస్తాడు.)

విజ : మనమ్మాయి.. మహాలక్ష్మి.

విశ్వ : నా కూతురుని పెళ్ళి చేసుకుంది నువ్వేనా.!

పీట : (ఆవేశంతో కొడుకుని కొడతాడు) రేయ్.. నా కడుపున చడపుట్టావ్ కదరా.! అన్నం పెట్టిన ఇంటికి ఇంత ద్రోహం చేస్తావా.!

శ్యాం: నాన్నా నేను చెప్పేది విను.!

పీట : ఆయన దయతలచబట్టేరా ఈ రోజు మనం అన్నంతింటున్నాం. అలాంటాయనకి ద్రోహం చేస్తావా.! ఎన్నాళ్ళాయన కూతురుకి దూరమై ఆ బాధ గుండెల్లోనే

అనుభవించాడో నీకేం తెలుసురా.! ఎంతో మందికి దారి సూపించిన పున్యాత్ముడికి ద్రోహం చెయ్యాలనే ఆలోచన నీకెట్టా వచ్చిందిరా..! తప్పుడు నాకొడకా.! నిన్నిలా కాదు..!

విశ్వ : పీటర్.! ఇప్పటిదాకా మాకు నీతులు చెప్పి.! ఏం మాట్లాడుతున్నావో అర్థమవుతోందా! ఏం తప్పుచేశాడని శ్యామ్‌ని కొడుతున్నావ్.!

పీట : తప్పేందంటారేందండీ.! ఇళ్ళలోంచి అమ్మా అయ్యలకి సెప్పాపెట్ట కుండా ఎల్లిపోయి అల్లు బానే. ఉంటారు. అల్లమీదే అన్ని ఆశలు పెట్టుకున్న మనమా సిత్రింస అనుభవించేది. ఎన్ని రాత్రులు ఎన్నిపగల్లు మీరు అనుభవించారయ్యా ఆ బాధ. ఏం అమ్మాయి గారిని తీసుకెల్లేప్పుడు ఈ నాకొడుక్కి తెలీదా.! ఈడు సదుకున్నోడేగా ? ఈడి బుద్ధి ఏమైందని.!

శ్యాం: నాన్నా! మీ ప్రశ్నకు సమాధానం చెప్పటానికి సిద్ధంగా వున్నాను. మాస్టారూ... మీరు కూడా విన్నాక నిర్ణయం తీసుకోండి.!

పీట : సిగ్గులేకపోతే సరి.! సమాధానం సెప్తాట్ట.!

విశ్వ : పీటర్.! నువ్వూరుకో..! చెప్పు శ్యామ్ నువ్వేం చెప్పదలచుకున్నావో.!

శ్యాం: థ్యాంక్యూసార్.! మా అమ్మ కోరిందని నేను డాక్టర్ చదివినా మా నాన్న ఆశయాలు సాధించేందుకు నేను నిర్ణయించుకున్నాను. ఆయన ఆశయమేంటో తెలుసా సార్.! తనని ఇంతవాడిని చేసిన మిమ్మల్ని ఈ ప్రజలు గుండెల్లో పెట్టుకోవాలని.! ఎలాగా అని ఆలోచిస్తుంటే నేను మెడిసిన్ పూర్తి చేసుకొచ్చాక మీరు నాతో ఓమాటన్నారు. పేదలకి ఫ్రీగా సర్వీస్ చెయ్యరా అని. ఆమాటే సార్..! నేనేం చెయ్యాలో నిర్ణయించింది. తన తండ్రి ఆశయసాధనకి కృషిచేస్తున్న నాతో మహాలక్ష్మి జతకలిసింది. ఎన్నో ఫ్రీ మెడికల్ క్యాంపులకి అటెండ్ అయ్యేది. మీతో మా పెళ్ళి గురించి మాట్లాడమన్నా.. తనకి ఆ అవకాశం రాలేదట, నాదగ్గరికి వచ్చేసింది. అక్కడినుండి మీకు ఫోన్ చేస్తే మీరు తనతో మాట్లాడటానికి కూడా ఇష్టపడలేదని చెప్పారు. మాస్టారూ.! నేను తప్పుచేశాననుకుంటే క్షమించండి.! నాన్నా నువ్వే శిక్షవేసినా అనుభవించటానికి సిద్ధంగా ఉన్నా!

విశ్వ : పీటర్ ఒకప్పుడు నా బిడ్డల్ని అర్థం చేసుకోలేక వాళ్ళని దూరం చేసుకున్నాను. ఇప్పుడు నువ్వూ అలాంటిదే చెయ్యద్దు. శ్యామ్ లాంటి ఉత్తముణ్ణి కన్న నువ్వు ధన్యుడివి. కన్ననీకు, చదువు చెప్పిన నాకూ శాశ్వత కీర్తి ప్రతిష్టలు సంపాదించే వారసుల్ని కన్నామయ్యా.! ఏకులంలో ఎవరు పుట్టారన్నది ముఖ్యంకాదు. వాళ్ళ జీవన గమనాన్ని ఎంత మహోన్నతంగా మలచుకున్నారన్నదే ముఖ్యం. వారసులంటే ఆస్తులని మాత్రమే కాదు వాళ్ళ ఆశయాలనూ పంచుకోవాలని నిరూపించిన నిన్ను అభినందిస్తున్నారా శ్యామ్.!

విఠ ; (తండ్రి కాళ్ళమీద పడతాడు) నాన్నా.! నన్ను క్షమించండి.! తప్పు తెలుసు కున్నా.! తేలికగా డబ్బులు సంపాదించ వచ్చని ఆవేశంలో అడ్డదార్లు తొక్కాను. మీరే రైట్‌నాన్నా.! ఏదైనా సాధించాలంటే కష్టపడాలి.! పీటర్ అంకుల్లా స్వశక్తితో అంచెలంచెలుగా

పైకిరావాలి.! స్థిరమైన గమ్యాన్ని చేరుకోటానికి నిర్ధిష్టమైన గమనం ఉండాలి. అది గమనించే సరికి నా జీవితం సగానికిపైగా నాశనమైంది. మీరేదారి చూపించినా నడవటానికి సిద్ధంగా ఉన్నాను.

విశ్వ : పీటర్ దగ్గర గుమస్తా ఉద్యోగం చెయ్యాలి.! చేస్తావా.!

విఠ : నాన్నా! ఒకసారి అమ్మ జన్మనిస్తే.! పీటర్ అంకుల్ నాకు మనిషిగా మరో జన్మనిచ్చారు.! కానీ నేను ఆయనపట్ల చాలా మూర్ఖంగా ప్రవర్తించాను. అనరాని మాటలు అన్నాను.

పీట : విఠల్‌బాబూ.! అయన్నీ నేనేనాడో మర్చిపొయ్యాను.!

విఠ : అంకుల్ (అంటూ చేతులు పట్టుకొని ఏడుస్తాడు)

పీట : విఠల్‌బాబు తప్పుతెలుసుకున్నాడు. నా కొడుకే..!

విశ్వ : బావగారూ.! అవును. ఇప్పుడు మనిద్దరం వియ్యంకులమయ్యా.! తరాలు మారుతున్నప్పుడు తలెత్తే అంతరాలను గమనంలోకి తీసుకోవాల్సిన బాధ్యత ప్రతి తల్లిదండ్రికి వుంటుంది. నేటి వీరి నిర్ణయాలు మనకు కొత్తవిగా కనిపిస్తే, మన నిర్ణయాలు వీళ్ళకి చాదస్తంగా అనిపిస్తాయి.! నాన్నా విఠల్ మా నిర్ణయాలు అనుభవంలోంచి పుడితే, మీ ఆలోచనలు ఆవేశం లోంచి ఆవిర్భవిస్తాయ్.! ఏతల్లితండ్రులైనా బిడ్డలకి మంచి భవిష్యత్తు నివ్వాలనే కోరుకుంటారు కానీ వాళ్ళ జీవితాలు నాశనం చెయ్యాలనుకోరు. విజయా.! ఏ వంటకానికి ఏ పదార్ధం ఎంతెంత వేస్తే రుచికరంగా వుంటుందో తెలుసుకున్న దానివి, సంసారంలో సంతానానికి పంచాల్సిన ప్రేమకన్నా ఎక్కువగా పంచితే, రుచికోల్పోయిన వంటకంలాగే నిస్సారమైన సంతానాన్ని సమాజానికి అందించిన వాళ్ళ మౌతామని గ్రహించలేక పోయావ్.! మహాలక్ష్మి, శ్యామ్.! తల్లిదండ్రుల ఆస్తులను కాక ఆశయాలను పంచుకొని వాటి సాధనకు కృషిచేసిన ఉత్తములైతే, అంచెలంచెలుగా సమాజంలో ఉన్నత స్థితికెదిగిన పీటర్ మాన్యుడు. పిల్లల ఆలోచనలు పెడమార్గంలో పడుతుంటే సరైన మార్గంలో పెట్టటానికి వాళ్ళకెలా చెప్తే అర్థం చేసుకుంటారో అందుకు తగ్గట్టుగా మనమే నడుచుకోవాలి బావగారూ..! నేను నా పిల్లల విషయంలో అలా చేయలేకపోయాను. నా అభిప్రాయాలు వాళ్ళమీద రుద్దాలని ప్రయత్నించాను, తండ్రిగా వాళ్ళకు దూరమయ్యాను. నాలాగే ఎందరో తల్లి దండ్రులు వాళ్ళ పిల్లల విషయంలో ప్రవర్తిస్తున్నారు. అది తప్పు అనటానికి నా జీవితమే ఒక ఉదాహరణ. దానిని ప్రతి తల్లిదండ్రి గమనంలోకి తీసుకొని ప్రవర్తిస్తే ప్రతి కుటుంబం ఆనందనిలయాలుగా మారతాయన్నది సత్యం.

శుభం

గంగోత్రి, పెదకాకాని

# దగ్ధగీతం

మూలకథ : కీ.శే.శ్రీ పెద్దిబొట్ల సుబ్బరామయ్య
దర్శకత్వం : శ్రీ నాయుడు గోపి

సేతురామ్ : నాయుడు గోపి
పంకజవల్లి : రాధ
రవీంద్ర : గుమ్మడి నాగేశ్వరరావు
దేవదాసు : బి.బాబూరావు
సంగీతం : టి.సాంబశివరావు, రమణ
లైటింగ్ : రాజా రత్నం
సెట్ : నాగేశ్వరరావు

**నాటిక రచన వెనుక**

**" గమనం" నాటిక రచన తర్వాత కొంతకాలం తర్వాత నా గురువుగారు శ్రీ నాయుడు గోపి గారితో కలిసి పనిచేసే అవకాశం నాకు వచ్చింది. ఆ సంవత్సరం "ఎ.వి.కె.ఫౌండేషన్" వారు కథానాటికల పోటీలు నిర్వహించారు. నాకు కథలు చదవటం అన్నా, రాయటం అన్నా ఎందుకో ఇష్టముండేది కాదు. నేనొకరోజు రాత్రి ఇంట్లో టీ.వీ చూస్తున్న సమయంలో గురువుగారు ఫోన్ చేసి ఎ.వి.కె.ఫౌండేషన్ నాటికల పోటీ గురించి చెప్పారు. నాటిక రాస్తున్నావా అన్నారు. నేను లేదు గురువుగారూ.. ఇంకా ఏమీ అనుకోలేదు అన్నాను. ఏదైనా ప్రయత్నం చేస్తావా అన్నారు. ప్రయత్నిస్తా అన్నాను. అంతే కంప్యూటర్ ఆన్ చేసి ఎ.వి.కె.ఫౌండేషన్ వారు సూచించిన కథలు చదువుతున్నాను. అందులో కథలు ఆకట్టుకునేలా వున్నప్పటికీ నేను రాయగలిగే (నా మెంటల్ కండిషన్, రైటింగ్ స్కిల్స్) కథ నాకు కనిపించలేదు. అలా కథలు చదువుతుండగా "దగ్ధగీతం" కథ కనిపించింది. ఆ కథకి వేసిన బొమ్మ చూడగానే ఇదేదో కమ్యూనిస్టుల కథేమో అనుకున్నాను. స్కిప్ చేద్దామనుకున్నాను. కానీ అనుకోని రీతిలో కథ చదవటం మొదలు పెట్టాను. అంతే కథ నన్ను తనతో తీసుకెళ్ళటం మొదలు పెట్టింది. కథలో సన్నివేశాలు, పాత్రలూ నాటకీకరణ రూపంలో నా మెదడులో ప్రాణం పోసుకున్నాయి. ఎలా రాయాలి? ఏం రాయాలో పూర్తిగా అర్థమైపోయింది.అప్పటి వరకూ సాగిన నా రచనాశైలి ఈ నాటిక నుండి మారటం నేను గమనించాను. 8 గంటల్లో నాటిక రాయటం పూర్తయింది. గురువుగారికి వినిపించాను. కేవలం 8 గంటల్లో రాసేశావా అని నటీనటులు ఆశ్చర్యం వ్యక్తం చేశారు. ఆ తర్వాత 2017 ఎవికె ఫౌండేషన్ వారి పోటీలకు నాటిక ఎంపికైంది.**

# దగ్ధగీతం కథాసంగ్రహం

దగ్ధగీతం అనేది కథానాటిక. ఈనాటికకు మూలకథ కీ.శే.శ్రీ పెద్దిబొట్ల సుబ్బరామయ్యగారు అందించటం జరిగింది. అయితే ఈ కథను నాటకీకరణ పరంగా ఇక్కడ సంక్షిప్తంగా ఇవ్వటం జరుగుతుంది. గమనించగలరు.

సేతురామ్ అనే అతను నాదస్వర విద్వాంసుడు. పంకజవల్లి అనే గాయనికి ఇతను సహకార వాయిద్యం అందిస్తుంటాడు. పంకజవల్లి, సేతురామ్ ఇద్దరూ కూడా చిన్నప్పటి నుండి కలిసిమెలిసి పెరుగుతారు. సేతురామ్ కి పంకజవల్లి అంటే ప్రేమ. ఆమెని పెళ్ళి చేసుకోవాలని అనుకూడా అనుకుంటాడు. అయితే తన ప్రేమ విషయం పంకజవల్లికి చెప్పలేక తనలోనే దాచుకుంటాడు. అదే సమయంలో రవీంద్ర నారాయణ్ అనే ఒక మోసగాడు (కళారంగ కాంట్రాక్టర్.. అప్పటికే ఊరికొక భార్యని పెట్టుకొని వారికి కాంట్రాక్టులు ఇప్పిస్తూ వచ్చిన డబ్బులతో విలాసంగా గడుపుతుంటాడు. ఇతనికి ఏజెంట్ గా దేవదాసు పనిచేస్తూ ఎక్కడికక్కడ మేనేజ్ చేస్తూ రవీంద్రకి సహకరిస్తుంటాడు.) వీరి జీవితంలోకి వచ్చి పంకజవల్లిని పెళ్ళి చేసుకుంటాడు. దీంతో సేతురామ్ తన ప్రేమ విషయం ఆమెకి ఎప్పటికీ చెప్పలేని సితికి చేరుకుంటాడు. పంకజవల్లిని వదిలి వుండలేని సేతురామ్ ఆమె వుంటున్న ఇంటి పక్కపోర్షన్ లోకి వెలాడు. దేవదాసుకి సేతురామ్, పంకజవల్లి మధ్య ఏదో వుందనే అనుమానం రవీంద్రముందుంచుతాడు.

చిన్నతనం నుండి కలిసిమెలిసి తిరిగిన వారు కావటంతో పంకజవల్లి సేతురామ్ తో చాలా కలివిడిగా వుంటుంది. ఇది రవీంద్రకి నచ్చదు. సేతురామ్ ని నర్మగర్భంగా సూటిపోటి మాటలు అంటూ మానసికంగా హింసించటం మొదలు పెడతాడు. దీంతో పంకజవల్లి కాపురం తనవల్ల ఎక్కడ కూలిపోతుందో అని భయపడిన సేతురామ్ అక్కడి నుండి వెళ్ళిపోవాలని నిర్ణయించుకుంటాడు. అదే సమయంలో రవీంద్ర దేవదాసు ద్వారా ఆమెకి కేన్సరు వ్యాధి అన్నవిషయం తెలుసుకుంటాడు. చిన్నపాటి నాటకం ఆడి  సేతురామ్ ని ఆపుతాడు. పంకజవల్లిని తను వచ్చే వరకూ జాగ్రత్తగా చూసుకునే బాధ్యత సేతురామ్ కి అప్పగించి అక్కడి నుండి రవీంద్ర శాశ్వతంగా జారుకుంటాడు.

రవీంద్ర అంతరంగం తెలియని పంకజవల్లి అతనికోసం రోజులతరబడి ఎదురు చూస్తుంటుంది. రవీంద్ర తన తప్పు తను తెలుసుకొని తిరిగి వచ్చాడా? సేతురామ్ తన ప్రేమని పంకజవల్లికి చెప్పాడా? దేవదాసు ఏమయ్యాడు? ఇత్యాది అంశాలన్నీ కూడా నాటిక చదివి తెలుసుకుంటారని ఆకాంక్షిస్తున్నాను.

పెద్దిభొట్లవారి కథలో దేవదాసు పాత్ర లేదు. అది కేవలం నేను నాటకీకరణ కోసం సృష్టించిందే. అలాగే రవీంద్ర నారాయణ్ అనే పాత్రని కేవలం పంకజవల్లి భర్త అని మాత్రమే రాయటం జరిగింది. అతని గురించి కేవలం రెండు మూడు లైన్లలో ఎండ్ చేశారు. కానీ నాటకీకరణ విషయంలో నేను స్వతంత్రించి ఈ రెండు పాత్రలనూ ప్రధానంగా తీసుకొని పంకజవల్లి, సేతురామ్ ల మధ్య ప్రేమ కథని ఆవిష్కరించటం జరిగింది. గమనించగలరు.

# దగ్ధగీతం

( రెండు వాటాల ఇల్లు. ఒక ఇంటి ముందు మంచం వేసి వుంటుంది. పంకజవల్లి మంచంమీద నిద్రపోతుంటుంది. ఆ మంచానికి ఆనుకుని సేతురామ్ కూర్చొని కునికిపాట్లు పడుతుంటాడు. డిమ్‌లైటింగులో.... పంకజవల్లి పెద్దగా దగ్గుతుంది. సేతూరామ్ గబగబాలేచి ఆమెని కూర్చోపెట్టి, మంచం కిందవున్న చిన్న మగ్గుని ఆమె నోటి ముందు పెడతాడు. ఆమె అందులో ఉమ్మేస్తుంది. రక్తం..! దయనీయమైన సంగీతం వినిపిస్తుంది. సేతూరామ్ ఆమెని పడుకో బెట్టి తన టవలుతో ఆమె మూతి తుడుస్తాడు. )

**పంక:** (ఎక్కడలేని ఓపిక తెచ్చుకుంటూ... ఎందుకు చేస్తున్నావ్ ఇదంతా..? అన్న సెన్స్‌లో చేతులు ఊపుతుంది.)

**సేతు:** **ఇదంతా ఎందుకు చేస్తున్నాననా..?** (అవునన్నట్లు తలూపుతుంది. అతనికి తన మనసులో మాట చెప్పాలనిపించింది. పెదవులదాకా మాట వచ్చింది కానీ వెంటనే మాట మార్చుతూ... అనునయంగా..) **తాగటానికేమైనా తీసుకొస్తాను.!** (వద్దన్నట్లు తలూపుతుంది.) **ఆహారం ఏమీ తీసుకోకపోతే ఎలా..? డాక్టరు గారు ఏం చెప్పారు.? ఏదో ఒకటి తీసుకోవాలని చెప్పలేదూ..! తీసుకోకపోతే ఇంజెక్షన్ చేస్తారు.! సూదులెక్కిస్తారు.! అవన్నీ అవసరమా..! మా అమ్మవుకదూ..!** (సేతూరామ్ చెయ్యి తన చేత్తో అతి కష్టంమ్మీద పట్టుకొని కళ్ళకద్దుకొని తలపై పెట్టుకుంటుంది.) **పిచ్చి వల్లీ..! ఎందుకేడుస్తావ్.! డాక్టర్ గారు ఏం చెప్పారో తెలుసా..! నువ్వు మళ్ళీ మామూలు మనిషవుతావట..! కచేరీల్లో పాడతావట.! ఆ పాటలు నేను వింటానట..! అది వింటూ నేను తరించిపోతాను.! జావ తీసుకొస్తాను..! తాగుతావుగా..!** (సరే అన్నట్లు చెయ్యి వూపుతుంది. సేతూరామ్ అక్కడే చెంబులో పెట్టిన జావని గ్లాసులో పోసి ఆమెకి పట్టించేందుకు లేపి ఆమెచేత తాగిస్తుంటాడు. మళ్ళీ ఆమె నుంచి పెద్దగా దగ్గు. సేతూరామ్ కిందకు వంగి మగ్గుతీసి ఆమె నోటి వద్ద పెడతాడు. మళ్ళీ నెత్తురు వాంతి చేసుకుంటుంది. ఇక చాలన్నట్లుగా చెయ్యి చూపిస్తుంది. సేతూరామ్ ఆమె మూతి కడుగుతాడు. ఆమెని పడుకోబెడతాడు... ఆమె కళ్ళు మూసుకుంది..! కొంచెం సేపు ఆమె వైపు చూస్తాడు.. తిరిగి దేవుని పటం వైపు చూస్తూ....) **భగవంతుడా...! నీ ఆటలకు అంతేలేదా.! పంకజవల్లి ఏం పాపం చేసిందని ఆమె కమ్మని కంఠాన్ని లాగేసుకున్నావ్..! నిన్నే ఆరాధిస్తూ, నిత్యం నీ నామస్మరణ చేస్తూ, నీకీర్తనలు పాడటమే ఆమె చేసిన నేరమా..! నిన్ను స్తుతించే ఆ కమ్మని కంఠాన్ని మూగబోయేలా ఎందుకు చేశావ్..! నీకు స్తుతులూ, స్తోత్రాలు, కీర్తనలూ అవసరంలేదా.! అయినా నిన్నడిగితే నువ్వేం సమాధానం చెబుతావ్..! ఇంత అడుగుతున్నా జవాబేమైనా చెబుతావా..? చెప్పలేవు..! ఎందుకంటే నువ్వు దేవుడివి కనుక.! నువ్వున్నది బొమ్మలో కనుక.! ఎందుకలా నవ్వుతున్నావ్..! ఇలా నవ్వే..! మా బ్రతుకులతో ఆడుకుంటున్నావ్..! ఆడుకుంటున్నావ్..! ఆమె బ్రతుకును దగ్ధగీతం చేశావ్..!**

**ప్లే :** **నగుమోమూ కన లేని నాజాలి తెలిపి**

నన్ను బ్రోవరాదా శ్రీరఘువర నీ (నగు)

సేతు: అదిగో...! ఆ కమ్మని కంఠంలో త్యాగరాయకృతి తాండవిస్తోంది. నా పంకజవల్లి గొంతు ఇంకా నా చెవుల్లో మారుమ్రోగుతోంది.! అది నా మనసంతా పరచుకొని నన్ను ఆనందోత్సాహల డోలికల్లో ఓలలాడుతోంది.! ఓలలాడిస్తోంది.! కానీ ఈరోజామె మొహములో నగవులేదు, గొంతులో మాట లేదు.! భగవంతుడా....!

(అంటూ నేలమీద పడి ఏడుస్తుండగా డాక్టర్ ప్రవేశిస్తాడు. సేతురామ్ అంతలోనే ఆశతో డాక్టర్ వైపుచూస్తాడు. డాక్టర్ ఒక్క క్షణం సేతురామ్‌ని చూసి ఏమీ మాట్లాడకుండా పంకజవల్లి వద్దకి వెళతాడు. సేతురామ్ డాక్టర్ వెనుకే నిలబడి ఆతృతగా చూస్తుంటాడు. డాక్టర్ చెక్ చేశాడు. పెదవి విరుస్తూ అక్కడి నుండి లేచాడు.)

సేతు: డాక్టర్‌గారూ...!

డాక్ట: పూర్ సోల్..! షి ఈజ్ వెయిటింగ్ ఫర్ డెత్..!

సేతు: అంటే..!

డాక్ట: మీకెలా చెప్పాలో అర్థంకావట్లేదు.! కానీ, చెప్పక తప్పదు.! ఆమె ఇన్నాళ్ళూ ఎందుకు బ్రతికుందో.. ఎలా బ్రతికివుందో నాకర్థం కావట్లేదు.! కానీ, ఒకటి మాత్రం నిజం..! తను తనచావుకోసం ఎదురు చూస్తోంది.!

సేతు: ఎలాగైనా ఆమెని బ్రతికించండి..!

డాక్ట: చూడండి సేతురామ్‌గారు.! నేను మీ బాధని, మీ ఆరాటాన్ని అర్థం చేసుకోగలను.! నాకు చేతనైన ప్రయత్నం చేశాను.! కానీ, తను మందులకి కూడా రెస్పాండ్ అయ్యే స్టేజీ ఎప్పుడో దాటింది.! ఆమె ఆఖరి కోరికేంటో...!

సేతు: ఆమె భర్త..!

డాక్ట: అంటే మీరూ...!

సేతు: ( చెప్పాలా వద్దా అనే సంశయంతో.. ఏదో నిర్ణయానికి వచ్చినవాడిలా..) ఆమెతో జీవితం పంచుకోవాల్సిన వాడిని.!

డాక్ట: మరి ఆమె భర్తా..!

సేతు: ఉన్నాడు.! కానీ చాలా దూరంగా..! ఈమె కష్టంతో వచ్చిన డబ్బుతో విలాసాలకు దగ్గరగా...! వేరే ఆమెతో...!

డాక్ట: షిట్..! కబురు చేయకపోయారా...!

సేతు: ఉపయోగం లేకపోయింది.! ఆమె శవాన్ని చూడటానికి కూడా రానని తేల్చి చెప్పేశాడు.!

డాక్ట: ఓ మైగాడ్..! వాట్ ఎ షిట్ మ్యాన్.! అసలతను మనిషేనా..!

సేతు: జంతువంటే ఆవి బాధపడతాయి..! వాటికన్నా ఎంతోకొంత జ్ఞానం ఉంటుంది. కానీ వాడికి వాడి అవసరం తీర్చుకోటమే తెలిసిన జ్ఞానం.! అలాంటి నికృష్టుడికి ఇలాంటి బంగారపు బొమ్మనిచ్చి పెళ్ళిచేసి ఆమె బ్రతుకుని నిలువునా నాశనం

చేశారు.!

డాక్ట : సేతురామ్‌గారూ...! అసలీమె ఎవరు? ఈమెకీ మీకూ ఉన్న సంబంధమేంటి? అసలీమె ఎందుకిలా తయారైంది?

సేతు: చెప్తాను డాక్టర్‌గారూ.! సుస్వర గీతాలను ఆలపించే ఆ కమ్మని కంఠానికి ఆ భగవంతుడు విధించిన దగ్ధగీతపు శిక్షగురించి తప్పకుండా చెబుతాను.! పంకజవల్లి..! ఎంతో అద్భుతమైన గాయని.! నేనూ పంకజ వల్లీ ఇద్దరం చిన్న నాటినుండి ఆడుకుంటూ, పాడుకుంటూ తిరిగాం.! పంకజవల్లిని చూడందే నాకు తోచుబడి అయ్యేదికాదు.! ప్రతిక్షణం ఒక యుగంలా నాకు అనిపించేది.! నా ప్రేమను సన్నాయి నాదంగా మలిచి ఆమె పాటకు జతకలిపాను.! ఆమె ప్రతి కచేరీకి నేనే సన్నాయి వాయించే వాడిని.! ఇంతలో రవీంద్ర నారాయణ్ అనే వ్యక్తి నన్ను కలిశాడు. కళాకారులంటే తనకు ప్రాణమన్నాడు. కళలే తన ఊపిరన్నాడు. తానూ రంగస్థల కళాకారుడినన్నాడు. గుళ్ళో భజనపాటలు పాడుకునే ఆమెని సంగీత సామ్రాజ్యానికి మకుటం లేని మహారాణిని చేస్తానన్నాడు. నేనూ నిజమేనని నమ్మాను. పంకజవల్లిని ఒప్పించాను. రవీంద్రనారాయణ్ మా ఇద్దరి మధ్యా అంతులేని దూరాన్ని పెంచుతాడని నేనానాడు ఊహించలేదు.! ఎన్నో సార్లు వల్లికి నా ప్రేమ గురించి చెప్పాలని ప్రయత్నించాను కానీ రవీంద్ర నాకన్నా ఎన్నో అడుగులు ముందున్నాడని నాకు అర్ధమయ్యే సరికి ఆలస్యమైంది. చివరికి వల్లి రవీంద్రను పెళ్ళి చేసుకుంది. (ఇలా డైలాగ్ స్టార్ట్ అవ్వగానే బ్యాక్ గ్రౌండ్‌లో... "పిడికిట తలంబ్రాల పెళ్ళికూతురూ.. సాంగ్..." మెల్లిగా లైట్లు ఆఫ్ అయిపోతాయి. సేతురామ్, డాక్టర్ ఇద్దరూ కూడా అక్కడి నుండి కదులుతారు. మామూలు లైట్లు వెలుగుతాయి. పంకజవల్లి, రవి ఇద్దరూ వేదికపైకి ప్రవేశిస్తారు. నూతన దంపతుల్లా ముస్తాబై వుంటారు. సిగ్గుపడుతూ పంకజవల్లి నిలబడి వుంటుంది. రవి పంకజవల్లితో....)

రవి : ఏంటి వల్లీ.. ఇంకా ఎందుకా సిగ్గు.! ఇక్కడున్నది మనిద్దరమేగా..!

పంక: మీ అమ్మా, నాన్నా, తమ్ముడూ, చెల్లీ ఏరి వారంతా...?

రవి : కొత్తగా పెళ్ళయిన జంట నాలుగునాళ్ళు ఏకాంతంగా గడపాలని, ముద్దు ముచ్చట్లు తీర్చుకోవాలని వుండదా..! అందుకే వారిని ఆ ఇంట్లోనే వుంచి మనం మాత్రమే ఈ ఇంట్లో..!

పంక: ఈ ఇంట్లో మనిద్దరమే వుంటామా.? మరీ పోర్షన్‌లో...!

రవి : ఇప్పటికి ఖాళీ...! ఆ తర్వాత నాకు తెలీదు.!

పంక: కొత్త కోడలు ఇంట్లోకి అడుగుపెడితే హారతివ్వటానికి ఎవ్వరూ లేరే.!

రవి : ఎందుకులేరూ..! నీకు నేనున్నాను..! నాకు నువ్వున్నావ్..! మనిద్దరం ఒకరికోసం ఒకరమున్నాం.!

పంక: రవీ..! నీలాంటివాడు నాకు దొరకటం నిజంగా నేను ఏజన్మలోనో చేసుకున్న

అదృష్టం.!

రవి : కాదు వల్లీ నీలాంటి బంగారాన్ని పొందిన నేనే అదృష్టవంతుడ్ని.!

పంక: రవీ మీ అమ్మగారిని, నాన్నగారినీ మనింటికి పిలువు..!

రవి : వల్లీ..! ఇప్పుడు వాళ్ళతో పనేంటి?

పంక: పనికాదు..! అది బాధ్యత.! కొత్తగా కాపురం చెయబోతున్నాం.! మనకి ఎర్రనీళ్ళతో దిష్టితీసి నా కుడికాలు లోపలపెట్టించే అత్తగారు, కోడలిని ఆశీర్వదించే మామగారు లేకుండా మొదలుపెట్టే కాపురం కాపురమనిపించుకోదు.! నువ్వెళ్ళి వాళ్ళని ఇంటికి తీసుకురా..! అప్పటి వరకూ నేను ఇక్కడే కూర్చుంటా..!

రవి : వల్లీ.! అదీ..! నేను పిలిస్తే వాళ్ళు రారు.!

పంక: అయితే పద.! నేనూ వచ్చి పిలుస్తా..! కొత్తకోడలు వచ్చి పిలిస్తే రాకుండా ఉండరు.!

రవి : (ఏదో ఆలోచన వచ్చినవానిలా..) వాళ్ళు రారు అంటే.! రాలేరని.!

పంక: అంటే.. నువ్వనేది?

రవి : వాళ్ళు ఉంటే కదా రావటానికి.!

పంక: నన్ను క్షమించు రవీ..!

రవి : నువ్వే నన్ను క్షమించాలి వల్లీ.! పెళ్ళికి ముందే ఇవన్నీ చెబుదామనుకున్నా..! కానీ ఏ తండ్రీ తన కూతురుని అనాధలకు ఇవ్వరని, నీమీద ప్రేమతో నిన్ను నాదాన్ని చేసుకోవాలన్న ఆశతో అబద్ధమాడాను.! నన్ను క్షమిస్తావు కదూ..! (అంటూ ఆమె కాళ్ళు పట్టుకోటానికి వంగుతాడు.)

పంక: అయ్యో..! మీరు నాకాళ్ళు పట్టుకోవటం..! తప్పండీ.!

రవి : ఏం తప్పుకాదు..! శ్రీకృష్ణుడంతటివాడు తను చేసిన తప్పుకి సత్య భామ కాళ్ళను పట్టుకోలేదా.! నాదీ అదే దారి..! క్షమించాననేదాక నిన్ను వదలను.!

పంక: అయ్యయ్యో.! రవీ..! వద్దు.! ఇలాంటివి మనిద్దరి మధ్యా ఎప్పుడూ వద్దు.! ప్రేమతప్ప మరేదీ మనమధ్య ఉంటానికే వీల్లేదు.!

రవి : అయితే..! వుండు ఒక్క నిమిషం.! (లోపలికి వెళ్ళబోతుండగా..!)

పంక: అయ్యో..! ఎక్కడకి.?

రవి : నా ప్రేమను నీకు చూపించటానికి..! (అంటూ రవి అత్తగారిలా, ఆడపడుచులా మొగుడిలా త్రిపాత్రాభినయం చేస్తూ కామెడీ చేస్తాడు.) అమ్మాయ్..! నేను మీ అత్తగారిని.! కొత్తకోడలా ఇంట్లోకి అడుగుపెట్టే ముందు కుడికాలు పెట్టి రామ్మా..! " రావమ్మా మహాలక్ష్మి రావమ్మా..! నీ కుడికాలు ముందు పెట్టీ రావమ్మా..!" (అని పాటపాడుతూండగా.. ఆడపడుచులా యాక్షన్ చేస్తాడు) ఆ...ఆ... వదినా..! నేను నీ ఆడబిడ్డని...! అడుగు పెట్టేముందు ఎవరొచ్చారో చెప్పండి..!

పంక: (కిలకిలా నవ్వుతూ...) నేనూ మా ఆయనా వచ్చాం.!

రవి : ఆయనంటే కుదరదు..! నీ మొగుడు పేరు చెప్పి మరీ రావాలి.! చెప్పందే లోపలికి అడుగు పెట్టనివ్వము.! అమ్మా, చెల్లాయ్ ఏంటాగోల..! మమ్మల్ని లోపలికి రానీండి.! వీల్లేదు.! వదినా అన్నయ్య పేరు చెప్పి లోపలికి రా...! తప్పదు చెప్పెయ్..!

పంక: (కిలకిలా నవ్వుతూ...) రవి..! రవీంద్రనారాయణ్.!

రవి : ఇప్పటికైనా లోపలికి రానిస్తారా లేదా..! ఆ..ఆ.. అంత తేలిగ్గా రానిస్తానా..! నువ్వు ఎవరితో వచ్చావ్.! నేనూ తను వచ్చాం.! తనంటే ఎవరు? పేరు చెప్పు బ్రదరూ..! వల్లి.! నేనూ పంకజవల్లి వచ్చాం.! సరేనా లోపలికి వెళ్ళచ్చా..! ఆహా.! నిక్షేపంగా వెళ్ళచ్చు.! అమ్మాయ్ కుడికాలు లోపల పెట్టి రామ్మా..! ఏంటి పెద్దవాణ్ణి ఒకణ్నీ ఇంట్లో వున్నాను. నా కాళ్ళకి నమస్కారం చేయాలన్న సంస్కారమేమైనా వుందా..! మామగారన్న మర్యాదలేదూ..! అయ్యో..! నాన్నా..! నువ్వు ఆవేశపడవాక..! వల్లీ..! ఈయన మా నాన్నగారు.. అమ్మా.! నువ్వుకూడా వచ్చి నాన్న పక్కనే నుంచో..! ఏవిటా హడావుడి వస్తున్నా..! మా ఇద్దర్నీ ఆశీర్వదించండి.!( అని వంగి నమస్కారం చేస్తారు. రవి అత్త,మామల ప్లేసుల్లోకి వెళ్ళి) శీఘ్రమేవ సుపుత్ర ప్రాప్తిరస్తు. (ఇతని చేష్టలకి పంకజవల్లి పకపకా నవ్వేస్తుంది.)

పంక: చాలు రవీ చాలు..! ఇక నవ్వలేకపోతున్నాను.! నవ్వీనవ్వీ కడుపు నొప్పి వస్తోంది.!

రవి : వల్లీ..! మన కొత్తకాపురం మొదలయ్యే ఈసమయంలో నేను నీనుంచి ఒక వరం కోరుకోనా..!

పంక: నేనేమైనా దేవతనా వరాలివ్వటానికి.?

రవి : అవును.! నువ్వు నాపాలిట దేవతవే.! భాగ్యదేవతవు.! అందుకే అడుగుతున్నా..!

పంక: (దేవతలా చేతులు పెట్టి) నరుడా..! ఏమినీకోరిక..!

రవి : జై పాతాళభైరవి..! సారీ.! జై పంకజవల్లీ..! నేనున్నంతకాలం నీ మొహంపై ఆ నవ్వు అలాగే వుండేలా అనుగ్రహించు దేవీ.!

పంక: తదాస్తు.! నరుడా..! నీ భార్యకు ఎటువంటి కష్టము కలిగించకుండా ఆమె ఇష్టప్రకారమే నడుచుకుంటూ నీవున్నంతకాలం నీ భార్య నవ్వు నీతోనే ఉండేనురా..! సారీ..! స్వామీ.!

రవి : హహహ..! నాటకాల భాషనీకూ అలవాటైందన్నమాట.!

పంక: నువ్వు, నేను ఇద్దరం రంగస్థల కళాకారులమేగా రవీ.! నువ్వు నటుడివి.! నేను గాయనిని.! మనిద్దరికీ వేదిక రంగస్థలమేగా.!

రవి : అదిరిందమ్మాయ్ వల్లీ..! పాత ఇల్లు, టేకు తలుపులు.. వాటికి వేసిన డొక్కులో తాళం, కొత్తగా ప్రారంభమైన జీవితం.! ఏ జన్మలో ఏం పుణ్యం చేసుకున్నామో..! ఈ జన్మలో మనం భార్యాభర్తలమయ్యాం..! మన కాపురం శుభంకార్డులేని టీవీసీరియల్లా ఎపిసోడ్లు ఎపిసోడ్లు ఆనందంగా సాగిపోవాలని ఆకాంక్షిస్తూ.! ఆ

తాళం కప్ప నేను పట్టుకుంటా, తాళం నువ్వు తీసి మన కాపురానికి రిబ్బన్ కటింగ్ చేయి..!

పంక: ఇదేంటి రవీ..! తాళం ఊడిరదికానీ..! తలుపు తెరుచుకోదే..!

రవి : చూస్తున్నా..! చూస్తున్నా..! వల్లీ..! ఈ తలుపు తెరవటానికే ఉన్న ఎనర్జీనికాస్తా వాడేస్తే రాత్రికి మన ప్రోగ్రామ్ సక్సెస్‌ఫుల్‌గా సాగినట్లే.!

పంక: రాత్రి ప్రోగ్రామా...?

రవి : అదేనే ఫస్ట్‌నైటూ..!

పంక: ముందు తలుపు తెరువు రవీ..!

రవి : తెరుస్తున్నా..! తెరుస్తున్నా..! క్రీస్తు పూర్వం నాటి ఇల్లులా వుంది..! తలుపులు బిగుసుకు పోయాయి..! పట్టరపట్టు హైలెస్సా..! ఉడుంపట్టు..! హైలెస్సా..! తొయ్యరా తొయ్యి..! వన్ టూ త్రీ...! (తెరుచుకున్నట్టే తెరుచుకొని మళ్ళీ పడిపోతుంది.)

పంక: ఇట్లాంటిల్లు మీకెక్కడ దొరికిందండీ..! వెంటనే వేరే ఇల్లు చూడండి..!

రవి : బడ్జెట్ నిల్..! అంటే..! ఏమీలేదు..! మొత్తం వ్యాపారం మీద పెట్టాను.! ఇన్నాళ్ళూ పెళ్ళికాలేదు కదా..! అందుకే ఖర్చులు కూడా తెలీలా..! ఇప్పుడు పెళ్ళయింది..! నువ్వొచ్చావ్.! మన ఖర్చులెలా వుంటాయో ఏంటో...! అందుకే నాదగ్గరున్న డబ్బుతో, తక్కువ అద్దెతో.. ఇంతకంటే నాకు వేరే ఇల్లు రాదు.. అందుకనీ..!

పంక: రవీ..! ఈ ఇల్లు నడపటానికి నువ్వొక్కడివే శ్రమపడద్దు.! రెండు చేతులు కలిస్తే చప్పట్లు ఎలా వస్తాయో..! భార్యాభర్తా కలిసి శ్రమిస్తేనే సంసారమనే బండి సాఫీగా సాగుతుంది.! మనిద్దరం భార్యాభర్తలం..! కలిసి ప్రయత్నిద్దాం..! రండి..! (అంటూ రవి చెయ్యి పట్టుకొని ముందుకు నడిపిస్తుండగా... కార్యేషు దాసీ అనే పాట వస్తుంది. ఇద్దరూ కలిసి వెళ్ళి తలుపుని తోస్తారు. తలుపు తెరుచుకుంటుంది. లోపలికి అడుగు పెడతారు.!)

## లైట్స్ ఆఫ్

## 2వ సీన్

(రవి పచార్లు చేస్తుంటాడు. సెల్ ఫోన్ మధ్య మధ్యలో చూస్తుంటాడు. ఏదో లెక్కలేసుకుంటుంటాడు. బయటికి చూస్తాడు. దేవదాసు హడావుడిగా వస్తాడు. దేవదాసుని చూస్తూనే ఎక్కడలేని ఆనందం మొహంలో కనిపించినా వెంటనే సీరియస్ అవుతూ...)

రవి : ఏరా..దాసూ..! నీకసలు బుద్ధుందాలేదా..! ఇప్పుడా వచ్చేది.!

దేవ : బెజవాడ, భీమవరం ఇళ్ళకైతే ఒకరోజు ముందే వచ్చేవాడ్ని..! ఈవిడి గారిని పెళ్లిసేసుకొని నాలుగురోజులేగా అయింది.! ఆ అచ్చట్లు ముచ్చట్లూ లాంటివి గట్రా..!

రవి : నోర్ముయ్..! ఆ ఇంటి వాగుడు ఈఇంట్లో, ఈ ఇంటి వాగుడు మరొక ఇంట్లో వాగొద్దని ఎన్నిసార్లు గడ్డిపెట్టినా నీకు బుద్ధిరాదు..!

దేవ : ఏమయ్యో..! బుద్ధి గిద్ధి అన్నావంటేనా..?

రవి : ఏం చేస్తావ్‌రా..!

దేవ : రా నా..! వయసులో నీకంటే పెద్దోణ్ణి... నన్ను రా అంటావురా..!

రవి : ఇప్పుడే నిన్ను డిస్‌మిస్ చేసేస్తున్నా..! ఫో..!

దేవ : నేను డిస్‌మిస్ అయితే నువ్వయిపోతావ్..రా..! కుర్రసన్నాసీ..!

రవి : ఏంట్రోయ్..! నోరు తెగ పేలిపోతోంది..!

దేవ : ఆఁ..! నన్ను డిస్‌మిస్ చేస్తే నేనూరికే వుంటాననుకున్నావా..? రోడ్డుమీదకెల్తా..! టీవీ నైన్‌ని పిలుస్తా...! ఈటీవిని పిలుస్తా..! అన్ని మీడియాల్ని పిలిచీ... ఊరికో గోపికను పెట్టి ఉద్ధరిస్తున్న నీ కృష్ణలీలల్ని కథలు కథలుగా చెబుతా.!

రవి : నువ్వెక్కడ తగిలావురా నాకు రంకు మొగుడా..! (లోపలి నుండి "సమయానికి తగుమాటలాడరే.." అనే కీర్తన వస్తుంది. అందుకు తగ్గట్లుగా రవి అభినయిస్తుంటాడు. ముందు ఒప్పుకోక పోయినా తర్వాత ఒప్పుకుంటాడు. తన బుజానికి తగిలించుకున్న సంచీలోంచి డబ్బులు తీసి ఇస్తుంటాడు.) అయినా మాటనుకునేంత చనువు మనిద్దరి మధ్యాలేదా దేవదాసుగారు..! సరేలేండి..! ఈ నారద పాత్ర పోషించటం వల్ల నాకే కాదు.. తమరికి కూడా తిప్పలు తప్పవు కాబట్టి సైలంటైపోతే ఇద్దరికీ మంచిది..!

దేవ : సరే..!

రవి : ఇంతకి మన కలెక్షన్ల దగ్గరికి వద్దామా..!

దేవ : ఈ డబ్బు బెజవాడ బ్రాంచినుంచి, ఈ డబ్బు కాకినాడ బ్రాంచి నుంచి, ఇది గుంటూరు బ్రాంచి నుంచి, ఈ డబ్బులు ఢల్లీ బ్రాంచినుంచి..!

రవి : ఢల్లీ బ్రాంచి డబ్బులు రానురాను తగ్గుతున్నాయేం దేవదాసూ..! కొంపతీసి దాన్ని కానీ నువ్వు సైడు ట్రాకులో పెట్టావా ఏంటి?

దేవ : అదొక్కటే తక్కువ.! అయినా దానివయసేంది..! నీ వయసేంది..! పెల్లామన్నా నమ్మేట్టుండాలి కానీ, యాభైఏల్ల ముసల్ది కూడా నీకు పెల్లామేందయ్యా.! చెప్పుకోటానికి నీకు సిగ్గులేకపోయినా, డబ్బులకోసం ఎల్లినప్పుడల్లా నేను సిగ్గుతో సచ్చిపోతున్నానయ్యా.! అదీ.. దాని వయ్యారమూనూ..! కులుకులతో కుల్ల బొడుస్తోంది.!

రవి : సరేలే..! దానిక్కావాల్సింది మొగుడు, మనక్కావాల్సింది మనీ. కాసేపు కళ్ళు మూసుకుంటే ...

దేవ : ఇంకా సెండాలమాపయ్యా..! ఇంటానికే సెండాలంగా వుంటేనీ.!

రవి : మాటల్లో పెడితే మ్యేటర్ మర్చిపోతాననుకున్నావా..! అమౌంట్ తగ్గుతుందేంటమ్మా..!

దేవ : ఏం చెయ్యమంటావ్ బాసూ నన్ను..! లలిత కళలకన్నా మన ప్రధానమంత్రికి యోగాసనాలే ఎక్కువలా వుంది.! మాట్లాడితే సాలు ముక్కుమూసుకొని

యోగాసనాలేసుకొమ్మంటున్నాడు.! ఇక మనకి ప్రోగ్రాములేం వస్తాయ్..! అప్పటికీ ఆల్లకాల్లూ ఈల్లకాల్లూ పట్టుకొని ఈ ముసల్దాని డాన్సులు పెట్టిత్తున్నా..!

రవి : అలా అయితే ఢిల్లీ బ్రాంచి మీద గట్టిగా వర్క్‌చేయాలి.!

దేవ : నువ్వు వర్క్ చేయటానికి ఆడేంమిగల్లేదు.! ముసల్దది..!

రవి : ఢిల్లీ బ్రాంచి అంటే ఆ ముసలి డాన్సరే అనుకున్నావ్‌రా..? సాఫ్ట్‌గా వుండే సాఫ్ట్‌వేర్లున్నారు.! స్పైసీగా వుండే మిర్చీ గర్ల్స్ ఉన్నారు.! యోగాసనాలేయించే పంతులమ్మలూ ఉన్నారు.! ఇంత మంది అమ్మాయిల్నీదేశంలో పెట్టుకొని దేశంలో ఆడోళ్ళ సంఖ్య తక్కువగా వుందని ఊకదంపుడు దంచే యదవల్ని తుపాకితో కాల్చేయాలి.!

దేవ : (మెల్లిగా అంటాడు) ముందు నిన్ను కాలిత్తే పీడా పోయిద్ది..!

రవి : రేయ్..! నాకినపడుతోంది.!

దేవ : లేకపోతే ఏందయ్యా..! ఎక్కడెక్కడి అమ్మాయిల్నీ నువ్వే పట్టుకు పోతుంటే మాలాంటి బ్యాచిలర్సు పరిత్తితేందండీ..!

రవి : ఈవయసులో నీకెందుకురా పెళ్ళి..!

దేవ : నీకేంటయ్యా..! ఊరుకో పెళ్ళాన్ని ఉద్ధరిస్తున్నావ్..! రాజయోగమంటే నీది.!

రవి : రాజయోగమా మట్టిగడ్డా..! నీకేం తెలుసురా..! నా తంటా..! చెప్పినమాట చెప్పకుండా తిరిగే వాడికి తెలుస్తుంది..! ఎవరితో ఏమాట చెప్పానో.. గుర్తుపెట్టుకోవాలి..!ఎక్కడ ఎలాంటి కథ చెప్పాలో చెప్పాలి.! ఒక కథలో కేరెక్టర్ ఇంకో కథలోకి ఎంటర్ అవ్వకుండా చూసుకోవాలి.! ఒకవేళ మన ఖర్మకాలి కో ఇన్సి డెంటల్‌గా ఎదురుపడితే అప్పటికప్పుడు కవర్ చేసేలా కొత్త కథను చెప్పాలి.! ఇంతేనా..! ఇంకా..!

దేవ : ఇంత సిగ్గుమాలిన బతుకు నీతోనే పోనీయ్యా.! పగోడిక్కూడా వద్దు..!

రవి : రేయ్..! చనువిచ్చానుకదాని చంకెక్కకు..! చంపేస్తాను.!

పంక: (లోపలి నుండి వస్తూ..) ఏంటండీ గొడవ పడుతున్నారు.?

రవి : అబ్బే గొడవేంలేదు వల్లీ..! వీడు దేవదాసనీ..!

దేవ : బాసుగారి పిఏని.!

రవి : దేశవ్యాప్తంగా వున్న నా నటశిక్షణాలయాలన్నీ ఇతనే తిరిగి చూసుకుంటుంటాడు..! కదరా..!

పంక: అయ్యో.! నిలబెట్టే మాట్లాడుతున్నారు.! కూర్చోండి..!

రవి : వాడు కూర్చోడు..!

పంక: ఓనరుగారనా..? ఫర్వాలేదు కూర్చోండి..!

రవి : నువ్వు ఉన్నపలంగా కోటి రూపాయలిచ్చినా కూడా వాడు కూర్చోడు.!

దేవ : అవునమ్మా..! మొన్నా మద్దె సిక్కిం రాష్ట్ర ముఖ్యమంత్రి సీటిత్తాం కూర్చోరా దేవదాసు అన్నారమ్మా.! నేను కూసుంటానా..! కూసో నన్నా..! ఆల్లు బతిమాలారు.! నేనూ కూసోనంటే కూసోనూ, కావాలంటే నిలబడతా నన్నా..! ఆల్లు ఈల్లేదన్నారు.! నేను పోరా అని సీటొదిలేశా..!

రవి : నీ బొందేంకాదూ..! ఏం లేదు వల్లీ..! వాడికి పైల్స్..! అందుకే ఫ్రీగా కూర్చోలేడు.! ఎంత దూరమైనా సరే నిలబడే పోతాడు.! ఒక్క మన నటనాలయాలే కాదు..! ఇక నుంచి మన ప్రోగ్రామ్స్ మిగిలిన వ్యవహారాలు అన్నీ కూడా దేవదాసే చూసుకుంటాడు.

పంక: అలాగా..!

దేవ : అవునమ్మా..! ఇక నుంచి మీరు ఊపిరి సలుపుకోటానికి కూడా వీల్లేకుండా ప్రోగ్రాముల మీద ప్రోగ్రాములు బుక్ చేసేస్తా..!

రవి : (ఈ డైలాగులు చెప్పే కాసేపు...! పంకజవల్లి చాలా ఎగ్జైట్‌మెంట్‌కు లోనవుతుంది.) అవును వల్లీ..! దేశంలో ఇప్పుడున్న పెద్దపెద్ద కళాకారులందరూ కూడా ఇంత పెద్దవారు ఎలా అయ్యారనుకున్నావ్..! మనవల్లే..! సినిమాల్లో పాటలుపాడే యువగాయకులు, గాయనీమణులు, హీరోలు, హీరోయిన్లు అందరూ మన ప్రొడక్ట్సే.! కాకపోతే మనం బయటికి చెప్పుకోం.! వీడు మామూలోడు కాడు.! వీడు బుక్‌చేసే ప్రోగ్రామ్స్ కూడా మామూలు ప్రోగ్రామ్స్ కావు.! పెద్దపెద్ద వాళ్ళు వస్తారు.! ఇప్పుడు నువ్వు రవీంద్రనారాయణ్ పెళ్ళానివి.! రేపు నేను పంకజవల్లి భర్తని అనిపించుకోవాలి.!

పంక: నాకెందుకండీ అంత గౌరవం ఇస్తారు.?

రవి : ఎందుకంటే నువ్వు నా భార్యవి కనుక.! ఇప్పటి వరకూ ఎంతో మందికి ఎన్నో అవకాశాలు కల్పించి టాప్ ప్లేస్‌లో నిలబెట్టిన వాణ్ణి, నా భార్యను నేనా స్థానంలో చూడాలనుకోవటం తప్పా చెప్పు..!

పంక: తప్పేం కాదు..! కానీ నేను ఆడదాన్ని.!

రవి : ఎవరు చెప్పారు..?

దేవ : ఈమె ఆడదనా..?

రవి : నోర్ముయ్.! భార్య తక్కువ.. భర్త ఎక్కువ అని ఎవడు చెప్పాడు..! అన్నవాడిని ఆడాళ్ళేసుకునే ఎడంకాలి చెప్పుతో కొట్టాలి.! పిచ్చి వల్లీ..! మీ ఆడాళ్ళిలా అనుకోటంలో తప్పులేదు.! ఇది మగజాతి దురహంకార పూరిత చర్య.! దీన్ని కూకటివేళ్ళతో పెకలించేదాకా నేను నిద్రపోను. అందుకే నేను ఉద్యోగం మానుకొని అయినా నా ఇంటినుంచి నిన్ను ఉద్యోగానికి పంపిస్తా..! స్త్రీ శక్తి ఔన్నత్యం ఈ ప్రపంచానికి చాటి చెబుతా..! అసలు నిన్నే ఒక శక్తిగా నిలబెడతా.! యత్ర నార్యస్తు పూజ్యంతే... రమంతే తత్రదేవతాః.! అని నిరూపిస్తా..! (అని ఉద్వేగంగా చెబుతుంటాడు..)

పంక: ఆడవారిపట్ల మీకింతటి గౌరవభావం ఉందని నాకిప్పుడే తెలిసిందండీ..!

దేవ : నాక్కూడా..!

పంక: మీక్కూడానా..?

రవి : అదే..! ఇప్పటివరకూ ఆడవారిపట్ల నా మనసులో ఉన్న భావన వాడిక్కూడా చెప్పలేదు.! అందుకే నీతోపాటే వాడూ షాకయ్యాడు.! కదరా..!

దేవ : అవునవును..! (ఫోనొస్తుంది) హలో..! ఆ నేనే దేవదాసుని..! రవీంద్ర గారామ్మా..! చాలా బిజీగా వున్నారు.! వైజాగ్‌లో ఈమధ్యనే కొత్త బ్రాంచి ఒకటి ఓపెనింగు చేశారమ్మా..! బాబు బాగా బిజీ.! ఏంటీ మీరు వైజాగొచ్చారా..? (రవీంద్రకు ఎక్కిళ్ళు వస్తాయి. భార్యని మంచినీళ్ళు తెమ్మని లోపలికి పంపిస్తాడు.) ఇప్పుడే ఆయన్ని కలవాలంటారా..?

రవి : ఎవర్రా..?

దేవ : అనంతపురం ఆండాళ్ళు.! అదేనండీ చింతామణి, బాలనాగమ్మ ఫేము.! మిమ్మల్ని అర్జంటుగా కలవాలంటా.... పెట్టే బేడా తీసుకొని వాల్తేరులో దిగిందంట..!

రవి : నేనిక్కడున్నానని దానికెవరు చెప్పార్రా..!

దేవ : అనంతపురం దాకా వెల్లటం కష్టంగా వుందండీ.! రానూ పోనూ శార్జీలతోపాటు ప్రయాణంలో ఒల్లు గుల్లవుతోంది.! ఎట్టాగూ బొబ్బిల్లో చింతామని పెట్టించా..! పోతా పోతా డబ్బులిచ్చి పొమ్మని నేనే సెప్పా.! ఎట్టుందంటారు ఐడియా..!

రవి : నీ బొందలావుందిరా... నీ బొందలా వుంది.! దాన్ని అక్కడే వుండమను..! పావుగంటలో వచ్చి కలుస్తానని చెప్పు.! అన్నట్లొరే.! రేపటికే దీనికి సీతమ్మధార త్యాగరాయ గానశాలలో ప్రోగ్రామ్ బుక్ చేయ్..! చాలా అర్జంట్.!

దేవ : ముందే రేపటికి ప్రోగ్రాము ఎవరైనా బుక్కు చేయించుకుంటే..!

రవి : నీకు తెలీనిదైతేగా..! ఎప్పటిలాగే అవతలి ప్రోగ్రాము చెడగొట్టు..! దీని ప్రోగ్రాము పెట్టించు.! ఇదొచ్చి నన్నడిగితే అర్జంటు ఫోనొచ్చి వెళ్ళానని చెప్పు.! (పరుగులాంటినడకతో వెళుతుంటాడు.. యంగ్ గెటప్‌లో సేతూరామ్ ఎదురవుతాడు. సేతూరామ్ రవీంద్రను విష్ చేస్తూ లోపలికి వస్తాడు. సేతూరామ్‌ని పక్కకి తప్పించుకొని రవి హడావుడిగా వెళ్ళిపోతాడు. సేతూరామ్ తన పోర్షన్ వైపుకు వెళ్ళి తాళం తీస్తుండగా మంచినీరు తీసుకొని పంకజవల్లి వస్తుంది. పంకజవల్లిని చూస్తూనే సేతూరామ్ తాళం తియ్యకుండా అలాగే చూస్తుండి పోతాడు. పంకజవల్లి అది గమనించి ...)

పంక: రామ్..! నువ్వేంటిక్కడ.! దేవదాసుగారూ ఇంతకీనేరీ.!

దేవ : ఆయనామ్మా..! అర్జంటుగా ఫోనొస్తే బయటికెళ్ళాడు.!

పంక: చెప్పు రామ్..! ఏంటిలా వచ్చావ్..!

సేతు: నువ్వేంటిక్కడున్నావ్..!

పంక: ఇది మా ఇల్లే..!

సేతు: ఇది నాది..! ఇప్పుడే అడ్వాన్సు ఇచ్చి ఇందులోకి దిగుతున్నా..!

పంక: అవునా..! రామ్..! నువ్వు గమనించావా..! చిన్నప్పటి నుంచి మనిద్దరం ఒకరిని చూడకుండా ఒకరం ఏరోజూ లేముకదా..!

సేతు: అవును.!

పంక: నా పెళ్ళిబంధం మనిద్దరి స్నేహబంధాన్ని దూరం చేసిందే అని బాధపడుతున్న ఈ సమయంలో.. ఆదేవుడు చూశావా..! మన స్నేహాన్ని పక్కపక్క వాటాల్లోకి ఎలా ఏర్పాటు చేశాడో..!

దేవ : ఈ బాబు... ఎవరమ్మా..!

పంక: ఇతను సేతూరామ్ అని నా స్నేహితుడు. చిన్నప్పటి నుంచి కలిసే పెరిగాం.! కలిసి తిరిగాం.! నాపాటకు ఇతని నాదస్వరం సహకరిస్తే ఆ కచేరీ ఎంత అద్భుతంగా వుంటుందో మాటలతో చెప్పలేం.!

సేతు: అవును వల్లీ..! ఆ..! వల్లీ..! నీ వివాహసమయంలో ఈ స్నేహితుడు ఎలాంటి కానుకలూ ఇవ్వలేకపోయాడు.! కానీ ఇప్పుడు... ఈక్షణంలో .....!

పంక: మనలో మనకెందుకివన్నీ రామ్..! అయినా నా పెళ్ళికి నువ్వు నాదస్వరం వాయించావుగా..! అంతకన్నా గొప్ప గిఫ్ట్ నువ్వు ఇవ్వదగింది ఏదైనా సరే ఇవ్వు...!

సేతు: ఇస్తాను.! కానీ నువ్వు నాకో సాయం చెయ్యాలి.!

పంక: రామ్..! నీ నోటి నుంచి నేను వినకూడని మాట అన్నావ్..! ఫో..రామ్..!

సేతు: వల్లీ...ఇప్పుడు నేనేమన్నానని.. అలా అలుగుతావ్.!

పంక: సాయం..! స్నేహితుడు స్నేహితురాల్ని అడగ కూడనిదే సాయం..! నాదగ్గర నీకా స్వతంత్రం ఎప్పుడూ వుంది..!

సేతు: నన్నూ నీతో కచేరీలకు తీసుకెళ్ళు..! నా గొంతులో ఊపిరి వున్నంతవరకూ ఎప్పటిలాగే నీ పాటకు నానాదస్వర సహకారాన్ని అందించనీ.!

పంక: ఇదిగాక సౌభాగ్యమిదిగాక తపము.. ఇదిగాక వైభవమ్మింకొకటి కలదా..! రామ్..! ఈ స్నేహితురాలికి ఎంత పెద్దవరం కానుకగా ఇచ్చావో అర్ధమౌతోందా..!

సేతు: వల్లీ..! నిన్ను సంగీత సామ్రాజ్యానికి మకుటంలేని మహారాణిగా చూడాలన్న కోరికతో నేను నీముందుంచిన విన్నపం.!

పంక: కాదు..! నీ ఆదేశం..! దేవదాసుగారూ..! వెంటనే రవీంద్రకి ఫోన్ చేసివ్వండి..!

దేవ : బాబు బాగా బిజీగా వుంటాడు కదమ్మా..! అలా చూస్తే ఏం చేస్తాం..! ఫోన్ చేస్తాం..! హలో..! ఆ బాబూ..! మేడంగారు మాట్లాడతారట..! అవునా..! అనంతపురం పార్టీ వస్తే మాట్లాడుతున్నారా..! బాగా బిజీనా బాబూ.! అలాగే బాబూ..! అదమ్మా విషయం..! ఎవరో పెద్ద పార్టీ వచ్చారు.! కోట్లల్లో బేరాలు..! నువ్వు అడుగు పెట్టిన వేళావిశేషం.! ఏమయ్యా సేతూరామ్..! మీ స్నేహితురాలి పాదం మామూలు పాదం

కాదు..! లక్ష్మీపాదం.! ఆవిడలా అడుగు పెట్టిందో లేదో.. ఇలా కోట్ల రూపాయల ఆఫర్ బాబుకి అలా వచ్చి పడింది.! అన్నట్లమ్మా..! బాబు ఈరోజూ, రేపూ ఇంటికి రానన్నారు..! అనంతపురం వెళుతున్నారట.! ఏనిర్ణయమైనా మిమ్మల్నే తీసుకో మన్నారు.! మీకేం కావాలో చేసుకోమన్నారు. అన్నట్లు బాబు కోటు జేబులో డబ్బుందట.. అవసరానికి వాడుకోమన్నాడు.. డబ్బుమీరు తీసుకొని కోటు నాకిస్తే బాబుకి నేనిస్తా..!

పంక: అలాగే దేవదాసూ..! ఒక్కనిమిషం..! (లోపలికి వెళ్ళి కోటు తెచ్చిస్తుంది.)

దేవ : అన్నట్లు రేపు మీ ప్రోగ్రామ్ బుక్ అయింది. సీతమ్మధార త్యాగరాయగానశాలలో... అయ్యగారు మీకు చెప్పమన్నారు.! మీరు ఆపనిలో వుండండమ్మా.! వస్తానమ్మా..!

సేతు: నేను సామాను సర్దుకొని వస్తాను.! రేపు కచేరీ వుందన్నారుగా..! సిద్ధంగా వుండు.. సాధన చేద్దాం.!

దేవ : ఓహో..! బాలమిత్రులిద్దరూ ఇకనుంచి పక్కపక్కనే వుంటారన్నమాట.! ఇంకే కావలసినంత కాలక్షేపం.. తీరికలేనంత సాధన చెయ్యచ్చు.! అదే కచేరీల గురించి..! వస్తానమ్మా.. వెళ్ళొస్తా సేతూరామ్.! (తనలో) మర్చేపోయాను.! ఈవిడగారి ప్రోగ్రాం త్యాగరాయ గానశా లలో ఏర్పాటు చేయించాలి కదూ.! (ఫోన్ చేస్తూ) హలో..! గానశాలాండి..! అప్పన్నగారూ..! రేపు మనగానశాలలో..... (అంటూ బయటికి వెళ్ళి పోతాడు. సేతూరామ్, పంకజవల్లి ఇద్దరూ దేవదాసుని చూసుకుంటూ నవ్వుకుంటారు.)

పంక: వట్టి హడావుడి మనిషి..! పద..! నేనూ వచ్చి నీకు సాయం చేస్తాను..! (అతనికి ఏం మాట్లాడాలో అర్ధంకాదు.. పంకజవల్లి నవ్వుతూ లోపలికి వెళుతుంది. సేతూరామ్ కూడా తన గదివైపు వెళుతుండగా.. దేవదాసు తన చేతి సంచీ తీసుకోటానికి వస్తూ గమనిస్తాడు.)

దేవ : బాబు బాగా బిజీ...

## (లైట్స్ఆఫ్)
## 3వ సీన్

(పంకజవల్లి గాత్రం సేతూరామ్ నాదస్వరంతో ఇద్దరూ కూడా కూర్చొని సాధన చేస్తుంటారు.)

పల్ల : జగదానంద కారకా.. జయ జానకీ ప్రాణ నాయకా... || జగ ||

అను : గగనాధిప సత్కులజ రాజరాజేశ్వరా..
సుగుణాకర సురసేవ్య భవ్యదయాక సదాసకలా || జగ ||

చర : ఇంద్రనీల మణి సన్నిపాపఘన చంద్రసూర్య నయనాప్రమేయ
వాగీంద్ర జనక సకలేశ శుభ్ర నాగేంద్ర శయన శమన వైరీశనుత

(రవి, దేవదాసులు సీరియస్‌గా వుంటారు. పంకజవల్లి, సేతూరామ్‌లు తన్మయత్వంతో ఊగిపోతూ సాధన చేస్తుంటారు. దేవదాసు,రవీంద్రకి ఎక్కిస్తుంటాడు. పాట పూర్తయ్యేసరికి రవీంద్ర లేని నవ్వు మొహం మీదికి తెచ్చుకుంటూ...)

రవి : చాలా బాగుంది మీ జంట..! అదే..! మీ ఇద్దరూ కలిస్తే సంగీత సామ్రాజ్యాన్ని అటునుండి ఇటూ ఇటునుండి అటూ దున్నేయచ్చంటున్నా..!

సేతు: (పొంగిపోతూనే..) అంత మాటెందుకులే రవీ..! మేం చేసే సాధన నాద భారతికి నివేదన లాంటిది.! ఇక కీర్తి ప్రతిష్టలంటావా..! వాటిమీద మాకంత ఆసక్తిలేదు.!

దేవ : మేము అంటున్నావ్..! మీ ఇద్దరనా..?

పంక: అవును.! మేమిద్దరం అంటే ఏంటో తెలుసా..! ఒకరు గాత్రమైతే, మరొకరు నాదం.! సంగీతానికి రెండూ ముఖ్యమే.!

రవి : అవునవును..! మీ ఇద్దరూ సరే..! మరి నేనో..!

సేతు: నటరాజువి..! సర్వకళల సమాహారం.. సకలభావ సమ్మిళితం.. కావ్యేషు నాటకం అన్నారు.! మరి ఆ నాటకానికి అన్ని సంభారాలూ సమకూర్చి అత్యంత రసరమ్య మనోహర కావ్యంగా మలిచే నీవు నటరాజువి కాక మరేంటి? మేమిద్దరమూ నీకు రెండు కళ్ళలాంటి వాళ్ళం.!

పంక: సేతూరామ్..! నీ మనసులాగే నీ నాదవిన్యాసం..! నీ నాదవిన్యాసం లాగే నీమాట..! ఎంతో పవిత్రంగానూ.. స్వచ్ఛంగానూ.. చాలా తీయగా వుంటాయి.!

దేవ : అవునవును..! చిన్నప్పటినుండీ కలిసితిరిగినవాళ్ళు..! ఒకరి మనసు ఒకరికి బాగా అర్ధమౌతుంది.! మాబోటి వాళ్ళకే అట్టే అర్ధమైచావదు..! (సేతూరామ్ అనీజీగా ఫీలవుతాడు. లోనికి వెళ్ళబోతుండగా...)

రవి : ఏంటి సేతూరామ్..! మాట్లాడుతుంటే అలా వెళ్ళిపోతావే..!

పంక: అతనెప్పుడూ అంతే..! అవసరానికి మించి మాట్లాడడు..!

సేతు: అదేంలేదు..! నాదస్వరం లోపలపెట్టి వద్దామని..! చెప్పు రవీంద్ర..! ఏంటి విషయం.!

రవి : నీ పర్సనల్ విషయమే అనుకో...! స్నేహితుడివని చనువుతీసుకొని అడుగుతున్నా..! మరోలా అనుకోకు..! నువ్వింకా పెళ్ళి చేసు కోకుండా అలాగే వుండిపోయావే.! (సేతూరామ్ మౌనం.)

పంక: అవును..! నేనూ ఎప్పటి నుండో అడగాలనుకుంటున్నా..! నువ్వెప్పుడు పెళ్ళి చేసుకుంటావ్ రామ్..!

దేవ : మేడంగారడిగినా మౌనంగా వున్నాడంటే.. ఎవర్నో లౌస్ చేసి వుంటాడు. ఆమె కాస్తా ఈనగారికి హ్యాండ్ ఇచ్చి వుంటుంది. దాంతో ఈనగారు భీష్ముడిలా....!

సేతు: (ఆవేశంగా...) దేవదాసూ....! (అంటూ దేవదాసు చొక్కా పట్టుకొని చెంపలు పగిలేలాకొడతాడు.)

రవి : సేతూరామ్.. సేతూరామ్..! (అంటూ విడిపిస్తాడు)

సేతు: తను అలాంటిది కాదు.! దేవత..! దేవతనెంతోమంది ఆరాధిస్తారు..! కానీ ఆమె అనుగ్రహం దక్కేది ఏ ఒక్కరికో..!

రవి : అతనేమన్నాడని..! ఏదో సరదాగా...!

సేతు: సరదా కొంతవరకే రవీంద్రనారాయణ్..! శృతిమించితే దాని ప్రభావం ఎవరిమీదైనా ఇలాగే వుంటుంది.!

రవి : అంత సీరియస్ ఎందుకోయ్..! ఓ.కే..! కూల్ డౌన్.. కూల్‌డౌన్..! ఈవినింగ్ ప్రోగ్రామ్‌కి రెడీ అవ్వు..! నౌ టేక్ రెస్ట్..! వన్ అవర్‌లో మనం బయల్దేరుతున్నాం.! (సేతూరామ్ వెళుతుండగా..) అన్ లక్కీ ఫెలో..!

పంక: ఇతను కాదు రవీ అన్‌లక్కీ.! ఇతని ప్రేమను పొందలేకపోయినందు ఆ అమ్మాయి అన్‌లక్కీ..!

రవి : అవును..! ఆ అమ్మాయి అన్‌లక్కీనే..! ఆ దేవతను చేసుకున్న వాడు ఇంకా లక్కీ ఫెలోకదూ..!

పంక: ఏమో..! తెలీదు..! రవీ..! ఇలాంటి మంచి వాళ్ళకి ఆ దేవుడు ఎప్పుడు ఎందుకిలా చేస్తాడో..!

దేవ : ఆయన దేవుడు కదమ్మా..! అందుకే అట్టా ఆడుకుంటాడు..! ఏం చేస్తాం..! మనం ఆయన ఆడిరచినట్టల్లా ఆడాలి.!

రవి : రేయ్..! దేవదాసూ..! కాసేపు నువ్వు నోర్మూసుకో..! వల్లీ..! నువ్వుకాసేపు రెస్ట్ తీసుకో..! మన ప్రోగ్రామ్‌కి గెస్టులుగా మంగళంపల్లి బాలమురళీకృష్ణ, లతామంగేష్కర్, సుశీలమ్మ లాంటి పెద్దపెద్ద విద్వాంసులు వస్తున్నారు..! ముఖ్యంగా ఆ గమకాలు జాగ్రత్తగా చూసుకో...! వాళ్ళు కానీ నిన్ను మెచ్చుకుంటేనా...! మనం ఈ డొక్కు ఇంట్లో వుండాల్సిన అవసరమేలేదు..! హాయిగా పెంట్ హౌస్‌లోకి షిఫ్టయిపోవచ్చు.. ఇది మనకి మంచి అవకాశం..!

పంక: అలాగే రవీ..! నేను బాగా సాధన చేస్తాను..!

రవి : వెళ్ళు..! రెస్ట్‌తీసుకో..! వన్ అవర్‌లో మనం స్టార్ట్ అవ్వాలి.!

పంక: అలాగే..! (లోనికి వెళ్ళిపోతుంది.)

రవి : రేయ్..! దేవదాసూ..! నువ్వేమనుకుంటున్నావ్‌రా..!

దేవ : మొరటోడు కదబాసూ..! బాగా వాయించేశాడు..! (సీరియస్‌గా చూస్తాడు రవి.) ఓహ్..! అర్థమైంది..! వాడి గురించేగా మొరటోడు కదబాసూ..! అందుకే లిల్లీ పువ్వులాంటి వల్లీ మేడంని ఏం చెయ్యాలో అర్థంకాక నీచేతిలో పెట్టాడు.!

రవి : మరి వాళ్ళిద్దరూ వాడి వాటాలో కెళ్ళి...!

దేవ : అది సెన్సార్ కట్ అనుకొని సూల్లేదు బాసూ..! ఏందట్టా నవ్వుతున్నా..! నీ పెల్లాం ఆడి కొంపలోకెల్లి..!

రవి : దాన్ని నా పెళ్ళాంగా చూస్తేనేకదరా నేను ఫీలయ్యేది.! అది జస్ట్ మనీ సంపాదించే మిషన్..! (ఫోన్ మోగుతుంది.) ఆఫోన్ ఎవరో చూడ్రా..!

దేవ : హలో..! ఎవరమ్మా..! సింధూనా..! సింగరా..! అయితే ఏంటంటా..! నేను

రవీంద్రనారాయణ్‌గారి పిఎని.! ఆయనతో మాట్లాడటం కుదరదమ్మా..! బాసు బాగా బిజీగా వున్నారు.! శంకర్‌మహదేవన్, ఉదిత్ నారాయణలతో ఆల్బమ్ గురించి డిస్కస్ చేస్తున్నారు.! ఒక్కనిమిషం.. లైన్లో ఉండమ్మా..! బాసూ సింధు అంట..! సింగరంట.! నిన్ను కలవాలంటోంది.!(ఈలోగా దేవదాసు సెల్‌కి ఫోన్ వస్తుంది. అతను అవతలికి వెళ్ళి మాట్లాడుతుంటాడు.)

రవి : (ఫోన్ తీసుకొని) ఇప్పుడు కుదరదు.! వారం తర్వాత ఫోన్ చెయ్యి..! నువ్వు పాడిన పాటలు ఏమైనా వుంటే వాట్సప్ చెయ్..! విన్నాక మాట్లాడతా..! (కట్ చేస్తాడు)

దేవ : అరె డేట్స్ నేను చూసి చెప్తానమ్మా..!

రవి : ఎవర్రా అది..!

దేవ : కస్తూర్బా అనాధాశ్రమం వారండీ.! మేడంగారి కచేరీ పెట్టించి వచ్చిన డబ్బు అనాధలకి ఫండ్....

రవి : ఇక్కడ డబ్బు తేరగా వుందా..! పాడేవాళ్ళకేమైనా తీరికుందా..! నాలుగేళ్ళదాకా డైరీలో ఖాళీలేదని చెప్పు..!

(మళ్ళీ రవీంద్ర ఫోన్ మోగుతుంది. ఫోన్ దేవదాసుకిచ్చి ఎవరో చూడమంటాడు.)

దేవ : హలో..! నేను దేవదాసుని..! బాసుగారి పిఎని..!అలాగేనమ్మా..! నేను చెప్తాను..! సార్ దగ్గర్లోలేరు..! ఫోన్‌కి దొరగ్గానే నేనే చెప్తాను.!

రవి : అసలీ సెల్‌ఫోన్ కనిపెట్టిన వాడ్ని కాల్చిపారెయ్యాలి.! అయిందానికీ కానిదానికి కాల్స్ చేసి విసిగిస్తున్నారు.! ఎవర్రా అది..?

దేవ : మన మేడంగారి నాన్నగారు చచ్చిపోయారట. పక్కింటి వాళ్ళు ఫోన్ చేశారు.! ఎక్కడున్నా ఎలా వున్నా వెంటనే మేడంగారిని తీసుకురమ్మనీ..!

రవి : ఈవిడ పోతే చచ్చిన దాని అబ్బ బతికొస్తాడా..? అది పోతే ఇక్కడ లక్షలరూపాయలు లాస్ వస్తుంది.!

దేవ : అది కాదు బాసూ..! కన్న తండ్రిని ఆఖరి చూపు చూసుకోకుండా చెయ్యటం కరెక్ట్ కాదు..!

రవి : రేయ్..! నువ్వు నా పిఎవి..! పిఎ లాగే వుండు..! పర్సనల్ మేటర్స్‌లో తలదూర్చకు..! దాని బాబు చచ్చిన సంగతి ప్రోగ్రామ్ అయ్యాక చెప్పచ్చులే..!

దేవ : చాలా అన్యాయం బాసూ..! తెలిస్తే ఫీలవుతుంది.!

రవి : మనం అన్యాయమైపోతాంరా..!

దేవ : తన కష్టార్జితం తింటున్నాం బాసూ..! ఈ ప్రోగ్రామ్ పోతే ఇంకో ప్రోగ్రామ్ బుక్‌చేస్తా..!

రవి : బుక్ చెయ్..! ఇంకో ప్రోగ్రామ్ కూడా..! బుక్ చెయ్..! నీకమీషన్ టెన్‌పర్సెంట్ పెంచుతా..!

దేవ : పైన దేవుడున్నాడు బాసూ..! మనం సేసే అన్ని పనులు చూస్తుం టాడు..! పురుగులబడి పోతాం బాసూ..!

రవి : మనం చేసే ఈ వృత్తికి పాపం అనేదే ఉండకూడదురా..! వెళ్ళి పనిచూసుకో..! (నవ్వుతూ..) వల్లీ..! రెడీనా..! బయల్దేరుదామా...!

## లైట్స్ఆఫ్

## 4వ సీన్

(వల్లి కొంచెం ఓల్డ్ గెటప్, రవి కూడా ఓల్డ్ గెటప్.. పాట ప్రాక్టీస్ చేస్తూ దగ్గుతుంటుంది. రవి అసహనంగా వుంటాడు...)

పంక: నారాయణతే నమో... నమో...!
భవ.. నారద సన్నుత నమో... నమో...! || నారాయణ ||

రవి : ఇలా పాడితే ప్రోగ్రాములు బుక్ అవ్వటం కాదు.. వచ్చిన ప్రోగ్రామ్స్ కూడా క్యాన్సిలైతాయి.!

పంక: రవీ..! ఈ ప్రోగ్రామ్ క్యాన్సిల్ చేయించేయ్..!

రవి : క్యాన్సిల్ చేయించాలా..? అలా క్యాన్సిల్ చేయటానికా... ప్రోగ్రా ములు పెట్టించేది.!

పంక: పాడలేక పోతున్నాను రవీ..! గొంతులో ఒకటే మంట..! దగ్గు వస్తోంది.! అప్పుడప్పుడూ నోట్లోంచి నెత్తురు పడుతోంది.!

రవి : వేడిచేసుంటుంది అంతే..! చూడు ఒక ప్రోగ్రామ్ పెట్టించాలంటే ఎంత కష్టపడాలో తెలుసా..? స్పాంసర్స్‌ని పట్టుకోవాలి..! వాళ్ళు రమ్మన్నప్పుడు రమ్మన్న చోటికి వెళ్ళి.. వాళ్ళు పిలిచిందాకా వెయిట్ చేయాలి.! వాళ్ళకి నీ గురించి గొప్పగా చెప్పి మెప్పించి ప్రోగ్రామ్ ఎరేంజ్ చెయ్యాలి..! క్యాన్సిల్ చేయాలంట..! మాటేగా అనేస్తావ్..!

పంక: అంత కష్టపడి ప్రోగ్రామ్స్ పెట్టించటం ఎందుకులే రవీ..! క్యాన్సిల్ చెయ్..! (దగ్గుతుంది...నోటి వెంట నెత్తురు పడుతుంది..)

రవి : (రవి ఆమెనోటి వెంట నెత్తురు పడటాన్ని గమనించడు...) మళ్ళీ అదేమాట..! ఏం ఆటలుగా వుందా..! ఐదు లక్షలరూపాయల కాంట్రాక్ట్.! ఒక్కరోజులో ఐదు లక్షలు..!

పంక: ఇప్పటి వరకూ నా ప్రోగ్రాముల మీద వచ్చిన లక్షలు చాలవా నీకు..! అంత సంపాదించినా ఈ పాతకొంపలోనే..! పెంట్‌హౌసన్నావ్.. అపార్ట్‌మెంటన్నావ్..

రవి : (ఆవేశంగా వచ్చి పంకజవల్లిని జుట్టుపట్టుకొని కొడతాడు...) ఏంటే లెక్కల డుగుతున్నావ్..! సంపాదించావ్‌లే ముష్టి మూడు కోట్లు..! నేను నీ మీద పెట్టిన పెట్టుబడికి అవి ఏమూలకూ చాలవు..! పంకజవల్లి...! నాకు పెళ్ళికాకముందు నువ్వెక్కడుండేదానివి..! గుళ్ళల్లో గోపురాల్లో భజనపాటలు పాడుకుంటూ

వుండేదానివి..! ఈరోజు... పంకజవల్లి ది గ్రేట్ సింగర్..! నీతో ఎన్ని మ్యూజిక్ ఆల్బమ్స్ చేయించానో గుర్తుందా..? సంగీత సామ్రాజ్య శ్రోతల ఆరాధ్య దేవతని చేశాను..! మర్చిపోయావా...?

పంక: లేదు..! నాకింకా గుర్తుంది..! అందుకే నువ్వేం చేసినా మౌనంగా భరిస్తున్నా..!

రవి : భరించటమంటే.! నేను నిన్ను రాచిరంపాన పెడుతున్నాను.! నీ శ్రమను దోచుకుంటున్నాను..! అంతేగా..!

పంక: అలాకాదు నేనంటుంది..!

రవి : హౌడేర్‌యూ డెవిల్..! (గొంతపట్టుకొని పిసుకుతూండగా సేతూరామ్ లోపలినుండి వస్తాడు) నాకే మాటకు మాట చెప్తావా..? చూడూ నీ గొంతులో ఊపిరి వున్నంత వరకూ నువ్వు ప్రోగ్రామ్ చేయాల్సిందే..! కాదూ కూడదంటే నీ ఊపిరి తీసైనా నీతో ప్రోగ్రామ్ చేయిస్తా..! (సేతూరామ్ బయటి నుండి హడావుడిగా వచ్చి రవి చేతుల్లోంచి ఆమెని విడిపిస్తూ రవిని పక్కకి లాగుతాడు..)

సేతు: రవీ..! ఏం చేస్తున్నావ్ నువ్వు..!

రవి : ఆ మాట అడగటానికి నువ్వెవర్రా..?

సేతు: నేనెవర్నో నీకు తెలీదూ...!

రవి : ఎవడివిరా నువ్వు..! నా పెళ్ళాం పాటలు పాడుతుంటే సన్నాయి వాయించేవాడివి.! నన్నూ నా పెళ్ళాన్ని కలిపిని బ్రోకర్ నాకొడుకువి..!

సేతు: రవీంద్రా..! హద్దు.. హద్దుమీరుతున్నావ్..!

రవి : మీరతానురా...! అరె నా పెళ్ళాన్ని నేను కంట్రోల్లో పెట్టుకుంటుంటే మధ్యలో నువ్వెవడివిరా..! పెద్ద మగాడిలా వచ్చావ్..!

సేతు: మగాడినేరా..! కళ్ళముందు ఒక ఆడదాన్ని నిస్సహాయురాలిని చేసి హింసిస్తుంటే అడ్డుకునేవాడు మగాడేరా.!

రవి : మగాడివా లేక ఇంకేమైనా కూడా అవుతావా..? అదే నా భార్యకి.!

సేతు: (రవిని లాగి ఒకటి కొడతాడు..) నీ నోట్లో వుంది నాలుకా... తాడిపట్టా..! ఈమె మహా పతివ్రత.! అలాంటమ్మాయిని అనుమానిస్తున్నావ్..! కొడుతున్నావ్..! నువ్వసలు మనిషివా పశువ్వా..!

పంక: రామ్..! ఇది భార్యాభర్తల విషయం. మధ్యలో తలదూర్చటం నీకు మంచిది కాదు..!

సేతు: అదికాదు వల్లీ..! ఇతను నిన్ను..!

పంక: ఇది మా సొంత విషయం అని చెప్పాను కదరాం..! ఆయన నన్ను కొట్టినా, తిట్టినా నాకిష్టమే.! మరెప్పుడూ మాజోలికి రాకు.!

సేతు: నిన్ను కొడుతుంటే నేనెలా చూస్తూ...

రవి : అంత ప్రేమ కారిపోతోందా..! నాకెప్పటినుంచే నీ వ్యవహారం మీద డౌటేరా..!

లేకపోతే ఆ వూరినుంచి ఈ ఊరు వరకూ కేవలం ప్రోగ్రాములకోసమే నా పక్కవాటాలోకి దిగావా..? నా పంకజవల్లి అడిగింది కదాని నేనేదో పెద్దమనసుతో సరేలెమ్మని ఇన్నాళ్ళూ సర్దుకు పోతూ వచ్చా..! కానీ, నా మంచితనం నాకాపురాన్నే కూల్చే స్థితికి వచ్చేసిందంటే..నో..నో.. వీల్లేదు..! నువ్వుమాతో వుంటానికి వీల్లేదు.! వల్లితో నువ్వన్నా వుండాలి.. లేదా నేనైనా వుండాలి.! ఒక పని చెయ్.! నన్ను చంపేసి మీ ఇద్దరూ సుఖంగా వుండండి..! చంపు చంపు సేతూరామ్ నన్ను చంపెయ్..! ఆనందంగా చచ్చిపోతా..!

పంక: నువ్వనుకునేలా మా మధ్య ఏమీ లేదు.!

రవి : నేనమ్మను..! అమ్మ అమ్మ..! నాకెప్పటినుండో అనుమానమే.! ఆ రోజు సేతూరామ్ ఈ ఇంట్లోకి దిగిన రోజు నువ్వు సేతూరామ్ పోర్షన్‌లోకి వెళ్ళావా లేదా..!

సేతు: నేను సామాన్లు సర్దుకుంటుంటే సాయం చెయ్యటానికి వచ్చింది..!

రవి : సామాన్లు సర్దటానికి సాయంగా వచ్చిందో.. లేక చిన్ననాటి స్నేహితుడివే కదాని సరసాలాడటానికే వచ్చిందో..!

సేతు: రేయ్..! పంకజవల్లినే అనుమానిస్తావా..! పంకజవల్లి నిప్పురా నిప్పు..!

రవి : ఆ౯! నిప్పే... ఆ నిప్పే నా కాపురాన్ని బడబానలమై చుట్టుముట్టింది..! ఆ బడబానలాగ్నికి మా కాపురాన్ని బలిచేసింది.! ఎన్నెన్ని ఊహించుకున్నాను వల్లీ..! నీతో జీవితం ఎంతో అందంగా వుంటుందని ఆశపడ్డాను.! కానీ నువ్వో..!

పంక: సేతూరామ్..! దయచేసి వెళ్ళు..! ఇక్కడ నుండి వెళ్ళిపో..! మాకు దూరంగా.. ఎక్కడికైనా వెళ్ళు..!

రవి : ఏరా..! తనే చెప్పిందిగా..! తన జీవితంలోంచి వెళ్ళిపొమ్మని..! ఇంకా ఇక్కడే వున్నావే..! వెళ్ళు..!

(సేతూరామ్ తల దించుకొని అక్కడి నుండి తన పోర్షన్ వైపు కదులుతాడు.)

పంక: ఇప్పుడు నీకు సంతోషమేగా రవీ..!

రవి : నీకు బాధగా వుందా..! అదే సేతూరామ్ వెళ్ళిపోతున్నందుకు..!

పంక: లేదు..! చెప్పలేని...! గుండె తట్టుకోలేని ఆనందంగా వుండి.. కళ్ళవెంట నీళ్ళు తన్నుకొస్తున్నాయ్..!

రవి : నీ బాధను నేనర్థం చేసుకోగలను వల్లీ..! ప్రపంచంలో నాలాంటి మంచోళ్ళని ముందు అందరూ తప్పుగానే అర్థం చేసుకుంటారు..! ప్రోగ్రామ్‌కి బయల్దేరు..! రెడీ అవ్వు..! (పంకజవల్లి లోపలికి వెళుతుంది. దేవదాసు పరిగెత్తుకుంటూ వస్తాడు...)

దేవ : బాసూ... బాసూ...! (అంటూ హడావుడిగా...) మన అనుమానం నిజమే అయింది..!

రవి : దేని గురించి.?

దేవ : మొన్న ప్రోగ్రామ్ చేసేప్పుడు.. మేడంగారి నోట్లోంచి బ్లడ్డు పడిందికదా..! అది

తీసుకెళ్లి చెక్ చేయించమన్నావ్‌గా.! కేన్సర్ అని తేలింది..! అడ్వాన్స్ స్టేజీలో వుందట.! ఇంకీమె పాడ్డానికి పనికిరాదంట.!

రవి : గోవిందా....! (తనలో) అంటే.. పాటకు పనికిరాని చిలకతో మనకిక పనిలేదన్నమాట.!

దేవ : బాసూ.. ఇప్పుడేంటి మన కర్తవ్యం..!

రవి : రేయ్..! దేవదాసూ..! అర్జంటుగా నువ్వు సింధుతో ప్రోగ్రామ్ పెట్టించు..!

దేవ : అప్పుడు పాడటానికొస్తే వద్దని పంపేశాంకదా..!

రవి : ఇప్పుడు మన దగ్గర పాడటానికి పిలువు.! పంకజవల్లికి ఇవ్వాల్సిన ఛాన్స్ తనకిచ్చానని చెప్పు.! ఎగిరి గంతేస్తుంది.! ఐదేళ్ళ కాంట్రాక్ట్.! అగ్రిమెంట్ బాండ్‌మీద సంతకం పెట్టించు..! ఈ ఆల్బమ్ సింధుతో చేయిస్తున్నాం.! స్పాన్సర్లకి నేను చెప్పుకుంటా.!

దేవ : నీ బుర్రే బుర్ర బాసూ...!

రవి : అలాగే..! ప్రోగ్రామ్ అయింతర్వాత సింధుని నాతో మీట్ చేయించు..! వెళ్ళు..! (దేవదాసు వెళ్ళబోతుండగా..) రేయ్..! దేవదాసూ...!

దేవ : బాసూ...!

రవి : ఇంకెప్పుడూ నువ్వీ ఇంటి ఛాయల్లోకి రాకు..! అర్ధంకాలేదా..! పయనించే ఓ చిలుకా...! ఎగిరిపో పాడయిపోయెను గూడూ...! అలాగే నాపేరుమీద కొత్త సిమ్ తీసుకో..! వెళ్ళు..!

పంక: (రెడీ అయ్యి బయటికి వస్తుంది...) ప్రోగ్రామ్ చెయ్యక తప్పదా.! (దగ్గుతూ వస్తుంది.. నోటి వెంట నెత్తురు పడుతుంది.)

రవి : అరెరె..! ఏంటి వల్లీ..! నోట్లోంచి ఈ నెత్తురు..! నువ్వు ఇంత ఇబ్బంది పడుతున్నావని నాకు తెలీదు..! లేకపోతే నేను నిన్నంత ఫోర్స్ చేసేవాడిని కాను..! ఓ.కే. టేక్ రెస్ట్..!

పంక: మరీరోజు ప్రోగ్రామ్..!

రవి : నేను..! నేను పాడతాను..! సరేనా.! నీ ఆరోగ్యం జాగ్రత్త..! ఇందాకేదో చికాకు, టెన్షన్‌లో నీతో రూడ్‌గా బిహేవ్ చేశాను.! నన్ను క్షమించు.! (సేతూరామ్ తన వస్తువులు తీసుకొని వెళుతూండగా...) సేతూరామ్.! నువ్వు ఎక్కడికీ వెళ్ళద్దు..!

సేతు: లేదు రవీ..! ఇంత గొడవ జరిగాకకూడా నేను మీమధ్య వుంటే..!

రవి : అరే రామ్.! నేను నిన్నొకమాట అనకూడదా..! నువ్వు నన్నొక దెబ్బ వెయ్యకూడదా..! ఆమాత్రం చనువు మనిద్దరి మధ్యాలేదా..!

సేతు: అదికాదు..! నేను వెళ్దామనే నిర్ణయించుకున్నాను..!

రవి : ఇందాక నేను అన్నమాటలు మీ ఇద్దరినే కాదు.. తలుచుకుంటుంటే నాకూ బాధగానే వుంది..! అందుకే మీ ఇద్దరూ నన్ను పెద్ద మనసుతో క్షమించండి..! (కాళ్ళు

పట్టుకొంటాడు.. ముసలి కన్నీరు కారుస్తాడు.)

పంక: అయ్యయ్యో.! మనిద్దరం భార్యాభర్తలమండీ..!

సేతు: మనలో మనకి క్షమాపణలా..!

రవి : లేదు సేతూరామ్..! నువ్వు ఇక్కడ వుంటాననేదాకా నేను నీ కాళ్ళు వదలను.! వుంటానని చెప్పు..! (సేతూరామ్ వల్లి వైపు చూస్తాడు. వల్లి సరే అనమన్నట్లు తలూపుతుంది.)

సేతు: సరే..! ఎక్కడికీ వెళ్ళను..! ఇక్కడే వుంటాను..! మీతోనే వుంటాను.. సరేనా..!

రవి : హమ్మయ్య..! ఇప్పుడు నా మనసు ప్రశాంతంగా వుంది.! చూడు సేతూరామ్..! మీకు ఇంకో విషయం కూడా చెప్పాలి..! వల్లీ నీక్కూడా..! (వల్లి చెయ్యి సేతూరామ్ చేతిలో వుంచబోతాడు.. ఇద్దరూ వెనక్కి లాక్కోబోతారు.. రవి వారిద్దరినీ వారిస్తూ.... ఆమె చెయ్యి సేతూరామ్ చేతిలో పెట్టి...) నేను చాలా అర్జంట్ పనిమీద ఫారిన్ వెళుతున్నాను..! రావటానికి టైం పడుతుంది..! నా భార్యని నీచేతిలో పెడుతున్నాను.! (వల్లి, సేతూరామ్‌లు షాకవుతారు.) అదే..! నా భార్య ఆరోగ్యం అసలు బాగోలేదు..! చిన్ననాటి స్నేహితుడైన నువ్వే ఎప్పటికప్పుడు అబ్జర్వ్ చేస్తూ గైడెన్స్ ఇవ్వాలి.! అవసరమైతే మెడికేషన్ చేయించు.! ఇలాంటి సమయంలో నిన్ను ఒక్కదాన్ని వదిలేసి వెళ్ళటమే నాకు కొంచెం బాధగా వుంది.!

పంక: నాకేం కాదురవీ.! నువ్వు క్షేమంగా వెళ్ళి లాభంగా తిరిగిరా..!

రవి : నువ్వు నాకు ఎదురొచ్చినప్పుడల్లా నా పనులన్నీ సక్సెస్ అయ్యాయి..! ఇప్పుడూ ఎదురొస్తావా...! (పంకజవల్లి దగ్గుతూ.. నోట్లోంచి నెత్తురు పడుతుండగా పైటతో నెత్తురు తుడుచుకుంటూ...నవ్వుతూ ఎదురొస్తుంది. రవి ఆమెకి వీడ్కోలు చెబుతూ వెళ్ళిపోతాడు.)

## లైట్స్ ఆఫ్

## 5వ సీన్

( స్పాట్‌లైట్ ఆన్. స్పాట్‌లో రవి, దేవదాస్ వుంటారు.)

దేవ : పంకజవల్లి ఆరోగ్యం రోజు రోజుకూ క్షీణిస్తోంది బాసూ..! తను నిన్ను చూడాలంటోంది..!

రవి : నిన్నా ఇంటి వైపు వెళ్ళద్దని చెప్పాను కదా..! మళ్ళీ ఎందుకు వెళ్ళావ్..!

దేవ : సేతూరామ్ జగదంబా సెంటర్‌లో కనిపించి చెప్పాడు.! ఇంటి కెళ్ళాను.. అక్కడ అత్యంత దీనస్థితిలో పంకజవల్లి కనబడిరది.! బాసూ ఒక్కసారి ఒకే ఒక్కసారి ఆమెకి కనిపించి...

రవి : రేయ్ ..! దేవదాసూ..! నాకు కావాల్సింది డబ్బు..! అది సంపాదించని ఎవ్వరైనా నాకు అనవసరం..! చివరికి నువ్వైనా..! పంకజవల్లితో నాకెలాంటి అవసరమూలేదు..!

దేవ : బాసూ..! నా కళ్ళు తెరిపించావ్..! రేయ్..! అమ్మాయిలమీద ఆధారపడి బ్రతికే ఒక వెధవ దగ్గర పనిచేస్తూ జీతం తీసుకున్నానని అనుకున్నానే కానీ, మానవత్వం

ఏమూలా లేని ఒక దౌర్భాగ్యుడి దగ్గర ఇన్నాళ్ళూ పనిచేస్తున్నానని నాకళ్ళు ఇప్పుడే తెరిపించావ్..!

రవి : రేయ్...! దేవదాసూ..!

దేవ : నోర్ముయ్..! నోర్ముయ్‌రా కుక్క..!

రవి : రేయ్..!

దేవ : తంతా నాకొడక ఇంకో మాట మాట్లాడావంటే..! కుక్కలు కూడా బాధపడతాయ్‌రా నిన్నాపేరుతో పిలిస్తే..! వాటికి విశ్వాసముంది.. మరినీకో..! డబ్బు.. డబ్బు.. డబ్బు.! ఏం చేసుకుంటావ్‌రా డబ్బుతో.. నువ్వు చచ్చాక నిన్ను తగలబెట్టటానికి తప్ప ఇంకెందుకన్నా పని కొస్తుందిరా డబ్బు..! ఇన్నేళ్ళనుంచి సంపాదించావ్..! ఒక పెళ్ళాం వుందా...పిల్లలున్నారా..! అనుభవించటానికి..! డబ్బు.. డబ్బు.. డబ్బు..! ఎప్పటికప్పుడు నేను చేసే వృత్తి మీద నాకే అసహ్యమేసేది..! పొట్టకూటికోసమే కదాని సర్దిచెప్పుకున్నా..!

రవి : రేయ్.. దాసూ..! ఎవరితో మాట్లాడుతున్నావో అర్థమౌతోందా..!

దేవ : పక్కోడి కష్టంమీద పడి బతికే బేవార్సోడితో మాట్లాడుతున్నా..!

రవి : నీకిచ్చిన డబ్బులు కూడా వాళ్ళు పడ్డ కష్టంనుంచి వచ్చినవే..! నేనే కాదు నువ్వు కూడా బేవార్సోడివే...!

దేవ : నీకూ నాకూ ఓ తేడా వుందిరా.! నేను కష్టపడి ప్రోగ్రాములు బుక్ చేసి కమీషన్ మాత్రమే తీసుకున్నా..! మరి నువ్వో ఆడోళ్ళ కష్టంతో, మాలాంటోళ్ళ కష్టంతో దర్జాగా బతుకుతున్నావ్.! పాడి వున్నంతకాలం వాడుకొని ఎండిపోగానే పశువుల్ని కబేళాకు తరలించే యదవలకీ, నీకూ పెద్ద తేడా లేదురా.!

రవి : రేయ్..! నిన్నీ క్షణానే డిస్మిస్ చేస్తున్నా పోరా..!

దేవ : నువ్వు డిస్మిస్ చేసేదేంటిరా..! నేనే నీదగ్గర ఉద్యోగం మానేత్తన్నా.! ఇట్టాంటి ఉద్యోగం చేసేకన్నా ఏ రోడ్డుపక్కనో, గుడిముందరో అడుక్కోటంనయం.! (అంటూ సంచీ తీసి రవి ముఖాన కొడతాడు.)

(స్పాట్‌లైట్ ఆఫ్ జనరల్ లైట్స్ ఆన్ అయ్యేసరికి రవి వున్న ప్లేసులో సేతూరామ్ వుంటాడు. పంకజవల్లి తలుపు దగ్గరకొచ్చి వుంటుంది. సేతూరామ్, దేవదాసులు ఇద్దరూ ఆమెని గమనించరు.)

దేవ : ఎంతో చెప్పి చూశానయ్యా..! కానీ డబ్బుపిచ్చిపట్టిన ఆ దగుల్బాచికి మనుషుల విలువేం అర్థమౌతుంది.! దేవుడు కూడా దుర్మార్గుడేనయ్యా..! అందుకే బంగారంలాంటి పంకజవల్లి జీవితం అట్టాంటోడి చేతుల్లో పెట్టి బుగ్గిపాలు సేసాడు..!

సేతు: ఎక్కడున్నాడో చెప్పు..! నేనెళ్ళి అతన్ని బ్రతిమాలతాను.! కాళ్ళు పట్టుకుంటాను.!

దేవ : ఆడు మీకు దొరకడయ్యా..! నాకూ దొరకడు..! ఆడున్న చోటు నాకు తెలుసిన

మరుక్షణమే మరోచోటుకి మారిపోతాడు.! నేనూ ఆడికి యతిరేకమయ్యాను కదా..!

సేతు: మరి వల్లికేం చెప్పను.!

దేవ : పోయే ప్రాణానికి కాసింత ఊరటకోసం వాడు వస్తాడన్న అబద్ధాన్ని కొనసాగియ్యటమే..! అయ్యా..! ఈ డబ్బు... వాడిచ్చింది కాదయ్యా..! పాపిష్టిదే అనుకోండి..! కానీ.! నా కష్టార్జితం..! తెలిసో.. తెలవకో.. ఆయమ్మికి నేను సేసిన ద్రోహానికి ఇట్టాగైనా నన్ను క్షమాపణ చెప్పుకోనీండి..!

సేతు: వద్దు దేవదాసూ.. రవి వెళుతూ తన బాధ్యతని నాకు అప్పగించాడు..! నేనే తననీ..

దేవ : ఎలా... ఎలా చూస్తావయ్యా..! నువ్వేమైనా పెద్ద ఆస్థిపరుడివా..! ఊళ్ళో వున్నది ఒకే ఒక్క చిన్న ఇల్లు. ఆ ఇల్లు అమ్మిన డబ్బుతో ఆమెకి వైద్యం చేయిస్తున్నావ్..! ఎన్నాళ్ళిలా..!

సేతు: ఎన్నేళ్ళయినా..! ఎన్నాళ్ళయినా..!

దేవ : ఆమెకి నేను చేసిన ద్రోహానికి ప్రాయశ్చిత్తం చేసుకునే అవకాశమే లేదా..!

పంక: (లోపలనుండి బయటికి వస్తుంది.) దేవదాసూ..! ఏరీయన..!

దేవ : వస్తాడమ్మా..! వస్తానన్నాడు..! కొంచెం పనులవత్తిడిలో వుండి....

పంక: ఈ డబ్బు పంపించారా..?

దేవ : అవునమ్మా..! అవును.. ఇంద తీసుకోండి..

పంక: ఆ డబ్బు ఆయన దగ్గరే వుంచమని చెప్పు.! బయట తిరిగే మనిషికి ఖర్చులెక్కువ వుంటాయి. రవీంద్రకైతే మరీ ఎక్కువుంటాయి.! తీసుకెళ్ళి ఆయనకే ఇవ్వు..! (దగ్గు మరీ ఎక్కువవుతుంది. దేవదాసు, సేతూరామ్ ఇద్దరూ కంగారు పడతారు.)

దేవ : కనీసం మీ మందులకైనా వుంచచ్చుకదా..!

పంక: అవసరంలేదు..! అన్నట్లు దేవదాసూ..! నాకు కేన్సరు వ్యాధి అన్న విషయం రవికి తెలీనీకు.. తెలిస్తే తన పనులు మానుకొని వల్లీ.. వల్లీ.. అంటూ వచ్చి వలవలా ఏడ్చేస్తాడు..! (మరింతగా దగ్గుతూ ముందుకు పడిపోతుండగా సేతూరామ్ పట్టుకుంటాడు.. )

సేతు: వల్లీ..! ఇప్పటికైనా ఆపరేషన్‌కి ఒప్పుకో..! నిన్ను దక్కించుకునే అవకాశం ఇవ్వు..!

పంక: రామ్..! ఆపరేషన్ చేయిస్తే నేనిక పాడలేను కదూ..!

సేతు: వల్లీ...!

పంక: పాడలేని ఈ పంకజవల్లి బ్రతికి ఏం ఉపయోగం రామ్..!

దేవ : అది కాదమ్మా...!

పంక: దేవదాసూ...! నాకో చిన్న సాయం చేస్తావా..?

దేవ : చెప్పండమ్మా...!

పంక: నేను చనిపోయేదాకా రవిని ఈ ఇంటి ఛాయల్లోకి కూడా రానీయద్దు.! నన్నిలా

చూస్తే తట్టుకోలేడు..!

దేవ : అమ్మా...!

పంక: రామ్..! నాకు నువ్వో ఓ సాయం చేస్తావా..? (అడగమన్నట్లుగా తలూపుతాడు.)నా గొంతులో మాట వున్నంతకాలం పాటపాడా ల్సిందే..! నా పాటకి నువ్వు నాదస్వర నాదం జతచేయాల్సిందే..!

సేతు: ఈ సమయంలో... ఇలాంటి కోరికలు అవసరమా వల్లీ...!

పంక: అవసరమే రామ్..! ఇప్పుడు సంగీతభారతికి నాదనీరాజనం చేయకపోతే మరెప్పటికీ చేయలేనేమో...! స్నేహితుడివని అర్థిస్తున్నా..! సాయం చెయ్యవా..!
(సేతూరామ్ తలూపి కళ్ళు తుడుచుకుంటూ లోనికి వెళ్ళి నాదస్వరం తీసుకు వస్తాడు. ఈలోగా దేవదాసు మంచం వేసి ఆమెని కూర్చోబెడతాడు. సేతూరామ్ నాదస్వరంతో వస్తాడు..)

పంక: జగమేలే పరమాత్మ ఎవరితో మొరలిడుగు...
వగ జూపకు తాళను నన్నేలుకోరా త్యాగరాజ నుత నీ
నగుమోమూ కన లేని నాజాలి తెలిపి
నన్ను బ్రోవరాదా శ్రీరఘువర నీ || నగు||
(సేతూరామ్ ఆమెని మంచం మీద పడుకోబెట్టాడు.)
( పంకజవల్లి దగ్గుతూ నెత్తురు కక్కుతుండగా సేతూరామ్ తన దోసిలి పట్టాడు. దేవదాసు పరుగున లోపలికెళ్ళి ఒక పాత్ర తీసుకొస్తాడు. దేవదాసు నీళ్ళు పోస్తాడు. స్పాట్ లైట్ ఆన్ సేతూరామ్ కడుక్కొని తన పైగుడ్డతో ఆమె మూతి తుడుస్తాడు. ఆమెని పడుకోబెడతాడు. స్పాట్ ఆఫ్. జనరల్ లైట్లు ఆన్ అయ్యేసరికి డాక్టర్ వుంటాడు. సేతూరామ్ మంచం దగ్గర నుంచి లేస్తూ..!)

సేతు: అలా..! ఆరోజు నుంచి ఈ రోజు వరకూ నేనే ఆమెకి అన్నీ అయ్యాను..! ఇదంతా చేస్తున్నాను.!

డాక్ట : రియల్లీ..! యు ఆర్ గ్రేట్ సార్..! ఇంతకి మీరు ఆమెని ప్రేమించిన విషయం ఆమెకి ఏరోజైనా చెప్పారా..?

సేతు: ఏం చెప్పటానికీ నా దగ్గర మాటలులేవు.! మనసంతా ఆమె మీద నేను పెంచుకున్న ప్రేమతప్ప..!

డాక్ట : చెప్పి వుండాల్సింది..!

సేతు: అప్పుడు నాలో లేని స్వార్థం బయటపడుతుందేమో అని..!

డాక్ట : అంటే...?

సేతు: తనను నేను ప్రేమిస్తున్నాను కాబట్టి ఇదంతా చేస్తున్నానని తను అనుకోవచ్చు..! ఇన్నాళ్ళూ నేను తనమీద కోరికతోనే తన పక్క ఇంటిలో వుంటున్నానని అనుకోవచ్చు.!

డాక్ట : మీకు తనతో చెప్పాలని వుందా లేదా..? అయితే చెప్పేయండి..! తనకు ఇవి ఆఖరి క్షణాలు..! మీ మనసులో మాట ఇప్పుడు చెప్పకపోతే మరెప్పటికీ చెప్పలేరు.

**చెప్పండి..!**

**సేతు:** (ఆమె చెవిదగ్గర తన నోరు పెడతాడు ) **పంకజవల్లీ...! నా మాట నీకు వినబడుతోందా..! ఎన్నాళ్ళ నుంచో నీకు చెప్పాలనుకున్న నా గుండెలోతుల్లోని మాట నీకు ఈ క్షణాన చెప్పాలనుకుంటున్నా...!** ( పంకజవల్లి ఊపిరి అతి కష్టంమీద తీసుకుంటూండగా) **డాక్టర్ డాక్టర్...! నా పంకజవల్లి...!** (ఊపిరి అతి కష్టంగా తీసుకుంటోంది. డాక్టర్ ఆమె దగ్గరకి పరుగున వస్తాడు.) **వల్లీ.. నీకేం కాదు.. నీకేం కాదు..! డాక్టర్... డాక్టర్ తనని బ్రతికించండి...!**

**డాక్ట :** (ఆమె శ్వాస ఆగిపోయింది.) **ఐ యాం సారీ...! షీ ఈజ్ నో మోర్..!** (సేతూరామ్ ఆ మాట వింటూనే పంకజ వల్లి పై పడి ప్రాణాలు వదిలేస్తాడు.) **సేతూరామ్‌గారూ... సేతూరామ్‌గారూ...! ఓ మై గాడ్..! నిజమైన ప్రేమని ఇప్పుడు చూస్తున్నాను..! ప్రేమపేరుతో బలవన్మరణాలకు పాల్పడిన వారిని చూశాను. ప్రేమ విఫలమై తాగుబోతులైన వారిని చూశాను.! ప్రియురాలి ప్రేమ దక్కక దాడులు చేసిన వాళ్ళని చూశాను. కానీ ప్రేమ విఫలమైనా ఆ ప్రియురాలికోసమే తన జీవితాన్నే త్యాగం చేసిన నిన్ను చూస్తున్నా సేతూరామ్..! ప్రేమికులకు మరణం వుండచ్చేమో కానీ.. ప్రేమకు మరణం లేదు.! ప్రేమశాశ్వతం.!**

**శుభం**

# ఉత్తిష భారతి

(సాంఘిక నాటిక)

దర్శకత్వం : నాగిరెడ్డి పులగం

**పాత్రలు - పాత్రధారులు**

| | |
|---|---|
| 1. దశరథరాం | కె.పి.రెడ్డి |
| 2. భరద్వాజ | హనుమంతరావు, సూరారెడ్డి |
| 3.శ్రీను | పి.శంకర్ రెడ్డి |
| 4.భద్రన్న | పి.నాగిరెడ్డి |
| 5.మాలతి | జి.లహరి, నాగరాణి |
| 6.మ్యూజిక్ | రమణ, సాంబశివరావు |
| 7.సెట్ అండ్ లైటింగ్ | శ్రీనివాసరెడ్డి |

## నాటిక రచన వెనుక

ఈ నాటికను నేను రాయటం వెనుక ఒక బలమైన కారణం వుంది. నేను అప్పట్లో వార్త తెలుగు దినపత్రికలో పనిచేస్తున్నాను. ఆ సమ యంలో జర్నలిస్టుల జీవితాలను చాలా దగ్గరగా గమనించటం జరిగింది. జర్నలిస్టు నిజమైన హీరో అని నా ఉద్దేశం. కరెక్ట్ గా పనిచేస్తే అతను తీసుకునే రిస్క్ సామాన్యమైనది కాదు. ఎక్కడెక్కడ వార్తలకోసం అతను పడే కష్టం వర్ణనాతీతం. ఇలా అనుకుంటూ కథని తయారు చేశాను. అదే సమయంలో కరీంనగర్ కి చెందిన నటుడు మంచాల రమేష్ తో నా పరిచయం చాలా నాటకీయ పరిణామాలతో జరిగింది. అతని ప్రోద్భలంతో నేను ఈ నాటికను ముందుగా "పెన్ కౌంటర్ "అనే పేరుతో రాయటం జరిగింది. అయితే కొన్ని కారణాలవల్ల ఈ నాటిక కేవలం ఒకే ప్రదర్శనతో ఆగిపోయింది. కొంతకాలానికి "గమనం" నాటిక రిహార్సిల్స్ చేస్తున్న సమయంలో ఈ నాటిక దర్శకుడు నాగిరెడ్డి నా దగ్గరికి వచ్చి నాటిక కావాలని అడగటం.. ఒక్క ప్రదర్శనతోనే ఆగిపోయిన "పెన్ కౌంటర్" నాటిక గురించి వారికి చెప్పటం.. వారు కూడా అందుకు సుముఖత వ్యక్తం చేయటం.. పేరు మార్చి గమనం నాటిక రచనద్వారా నేను నేర్చుకున్న అనుభవంతో కొన్ని కొన్ని సన్నివేశాలు, సంభాషణలూ మార్చి "ఉత్తిష్ఠభారతి" పేరుతో తిరిగి ప్రదర్శించటం జరిగింది. ఈ నాటిక అనేక ప్రదర్శనలు పడ్డాయి. ఎన్నో విమర్శలతోపాటు మరెన్నో బహుమతులు గెలుచుకున్నాయి.

# ఉత్తిష్ఠ భారతి

## కథాసంగ్రహం

దశరథ్ తండ్రి భరద్వాజ మిలటరీలో మేజర్ గా పనిచేసి రిటైర్ అయిన వ్యక్తి. దేశంకోసం ఇద్దరి కొడుకులనీ ఆదర్శంగా పెంచి పెద్దకొడుకుని మిలటరీకి రెండో కొడుకుని జర్నలిస్టుగా తయారు చేశాడు. దశరథ్ నిజాయితీ పరుడైన ఇన్వెస్టిగేటివ్ జర్నలిస్ట్ గా సమాజంలో కొనసాగుతుంటాడు. అతను మెడికల్ డ్రగ్ మాఫియాకు సంబంధించిన వార్తని ఆధారాలతో సేకరిస్తాడు. రాజకీయ పలుకుబడి వున్న భద్రన్న అనే ఒక వైట్ కాలర్ పెట్టుబడి దారునికి సంబంధించిన ఫార్మాకంపెనీలో అక్రమంగా ప్రయోగాల పేరిట జరుగుతున్న విషయాన్ని వార్తాకధనంగా తయారు చేస్తాడు. ఇది తెలుసుకున్న భద్రన్న తన అనుచరుడైన శ్రీనుద్వారా దశరథ్ ఇంటిమీద పడి గొడవ చేయిస్తాడు. అతని భార్యని బెదరిస్తాడు. దశరథ్ కూతురైన జ్యోతిని తన తాత భరద్వాజతో ఎంసెట్ రిజల్ట్ కోసం నెట్ సెంటర్ కి వెళ్ళినప్పుడు కిడ్నాప్ చేయిస్తాడు. ఈనేపథ్యంలో జర్నలిజంలోని లోపాలు, జర్నలిస్టు కుటుంబాలు ఎదుర్కొనే బాధలూ, కుటుంబ సమస్యలూ ఇత్యాది నాటకీయ పరిణామాల నడుమ నాటిక సాగుతుంది.

వార్త ప్రచురితం అవ్వనీకుండా భద్రన్న ఎలాంటి నిర్ణయాలు తీసుకున్నాడు.. పెన్నుపట్టుకున్న వీరుడిగా దశరథ్ భద్రన్నని, శ్రీనుని ఎలా ఎదుర్కొన్నాడు. చివరికి దశరథ్ ఎలాంటి నిర్ణయం తీసుకున్నాడో నాటకి చదివి తెలుసు కుంటారని ఆకాంక్షిస్తున్నాను.

# ఉత్తిష భారతి

(స్పాట్‌లైట్ భరతమాత ఫోటోమీద కేంద్రీకృతమై ఉంటుంది. బ్యాక్‌గ్రౌండ్‌లో వందేమాతరం గీతం మొదలౌతుంది. దశరథ్ మీద స్పాట్‌లైట్ చాలా డిమ్‌గా వెలుగుతుంటుంది. అతను ఏదో రాసుకుంటుంటాడు. ఆ గీతం మంద్రస్థాయిలో వినిపిస్తుండగా వెనుకనుంచి)

**ప్లేబ్యాక్:**

**వందే వందే సదాస్వదేశ మాతరం... వందేమాతరం... మనదే రాజ్యం.! ఇది ఆనాటి భారత ప్రజల జిహ్వాగ్రాన తాండవించిన మహాప్రణవమంత్రం. తెల్లదొరల గుత్తాధిపత్యంలో నిరంకుశ విధా నాల చట్రంలో కూరుకుపోయి కుదేలౌతున్న యావత్ భరతజాతిని ఉత్తిష్టపరచిన రణన్నినాదం...! ఫలితంగా 1947 ఆగష్ఠ 15న యావత్ భారతావని స్వతంత్ర సంబరాలు జరుపుకుంది.! అందరికీ అన్నీ లభించేసినట్లే అని ప్రతి ఒక్కరూ ఆశతో... ఆనందంతో... స్వతంత్ర ఫలాలు ఆరగిస్తామనే అనుకున్నారు. కానీ, అవి సామా న్యునికెప్పుడూ అందనంత దూరంలోనే ఉన్నాయన్న విషయాన్ని ఎవ్వరూ గమనించలేక పోయారు.! బ్రతకటానికి అవసరమైన రోటీ, కపడా, మకాన్ ఆశయాలకే పరిమితమై, ఆచరణలో శూన్యమైతే... మారని తమ తలరాతలను మార్చేవాడు లేడని నమ్మిన ప్రజలు నిత్యం బ్రతుకు పోరు సాగిస్తున్నారు. మేధావులెందరో తమ మేధస్సు ని మధించి, లిఖించిన రాజ్యాంగపు హక్కుల్ని మరచిపోయి, బాధ్యతల్ని విస్మరించి, అనవసరపు ఆందోళనలతో అడుగడుగునా దగాపడుతూ దోపిడీకి గురవుతునే ఉన్నారు.** (అమర వీరులకు జోహార్లు అర్పించే విధంగా పిగిలీ వినిపిస్తుంది. భరద్వాజ తన గదిలోంచి పూలమాల చేతిలోకి తీసుకొని వేదికపైకి వస్తాడు. తన పెద్దకొడుకు ఫోటోకు దండవేస్తాడు..) **ఇలాంటి వాళ్ళని ఆదుకోటానికే అప్పుడప్పుడు సమాజంలోంచి సంస్కర్తలు పుట్టుకొస్తుంటారు.** (భరద్వాజ మీద స్పాట్‌లైట్ ఆగి పోతుంది. భరతమాత మీద స్పాట్‌లైట్ ఆగిపోతుంది. దశరథ్ మీద మాత్రం వెలుగుతునే వుంటుంది. ల్యాప్‌టాప్‌లో దశరథ్ వర్క్ చేస్తుంటాడు. మెల్లిగా లైట్లన్నీ వెలుగుతాయి.)

(దశరథ్ సిస్టమ్ ఆపరేటింగ్ చేస్తుంటాడు. లాప్‌టాప్ నుండి ఇయర్‌ఫోన్స్ డిస్కనెక్ట్ చేస్తాడు. సిస్టమ్ నుంచి మెమొరీ కార్డ్ తీసి టేబుల్ మీద పెట్టిన అలారం క్లాక్ ఓపెన్ చేసి అందులో దాన్నిదాస్తుంటాడు. ఇంతలో మాలతి బయటనుండి వస్తుంది.)

**మాల:** **ఇంకా ప్రెస్‌కి వెళ్ళలేదా..! ఏదో అర్జంట్ పనుంది.. త్వరగా బయటికెళ్ళాలన్నారు.?** (ఆమె అడిగిన ప్రశ్నకు దశరథ్ ఒక్కసారిగా ఉలికిపడతాడు. తనను తాను తమాయించుకొని తిరిగి తన పనిలో తానుంటాడు. మాలతి దగ్గరికొస్తుంది.) **మీకో విషయం తెలుసా.? మన పక్కింటి సరోజ లేదండీ, వరలక్ష్మీవ్రతం నోచిందట వాళ్ళాయనకు ప్రమోషనొచ్చేసిందట. ఇంకో విషయం తెలుసామీకు మన లైన్ చివరుంటుందే వనజ అది కూడా వరలక్ష్మి వ్రతమే చేసిందటండీ అంతే వాళ్ళాయనకి లాటరీలో**

పదిలక్షలు తగిలాయట, ఏమండీ... ఏమండీ.. మనం కూడా వరలక్ష్మి వ్రతం చేద్దామండీ.! అమ్మవారు కరుణిస్తే మనం కూడా ఓలాటరీ కొని, ఆ ఒక్క లాటరీ మనకే వచ్చి ఓ కోటిరూపాయలు, కాదు పదికోట్లు, వందకోట్లు మనకొస్తే...ఈ అద్దె కొంపనుండి హాయిగా సొంతింట్లోకి మారిపోవచ్చు. దర్జాగా కాలుమీద కాలేసుకొని కూర్చోవచ్చు. ఏంటండీ నాదారిన నేను మాట్లాడుతుంటే మీరేంటి మాట్లాడరు.

దశ : మనిషి ఆశాజీవి. అతని ఆశకు అంతం లేదు.

మాల: నాగురించేగా..! అయినా ఊరికే వస్తున్న సొమ్ముని ఎవరైనా కాదనుకుంటారా చెప్పండి.

దశ : ఒకళ్ళకి ఆ సొమ్ము ఊరికే వస్తోందంటే దాని వెనక ఎంతమంది ఆ సొమ్ముని పోగొట్టుకొని బాధపడు తుంటారో ఆలోచించాలి మాలతి. తక్కువ కాలంలో ఎక్కువ డబ్బు వస్తుందంటూ తమ ప్రాణాలను ఫణంగా పెట్టి రకరకాల మెడికల్ టెస్టులు చేయిం చుకొని అంగవైకల్యం పొందుతున్నారు. జీవితాంతం వాళ్ళలా బ్రతకాల్సిందే.

మాల: ఏం జరిగిందండీ..! ఏం మాట్లాడుతున్నారు మీరు.! నేనేమన్నాను.. మీరేమంటున్నారు.. నేనేదో కాసేపు సరదాకలా మాట్లాడితే...!

దశ : సరదా..! ఇప్పటి మన సరదా మాటలే కొందరి జీవితాల్లో నిజాలై కనిపిస్తున్నాయి మాలతీ.! మంది ఏడుపు కొంతమందికి సంతోషం. ఏ కొంతమంది సంతోషానికో ఎన్నో జీవితాల బలిదానం.

మాల: ఈరోజెందుకండీ ఇలా వున్నారు.

దశ : ఏంలేదు. నేనలా బయటికి వెళుతున్నాను. దీన్నిలోపలపెట్టు. (లేప్‌టాప్ చూపించి బయటికెళ్ళబోతుంటాడు.ఇంతలో డోర్ చప్పుడవుతుంది. దశరథ టెన్షన్ పడతాడు.) ఆగు. ఎవరో వచ్చారు. (చెమట తుడుచుకుంటుంటాడు)

మాల: మీకెందుకండీ అంత భయం.

దశ : అవన్నీ తర్వాత. చూడు నాగురించి అడిగితే నేను లేనని చెప్పి పంపించెయ్.! లోపలికి కూడా రానీకు. (మాలతి తలుపు తీద్దామని వెళుతుంది. తలుపు చప్పుడు మాత్రం ఆగదు. దశరథ ల్యాప్టాప్ తీసుకొని లోపలికి వెల్తాడు. మాలతి తలుపు తీసేలోపు తెరలోంచి ''అమ్మా పాలు''. అంటూ పాలవాడు అరుస్తాడు.)

మాల: ఏంటి యాద్గిరి ఈరోజు ఇంతలేటు చేశావ్.

ఓ.బీ : ఒకిల్లయితే అనుకోవచ్చండీ.. అన్నిళ్ళకీ నేనొక్కణ్ణే కదమ్మా.! సార్ లేరామ్మా.!(దశరథ టెన్షన్ పడతాడు. మాలతి ఏం చెబుతుందో అని)

మాల: ఊరెళ్ళారు.

ఓ.బీ : పాతబాకీ ఏమైనా ఇత్తారేమో అని. ఇంట్లో కూడా కష్టంగానే వుందమ్మా.!

మాల: నేను మాట్లాడతాలే.! (తలుపు మూస్తుంది. దశరథ్ బయటికొస్తాడు. టెన్షన్ గా వున్న భర్త చూసి మాలతి ఆశ్చర్యపోతుంది.) మీరెందుకు భయపడు తున్నారు. తప్పేమైనా.!

దశ : లేదు.

మాల: మరెందుకా చెమటలు. నిజం చెప్పండి.! నాదగ్గర మీరేమైనా దాస్తున్నారా.!

దశ : అలాంటిదేం లేదు.

మాల: నాతోకూడా చెప్పకూడదా.!

దశ : చెప్తాను మాలతీ...! భార్యకన్నా భర్తకి మరో స్నేహితుడుండంటారు. నేనిప్పుడు చాలా ప్రమాదకరమైన పరిస్థితిలో వున్నాను. ఏక్షణానైనా మృత్యువు నన్ను తీసుకెళ్ళచ్చు.

మాల: యావండీ..!

దశ : అవును మాలతీ.! అన్యాయంగా అంగవైకల్యం పొందుతున్న అనేకమంది బాధితుల వైకల్యానికి కారణాల్ని టార్గెట్ చేసి న్యూస్ ఐటమ్ ప్రిపేర్ చేశాను. అది ఈరోజు నైట్ ప్రింట్ అవుతుంది.

మాల: మంచిదేగా..!

దశ : నేను ఎవిడెన్స్ లు సంపాదించిన సంగతి అపోనెంట్స్ కి తెలిసిపోయింది.

మాల: నిజాన్ని నిర్భయంగా చెప్పగలిగి జనాన్ని జాగృతం చేసేవాడే జర్నలిస్టని చెబుతూ, ఆ జర్నలిజానికే నిలువుటద్దంగా నిలిచిన మీరే ఈరోజు ఇలా భయపడుతున్నారా.

దశ : నిజం గొంతు నులిమెయ్యాలని చూస్తున్నారు మాలతీ. నన్ను చంపైనా ఎవిడెన్స్ లు సంపాదించాలని చూస్తున్నారు.

మాల: ఎవరు?

దశ : భద్రన్న. ఆ భద్రన్న అలాంటోదే. ఈరోజు రాత్రి పన్నెండు గంటలదాకా నేను దాన్ని దాచగలిగితే... పెద్ద డ్రగ్ మాఫియానే బయటపడుతుంది.

మాల: మాఫియానా..!

దశ : అవును మాలతీ.! ఒక ఆరోగ్యవంతుడికి రోగాన్ని ఎక్కించి దానికి చికిత్స పేరుతో వీళ్ళు సృష్టించే మారణ హోమానికి సమిధలుగా పేదవాళ్ళని, నిరుద్యోగ యువతని వాడుకుంటున్నారు. వీళ్ళు చేసే ప్రయోగాలు వికటించి పాతిక సంవత్సరాలు కూడా నిండని యువతీ యువకులు వృద్ధులుగా మారుతున్నారు.. అంగవైకల్యం పొందుతున్నారు. అశువులు బాస్తున్నారు. డబ్బిస్తామని ఆశపెట్టి ఏమీ ఇవ్వకుండానే చేతులు దులిపేసుకుంటున్న ఆ వైట్‌కాలర్ బాస్టర్డ్ భాగోతాన్ని బయటపెట్టటానికి అన్ని ఎవిడెన్స్‌లు రెడీ చేశాను. న్యూస్ ఐటమ్ ప్రిపేర్ చేశాను.

మాల: అంత రిస్క్ ..!

దశ : అవసరమే మాలతీ..! ప్రశ్నించటమే మర్చిపోయిన ప్రజలకు అండగా వుంటూ, నిద్రిస్తున్న వారి ఉత్తేజాన్ని ఉత్తిష్టపరచాల్సి న జర్నలిస్ట్‌గా అది నా బాధ్యత.

మాల: మరి జర్నలిస్ట్‌కెవరండీ అండ.

దశ : తనకు తానే అన్నీ..!

మాల: నమ్ముకున్న కుటుంబం.!

దశ : కొన్ని సందర్భాల్లో కోల్పోటానికీ సిద్ధంగా ఉండాలి. నేను భయపడు తున్నానని అనుకుంటున్నావా. లేదు మాలతీ.! కూరలు తరిగేప్పుడు కత్తిని జాగ్రత్తగా వాడకపోతే తెగుతుందని తెలిసి కూరలు తరగటం మానేస్తామా. అదే కత్తి ఆత్మరక్షణకూ ఉపయోగపడుతుంది... ఒక తాగుబోతు వెధవ ఆ కత్తిని పట్టుకొని రోడ్డుమీద వీరంగం చేస్తుంటే ఆ కత్తికి ఎదురెళతామా...! ఏదో విధంగా వాడిని బ్రతిమాలో, బలప్రయోగం చేసో ఆ కత్తిని లాగేస్తాం.! అంతేకానీ మొండిగా ఆ కత్తికి ఎదురెళ్ళలేంగా.! నేను జాగ్రత్త పదుతున్నా.! ఒకవేళ ఏమైనా జరగరానిదేమన్నా జరిగితే నాన్న, జ్యోతి జాగ్రత్త.

మాల: ఏంటండీ ఈ అప్పగింతలు.

దశ : ఒక్కరి ప్రయోజనానికి బలయ్యే వందమందికన్నా.. వందలమంది కోసం ఒక్కడు బలవ్వటం లోనే అర్థముంది. ఏంటీ, నాన్న, జ్యోతి కనిపించట్లేదు.

మాల: ఎంసెట్ రిజల్స్ వచ్చాయట. మావయ్యగారితో కలసి నెట్ సెంటర్ కెళ్ళింది. చాలాసేపైందండీ వెళ్ళి.! వచ్చేస్తుంది.!

దశ : సరే.! నాన్నగారికీ, జ్యోతికీ ఈ విషయం తెలీనియ్యకు. ఎవ్వర్నీ లోపలికి రానివ్వకు.! ఒకవేళ ఎమర్జెన్సీ అయితేనే ఫోన్ చెయ్.! (ఇంతలో దశరథ సెల్ రింగవుతుంది) సార్ మీకిందకనే మెయిల్ చేశాను. భద్రన్నేసార్ మెయిన్. వేరే వాళ్ళని బినామీలుగా వుంచి నెట్‌వర్క్ అతను చేస్తున్నాడు. వీడియో అంద్ ఫోటో ఎవిడెన్స్ లు మెయిల్లో వచ్చాయ్.! ఇంకా పంపిస్తాను సార్. (బైటికెళ్ళబోతాడు)

మాల: జాగ్రత్తండీ.!

దశ : నువ్వుకూడా...! (వెళ్ళి పోతాడు దశరథ్. కెమెరా కిట్ తీసుకొని బయల్దేర తాడు. దశరథ్ అటువెళ్ళగానే మాలతి లోపలికెళుతుంది. ఆమె అటు వెళ్ళగానే శ్రీను వస్తాడు. టేబుల్‌మీద, టేబుల్ కింద అంతా వెతుకుతుంటాడు. చేతికి అడ్డొచ్చినవి కిందపడేస్తాడు.ఈ హడావిడికి మాలతి బైటికిరావటం, శ్రీను ఆమెకు ఎదురెళ్ళటం జరుగుతుంది.)

మాల: ఏయ్.! ఎవరునువ్వు? నా ఇంట్లో నీకేంటిపని?

(శ్రీను మాలతిని చెంపమీద ఒక్కటి పీకుతాడు. మాలతి భయపడిపోతుంది.)

శ్రీను: శ్రీనుగాడికి కొచ్చన్ చేస్తే సిరైత్తిద్ది. శ్రీనుగాడికి సిరైత్తినా సముద్రంలో సునామీ వచ్చినా ఎఫెక్ట్ ఈక్వెల్‌గా వుండిద్ది.! అర్థంకాలే..! అన్నిట్నీ తనతోనే సముద్రంలోకి

తీసుకెల్తుంది సునామీ..! శ్రీనుగాడు ధనం, ప్రాణం, ఆటితోపాటొస్తే ఇంకేమైనా..! ఫిగర్ చూస్తే టెంటయ్యేలా వున్నావ్. ఎంటర్‌టైన్ మెంట్ ప్రోగ్రామ్స్ పెట్టించద్దాంటీ.! నేనడిగి నాటన్నింటికీ ఆన్సరిచ్చెయ్.! కొచ్చెన్ చెయ్యనా..! గుడ్. కొచ్చన్ నెంబర్ వన్. నీ మొగుడు యాడుండాడు ?

మాల: తెలీదు.

శ్రీను: కొచ్చన్ నెంబరు టూ. యాడికెళ్ళిండు.?

మాల: తెలీదు.

శ్రీను: కొచ్చన్ నెంబర్ త్రీ. ఎప్పుడొస్తడు.

మాల: తెలీదు.

శ్రీను: తెల్వదీ..తెల్వదీ.. తెల్వదీ.. మస్తు ట్రైనింగిచ్చిండే.! నీ మొగుడు.!

మాల: ట్రైనింగేంటి?

శ్రీను: అబ్బచా..! ఏం నటిస్తున్నవే.! సినిమాల్లా, సీరియల్స్‌లో గిట్టటైజేసుకో.! మంచి నేమొస్తది. మస్తు పైసలొస్తాయ్.! గదే సీనుగాడిముందు నటిస్తే... బ్లడ్ బైటికొస్తది.! సేయ్..! స్టేట్‌లా నైన్టీపర్సంట్ క్రైమ్స్ నావల్లనే జర్గుతాంటాయ్.! నీ మొగుడు మా అన్న గురించి, ఆయన యాపారాల గురించి సీక్రెట్‌గా ఎంక్వైరీలు గిట్లా చేస్తుండు, పేపర్లలో పిచ్చిరాతలు రాస్తుండు. జర కలం కంట్రోల్ ల పెట్టుకొమ్మని గీ శ్రీనుగాడు వార్నింగ్ ఇచ్చిండని సెప్పు. శ్రీనుగాడార్నింగ్ ఇచ్చినంకభీ మారకుంటే ఆనికింక మార్నింగ్  ఉండదన్నట్టు. సంజైందిగా. నాలెక్క గలీజ్‌కొడుకు యాడుండడు.

మాల: ఏకారణం లేకుండా ఆయనలారాయరు.

శ్రీను: కారణాలేవైనా కావచ్చాంటే.! నా కేరెక్టరంత మంచిది కాదని సెప్తున్నా.! (ఫోటోమీద కాలెయ్యబోతాడు)

మాల: జ్యోతి...

శ్రీను: జ్యోతి. నీ బిడ్డా..! మస్తుంది. నీలెక్కే .! దీన్ని తీస్కపోతన్నా.!

మాల: వద్దు..!

శ్రీను: ఆంటీ..! నీ మొగుడికేం సంజాయించుకుంటావో.. నీ ఇష్టం. ఆడా ఎవిడెన్సులన్నీ తెచ్చి మా అన్న'సేతిలో 'పెట్టిండో నీ బిడ్డ ఇంటికొస్తది. లేకుంటే (పెద్దగా నవ్వుతాడు.) ఇంటర్నెట్‌లో నీ బిడ్డ ఈడియోలకి మంచి బిట్‌రేటొస్తది. నీకీపాటికి పిక్చర్ పూరా సమజైందిలే.! మల్లా మల్లా నన్ను సూడలనుకోకే.చిన్నపిల్లది. దాన్నేం చెయ్యదద్దు.! ప్లీజ్.!

మాల: చిన్నపిల్ల కాబట్టే ఆంటీ.! అంత బిట్‌రేటొచ్చేది.! సర్లే.! (శ్రీను మెమొరీ కార్డుకోసం వెతుకుతునే వుంటాడు) నీ మొగుడు ఆడు తీసిన ఈడియోలు, ఫోటోలు అన్నీ తెచ్చి మా అన్న సేతిలో పెడితే నీ బిడ్డను నీకు సేఫ్‌గా అప్పజెప్తా.! లేకుంటే సెప్పాగా..! ఢిల్లీ

బస్సులో జరిగిందే ఈడా జరుగుతది. అప్పుడు నీ మొగుడు పేపర్లో సొంతవార్తలు రాసుకుంటడు. ఐదుగురు కామాందుల ఉన్మాదానికి బలైన చిన్నారి జ్యోతి అని. ఢిల్లీలో అన్నా ఎవిడెన్స్‌లు దొరికినయ్.. గదే ఈ సీనుగాడు సేత్తే గయిభీ వుండయ్.!

మాల: ఆయన నామాట వినరు.

శ్రీను: కానీ నేను భద్రన్న మాటింటను.

మాల: ఆయన చాలా సిన్సియర్ జర్నలిస్ట్.

శ్రీను: గసొంటోల్లు మస్తుమంది మాలాంటోల్ల సేతుల్లో సచ్చిండ్రు.

మాల: ఇన్వెస్టిగేటివ్ జర్నలిజం ఆయన ప్రొఫెషన్.

శ్రీను: భద్రన్నకి అడ్డొచ్చినోణ్ణి అడ్డుతప్పించటం నా ప్రొఫెషన్.

(శ్రీను ఓ గదిలోకెళతాడు. మాలతి సెల్ తీసుకొని దశరథ్‌కి ఫోన్ చేస్తుంది.)

మాల: హలో..! యావండీ.! వీడెవడో శ్రీనట. మనింటిమీద పడి నానా గొడవ చేస్తున్నాడు.

శ్రీను: (బయటికొస్తూ) ఏందాంటీ అంకుల్‌కా..! ఒరేయ్ జర్నలిస్టూ...! సీదా ఆ ఎవిడెన్స్‌లు గిట్టా తీసుకొని మా అన్న కాడికొచ్చి సరెండరైపో.! నీ బిడ్డ నీ ఇంటికి సేఫ్‌గొస్తది. లేకుంటే... సంజైందిగా..! వచ్చెయ్.! చూడాంటీ..! నాలాంటోడు ఇంటిమీద పడి గడ్‌బెడ్ సేత్తుంటే నువ్వ ఫోన్ చెయ్యాల్సింది అంకుల్‌కి కాదు. సదా మీసేవలో అని బోర్డుపెట్టుకొని, ఖాఖీ డ్రస్సేసుకొని కూసుంటర్ సూసినవ్‌లే... ఆల్లకి.! గదే పోలీసోల్లకి! ఇదిగో నెంబరు.. (డైల్‌చేసి ఇస్తాడు)

మాల: హలో...! పోలీస్టేషన్. సార్.! శ్రీననే గూండా మా ఇంటిమీదపడి గోల చేస్తున్నాడు సార్.

శ్రీను: ఇటియ్యి.! అలో..! నమస్తేసారూ.! నేను శ్రీను. భద్రన్న రైట్. నేనేడున్నానో జరీమెకి సంజాయించుండ్రి.!

మాల: హలోసార్..! వీడు ఇంటిమీదపడి...! అదేంటిసార్ అలా అంటారు..! సార్.. సార్..! హలో.. హలో..!

శ్రీను: గదాంటీ పొజిసన్.! నేనెప్పుడూ ఏదోకేసులో జైల్లో ఉంటా.! అన్నకి అవసరమైతే బైటికొచ్చి నాపని పూర్తిచేసుకెల్తా.! నీ ఇంటిమీదపడి గడ్‌బెడ్ సేసిందానికి నో విట్‌నెస్. నా మాటిని అంకుల్‌కి, గదే నీ మొగునికి జర సంజాయించు. యాడ షురూ జేసిండో గాద్నే బంద్ సెయ్యమని. అన్న మీదికి అక్షరం దుంకిందా.. చెప్పినాగా... ఖతంసేస్తా..! (మాలతి బొట్టు చెరుపుతాడు) గిసొంటిరాత నీకు పట్టరాదనే ఇంతలెక్క సంజాయిస్తున్నా.! సోంచాయించు. సొసైటీ కోసం సొంతోల్లని దూరం సేసుకుంటడా..! అన్నతోని హాత్ మిలా కత్ సేస్తడా..! నువ్వెట్టా సంజాయించుకుంటవో..! నీ ఇష్టం. శ్రీను సెంటిమెంట్లుండయి. సెటిల్మెంట్లే..! (మాలతిని ఒక్కతోపు తోసి వెళ్ళిపోతాడు. జరిగిన పరిణామానికి మాలతి నిశ్చేష్టురాలై

కూలబడిపోతుంది.)

దశ : (సెల్ మాట్లాడుతూ ప్రవేశం) నో ప్రాబ్లంసార్. ప్రజర్సేం కొత్తకాదుగా..! నేను హ్యాండిల్ చేసుకుంటాను. ఆ న్యూస్ ఎట్టిపరిస్థితుల్లోనూ ఆపకూడదుసార్. ! (షాకుకు గురైన మాలతిని గమనిస్తాడు. ఇల్లంతా కూడా గందరగోళంగా ఉండటాన్ని చూస్తాడు. మాలతి దగ్గరికి వెళ్ళి ఆమెని కదిలిస్తూ...) మాలతీ..! మాలతీ..! (దశరథ్‌ని చూస్తూనే దూరంగా నెడుతూ భయంతో పెద్దకేకపెడుతుంది) మాలతీ నేను.

మాల: జ్యోతి... యావండీ జ్యోతండీ.!

దశ : నేనున్నానుగా..! జ్యోతి కేం కాదు.! ధైర్యంగా వుండు.

మాల: ఏం ధైర్యమండీ..! మన ధైర్యాన్ని సవాల్ చేస్తున్నాయ్ బైట సమాజంలోని పరిస్థితులు. బయటికెళ్ళిన ఆడపిల్ల సేఫ్‌గా ఇంటి కొస్తుందన్న ధైర్యంలేదు. ఎవడి పుర్రెలో ఎలాంటి బుద్ధిపుడుతుందో తెలీదు. కానీ ఇప్పుడొచ్చింది శ్రీను. వాడు చెప్పిమరీ అమ్మాయిని కిడ్నాప్ చేశాడంటే....!

దశ : అమ్మాయిని కిడ్నాప్ చెయ్యటమేంటి? వాడొచ్చినప్పుడు జ్యోతి ఇంట్లోనే వుందా.! నాన్నగారులేరా...!

మాల: వాళ్ళింకా ఇంటికి రాలేదండీ.!

దశ : (మాలతి నుదటన చెరిగిన బొట్టుని సరిచేస్తూ) నిన్ను బాగా భయపెట్టాడు. జ్యోతితో నాన్నగూడా ఉన్నారుగా.! సరే నేనిప్పుడే మనేరియా ఎస్సై గారితో మాట్లాడొస్తా..!

మాల: పోలీసుల్లో కూడా వాడికి పలుకుబడివుంది. నేను పోలీసులకి ఫోన్ చేసి మాట్లాడితే ఎస్సై గారు ఏమన్నారో తెలుసా జైల్లో భోంచేసి పడుకున్నవాడిమీద కంప్లైంట్ ఇస్తావేంటమ్మా అన్నారండీ.! పైగా వాడు అన్నకి అవసరమైనప్పుడు బైటికొచ్చి పనిపూర్తిచేసుకొని లోపలికెళతాట్ట. అసలది జైలా.. వాడి అత్తగారిల్లాండి. !

దశ : నువ్వు మాట్లాడింది ఈ సెల్‌లోంచి. నేరం చేసేవాళ్ళ తెలివిగా చేస్తున్నామని అనుకుంటారు. కానీ ఇలాగే ఇరుక్కుపోతారు. అర్ధంకాలేదా..! ఇందులో ఆల్ ఇన్‌కమ్మింగ్ అండ్ ఔట్‌గోయింగ్ కాల్స్ రికార్డ్ అయ్యే ఆప్షన్ సెట్ చేశా.! ఈ విట్‌నెస్ చాలు మాలతీ..! నేనెళ్ళి ఎస్పీగారితో మాట్లాడి మనమ్మాయిని తీసుకొస్తా! (భరద్వాజ పెద్దపెద్ద దెబ్బలతో ఒళ్ళంతా రక్తసిక్తంగా లోనికి వచ్చిపడతాడు నాన్నా..! ఏంజరిగింది? ఏంటీ దెబ్బలు.! మంచినీళ్ళు తీసుకురావో..! జ్యోతేదినాన్నా.! (మాలతి తెచ్చిన మంచినీళ్ళుతాగుతుంటాడు)

భర : నేనూ, జ్యోతి నెట్‌సెంటర్ నుంచి వస్తుంటే లైబ్రరీ దగ్గర నన్ను కొట్టి జ్యోతిని కార్లో తీసుకెళ్ళార్రా.!

దశ : ఎవరు?

భర : తెలీదురా.! మొఖానికి హెల్మెట్లు పెట్టుకున్నారు.

దశ : యావండీ..! ఆ న్యూస్ ఆపెయ్యండి.!

భర : వాడు న్యూస్ ఆపటానికి, దీనికి సంబంధమేంటమ్మా.!

మాల: వుంది మావయ్యా.! భద్రన్న అనే వాడెవడిమీదో ఈనగారు ఇన్వెస్టి గేట్ చేసి న్యూస్ ప్లాన్ చేశారట. ఈయన సేకరించిన సాక్ష్యాలు ఆ భద్రన్నకిస్తే మన జ్యోతిని వదిలేస్తామని చెప్పారు.

దశ : మీరేం కంగారుపడకండి.! నేను చూసుకుంటా.! ఈ లోపు శ్రీనుకానీ, ఇంకెవడైనా కానీ వస్తే నాతోనే డైరెక్ట్‌గా మాట్లాడమని చెప్పండి. ఏంటలా చూస్తున్నావ్.! తెగింపు తప్పదని తెలిసినా తెగించకపోతే తర్వాత చూడ్డానికి కూడా ఏం మిగలదు. అర్థంకాలేదా. కలం పట్టుకొని కత్తికి ఎదురెళుతున్నాను. కత్తి గెలుస్తుందో, కలం గెలుస్తుందో...! కాలమేనిర్ణయిస్తుంది. !

భర : నాన్నా దశరథ్.! కలం చిందించే సిరాచుక్కల ముందు కత్తి చిందించే నెత్తురు చుక్కలు నిలువలేవురా.! తరతరాల చరిత్రలో కలానికి ఎదురులేదు. ఒక సైనికుడు గన్ను పట్టుకొని శత్రువులతో యుద్ధం చేస్తాడు. ఒక పోలీసు సంఘవిద్రోహక శక్తుల్ని ఏరిపారేయటానికి తుపాకులతో ఎన్‌కౌంటర్ చేస్తాడు. ఒక జర్నలిస్ట్ పెన్నుని గన్నుగా, అక్షరాల్ని బుల్లెట్స్ గా యదవల్ని ఎయిమ్ చేసి ఏరిపారేస్తూ పెన్‌కౌంటర్ చేస్తాడు. పెన్నుపవర్ చూపించు.! భద్రన్న లాంటి బడాబాబుల మాయలోపడి నిద్రాణమైన యావత్ భారతావనని ఉత్తిష్టపరిచే దిశగా అడుగెయ్..! గో ఎ హెడ్.!

## (లైట్స్ ఆఫ్)

## 2.వ సీన్

(భరద్వాజ తలకు కట్టుకట్టుకొని తన గదిలోంచి బయటకు వచ్చి వీధి గుమ్మంలోకి చూస్తాడు. ఇంకా దశరథ్ జ్యోతిని తీసుకురాలేదని ఆలోచిస్తూ కుర్చీలో కూర్చుంటాడు. మాలతి లోపల్నించి పళ్ళెంలో యాపిల్‌ను పెట్టుకొని బయటకు వస్తుంది.)

మాల: మావయ్యా.! పొద్దున్నించి ఏం తినలేదు.! కనీసం ఈ యాపిలన్నా..!

భర : వద్దమ్మా..! నువ్వూ ఏం తీసుకోలేదుగా..!

మాల: జ్యోతిలేకుండా ఏరోజన్నా, ఏమన్నా తిన్నామా మావయ్యా.!

శ్రీను: ఇంకా రాలేదా..! (అంటూ శ్రీను వస్తాడు)

భర : ఎవరు?

శ్రీను: అరెవో బుడ్డే.! నేకొట్టిన దెబ్బలకి పోయినవనుకున్నా..! గట్టోనివే..

మాల: ఏం చేశావ్ నా కూతుర్ని?

శ్రీను: నేం చెప్పిందేం చేశావ్.!

భర : దేనిగురించి?

శ్రీను: నీకు దెల్వద్.! నోర్మూసుక్కూచో..! నేను చెప్పమన్నది చెప్పినావ్‌లే..! నీ మొగుడేం చెప్పిండు..!

భర : ఏం చెప్తాడు, రాత్రి 12 గంటలకల్లా నీ చీకటి సామ్రాజ్యం కూలిపో తుందని చెప్తాడు.

శ్రీను: గట్లే సెప్తే నాలుకోస్తా.! శ్రీనిగాడి పీనల్ కోడ్‌లో అన్యాయమంటే నాలుకోస్తా.! అన్నకెదురొస్తే ప్రాణం తీస్తా..!

భర : ఎంతమంది నాలుకలు కోస్తావ్.? ఎంతమంది ప్రాణాలు తీస్తావ్.?

శ్రీను: (భరద్వాజని కొడతాడు) నీకు లైబ్రరీకాడిచ్చింది చాల్లేదురా..నన్నే కొశ్చన్ చేస్తావా.! జఫ్ఫానాయాల.! (అంటూ భరద్వాజ మీదకి వెళుతుంటే మాలతి అడ్డుపడుతుంది. ఆమెని కూడా కొడతాడు) జర నీ కొడుక్కి సంజాయిం చుకో భద్రన్నజోలికి రావద్దని.

భర : నీ అన్నలాంటి అవినీతి చీడ పురుగులు జాతిని తొలిచేస్తూ నష్టం కలిగిస్తుంటే, నా కొడుకులాంటి జర్నలిస్టులు పుట్టుకొస్తారా మిమ్మల్ని ఏరిపారెయ్యటానికి.

శ్రీను: నీతో ఆదించే టైంలే. ప్రతి జర్నలిస్టు జీవితానికొక ముగింపున్నట్టే, మాటినని నీ కొడుక్కీ ఖతర్నాక్ క్లైమాక్స్ వుంటది.!

భర : చంపేస్తావా?

శ్రీను: డౌటా..!

భర : చంపరాచూస్తా..!

మాల: ఏం మాట్లాడుతున్నారు మీరు? జ్యోతి అతని దగ్గరుంది.!

శ్రీను: కరెక్ట్‌గా క్యాచ్ చేశావ్.! ఆ ఇసయం..! నీ మొగుడికి, నీ మామకి జర సంజాయించు.

భర : సిగ్గులేకపోతే సరి.! ఆడవాళ్ళని చిన్నపిల్లల్ని అడ్డంపెట్టుకొని ఏంటిరా మీరు సాధించేది.

శ్రీను: ఏయ్ బుడ్డే.! నాకు నచ్చనిది కొచ్చన్ చేయించుకోటం, కొటేసన్లింటం. నీ కోడలికి నా గురించి పూరా సంజైంది. ఇంకా నీకే..! (మీదికి వెళ్ళబోగా మాలతి దణ్ణంపెడుతూ)

మాల: ఆయన్నేం చెయ్యద్దు.! నా భర్తకి నేను చెప్పుకుంటా.!

శ్రీను: రేయ్ బుడ్డే..! నీకొడుకు ఎలాంటోడితో పెట్టుకున్నాడో నీకు దెల్వది. భద్రన్న. భద్రన్న బ్యాగ్రౌండ్ దెల్వకుండా పిచ్చిరాతల్రాస్తుండు. గానికి సంజాయించు. సచ్చిపోతాడని. శవంకూడా ఇంటికి రాదని.!

భర : రేయ్.! నీలాంటోడ్ని, నీకు నీడనిచ్చిన అవినీతి వృక్షాన్ని వేళ్ళతో సహా పీకిపారెయ్యటానికి అక్షరమనే ఆయుధాన్ని పట్టుకొని సొసైటీలోంచి పుట్టుకొస్తాడు ఒక్కడు. వాడే జర్నలిస్ట్. నాకొడుకే కానక్కర్లేదు.

శ్రీను: ఇంటానికి మస్తుంది. కానీ దాని రియాక్షనే తట్టుకోలేవురా..! ఆంటీ..! ఈ బుద్దేగాడు మాటినేలా లేదు. నీకింకా గంట టైమిస్తా..! నీ మొగుడికి, ఈ బుద్దేగాడికి

ఏం సంజాయించుకుంటావో నీ ఇష్టం. అన్నమీదికి అక్షరం దూకిందో సెప్పాగా...! నీ బిడ్డ....!

మాల: వద్దు..! నేను ... నేను... చూసుకుంటా..!

శ్రీను: ఐ లైకియు ఆంటీ..! మాటమీదుంటవని నాకెరికే.! నేనుభీగంతే.! గంటలా సాచ్చాలన్నీ భద్రన్నతానుండాలె.(వెల్తూ వెల్తూ భరద్వాజని ఒకటి పీకి) నోటికొచ్చినట్లు వాగితే.. నాలుకోక్కోస్తా..! జఫ్ఫానాయాల.! (వెళ్ళిపోతాడు)

భర : రేయ్...! (అంటూ ఆవేశంగా వెళ్ళబోతాడు)

మాల: మావయ్యా.!

భర : ఒక రౌడీ వెధవ ఇంటిమీద పడి దౌర్జన్యం చేస్తుంటే చూస్తూ సహించమంటావా.!

మాల: ఏంచేస్తాం మావయ్యా.!

భర : ఎదిరించి పోరాడాలి.

మాల: అలా ఎదిరించినోళ్ళకేగతి పడుతుందో చూస్తూకూడా...!

భర : ధైర్యవంతుడు ఒక్కసారే చస్తాడమ్మా..!

మాల: అలా చచ్చే ధైర్యం నాకు లేదుమావయ్యా.!

భర : ఏం మాట్లాడుతున్నావమ్మా.!

మాల: అవును మావయ్యా.! ఆయన్నే నమ్ముకున్న మేమేం కావాలి.! అన్నీ అనుభవించేసిన మీరేమైపోయినా వచ్చిన నష్టంలేదు.

భర : అంటే..!

మాల: దేశం దేశం అంటూ బావగారిని మిలటరీకి పంపించారు. సమాజం సమాజం అంటూ ఈయన్ని జర్నలిస్టుని చేశారు. దేశంకోసం అక్కడాయన ప్రాణత్యాగం చేశారు. సమాజం కోసం ఇక్కడీన ప్రాణాన్ని వద్దు.. అలా జరగనీను. అయినా ఏ అధికారం వుందని నా బిడ్డ జీవితంతో మీరు ఆడుకుంటున్నారు. నా బిడ్డ నాకు సేఫ్‌గా ఇంటికి రావాలి.! దానికోసం నేను ఏమైనా చేస్తాను.

భర : నీ ఆవేదనను నేను అర్థం చేసుకోగలనమ్మా.!

మాల: అలా అర్థంచేసుకుంటే ఇలా మాట్లాడరు మావయ్యా.! అయినా.! ఎవరికోసమో నా బిడ్డను, భర్తని త్యాగంచేసేంత గొప్పదాన్ని మాత్రం కాదు.

భర : నీ భర్త సరే.. బిడ్డ కూడా నీ బిడ్డేనామ్మా..! అసలు నీకు బిడ్డలు పుట్టే అవకాశమెక్కడిదమ్మా..! జ్యోతి నా పెద్దకొడుకు కూతురు.

మాల: మావయ్యా..! ఎవరు అవునన్నా..! కాదన్నా..! జ్యోతి నా కన్న కూతురే..! అంతకన్నా ఇంకా ఎక్కువే.! నవమాసాలు మోసి కనకపోయినా అంతకన్నా ఎక్కువ భ్రమలో బ్రతుకుతున్నా.! అక్క చనిపోతూ జ్యోతిని నాకు అప్పగించింది. దయచేసి .. దయచేసి... ఇంకోసారి ఈ ప్రస్తావన తీసుకురాకండి.! ఆయన రాగానే

నేను మాట్లాడుకుంటాను. మధ్యలో మీరు దూరి ఉచిత సలహాలిచ్చి ఆయన్ని రెచ్చగొట్టకండి.!

భర : కానీ...

మాల: ఇంకేం మాట్లాడకండి..! మరోమాట మాట్లాడితే నేను చచ్చినంత ఒట్టు...!

భర : తల్లీ..!

మాల: అదిగో ఆయన వచ్చేశారు.! (దశరథ వస్తాడు. జ్యోతికోసం మాలతి వెళుతుంది. జ్యోతిరాకపోవటంతో ఆదుర్దాగా మాలతి దశరథ మైమ్‌లో మాట్లాడు కుంటారు. దశరథ మాలతికి సర్దిచెబుతుంటాడు.)

భర : (తనలో) పిచ్చితల్లి..! తాతగా నాకుండదా ఆ బాధ..!

దశ : నాన్నా..! ఎస్పీ గారు స్పెషల్‌కేర్ తీసుకుంటానన్నారు.! ఏంటలా వున్నారు.?

భర : శ్రీనొచ్చాడు.

దశ : ఏమన్నాడు.?

భర : పాతపాటేరా..! (మాలతి జోక్యం చేసుకుంటుంది)

మాల: అమ్మాయి 'సేఫ్‌గానే వుందన్నాడు. ఏమండీ.. ఈ ఒక్కసారికి అతను చెప్పినట్లు వింటే...!

దశ : మాలతీ వాడేం చేస్తున్నాడో తెలిసి కూడా...!

మాల: వాడెలా పోతే నాకేంటి? ఒక స్త్రీగా నా మొగుడు, నా కూతురు, నా సంసారం.. ఇదే నాకు ముఖ్యం.

దశ : అంతకన్నా ముందు ఒక ఇండియన్‌వి. నాదేశం, నా సమాజం, నా ప్రజలు ఇవే ముఖ్యం. నీలా ఎవరికి వాళ్ళు అనుకోబట్టేనే ఈ సమాజం ఇంకా కుళ్ళు కంపుకొడుతోంది. హక్కుల్ని కోరుకునే ముందు బాధ్యతల్ని గుర్తించండి.

మాల: బాధ్యత.! కట్టుకున్న భార్యకి, కూతురికి ఎలాంటి కష్టం కలగకుండా చూడటంకూడా మీ బాధ్యతే. ఏం చేశారు? కూతుర్ని తీసుకెళ్ళి ఒక రౌడీగాడి చేతుల్లో పడేశారు.

దశ : మాలతీ..!

మాల: ఎవడో ఇంటిమీద పడి నీ భార్యని, తండ్రిని కొడితే మందులు రాసుకొమ్మని డాక్టర్ని ఇంటికి పంపారు.!

దశ : మాలతీ..!

మాల: అయినా ఎవడెలా పోతే మీకెందుకండీ..! నాకు నా బిడ్డకావాలి.! అంతే.! (లోపలికెళుతుంది)

భద్ర : నీపెల్లాం కరెక్ట్‌గా చెప్పిందిరా నాయనా.! ఈడెటుదిరిగి నా దగ్గరికి రాడని నేనే వచ్చా..! ఏంది పెద్దాయన అట్టా సూత్తున్నా ఎవరనా..! భద్రన్న.! ఇప్పటిదాకా భద్రంగానే వున్నా..! నీ కొడుకేనా భద్రతకి భంగం కలిగించాడు. ఇక సూత్తా

ఊరుకుంటానా సెప్పు.. అందుకే నా భద్రతకోసం నీ మనవరాల్ని ఎత్తుకెళిపోయా.!

భర : నా మనవరాలు.!

భద్ర : ఇంకో పదినిమిషాలు సేఫ్‌గానే వుంటుంది. ఆ తర్వాత ఏమవుతుం దన్నది శ్రీనుగాడు నాక్కూడా క్లారిటీ ఇవ్వలేదు.! సండాలపోడయ్యా ఆ శ్రీనుగాడు. ఆడ మగ అన్న తేడాకూడా యదవకి. నీకూతురు వయసుకొచ్చిందంటగా... (దశరథ భద్రన్న చొక్కా పట్టుకుంటాడు) శ్రీను గాడు సెప్పాడ్లే.! నువ్వొరాన్నా ఎంటర్టైన్ అవుద్దన్నాడు. నేనాడంత సండాలపోణ్ణి కాదుగా..! అందుకే ఎంటర్‌టైన్‌మెంట్ యాంగిల్స్ నాకు నచ్చవు అయ్యేయో నువ్వే సూసుకోరా అని సెప్పా.!

దశ : నాఇంటికెందుకొచ్చావ్.!

భద్ర : సాచ్చాలన్నీ నీకాడ పెట్టుకొని మెగాస్టార్ చిరంజీవింటికో, జగన్ బాబు ఇంటికో పోతే బాగోదుగా.! చూడు జర్నలిస్ట్ తమ్మీ, .! ప్రాణా లకు తెగించి కరెంట్ ఫెన్సింగ్ దాటి చెట్టెక్కి నా కంపెనీ గోడ దూకి వీడియోలు, ఫోటోలు తీశావే అయ్యేక్కడ.! నా సిసి కెమెరాలు చూపించాయి తమ్మీ... నువ్వు సేసిన పనులన్నీ!

దశ : అందుకని

భద్ర : అయ్యినాకిచ్చేత్తే.. భద్రంగావుంటా..!

దశ : ఇవ్వకపోతే..!

భద్ర : సంకనాకిపోతాంరా నాయనో..! ఇయన్నీ కాదు తమ్మీ.! ఇట్టా సాచ్చాలు సేకరించి మాలాంటోల్ల దగ్గర డబ్బులు గుంజటం నీలాంటి జర్నలిస్టులకి కొత్తేంకాదుగా..! అయినా నేనేం తప్పుచేశానని?

దశ : తప్పుచెయ్యలేదా..! ఒక ఆరోగ్యవంతుడికి రోగాన్ని బలవంతంగా ఎక్కించి, యాంటీ డిసీజ్ మెడిసిన్ పేరుతో ప్రయోగాలు చేస్తున్నావు. కుటుంబ అవసరాలకు డబ్బులు అక్కరకొస్తాయని ఆ పేదవాళ్ళు నీ ప్రయోగాలకు సమిధలుగా మారుతున్నారు. చనిపోయిన వారి కుటుంబాలకు పైసా ఇవ్వకపోగా వారి శవాల్ని కానుకగా పంపుతావా.! అసలు నువ్వు మనిషివా మృగానివా.!

భద్ర : ఓరి నాయనో..! మెడిసిన్ సరిపడ కాల్లు చత్తే, అల్లనేదో నేనే సంపినట్టు మాటాడేతున్నావేంది?

దశ : నీ ప్రయోగాలవల్లనే చనిపోతున్నారు. ఉన్న రోగాలు చాలవన్నట్లు కొత్తరోగాలు తయారుచేసి వాటిని జనానికి ఎక్కిస్తూ వాటికి మందులు కనిపెట్టి ఎక్కువ ధరలకు అమ్ముకుంటూ... 'రేయ్.. రేయ్..సిగ్గులేదురా... ఎంతమందిని బలితీసుకుంటావ్.. ఎంత డబ్బులు సంపాదించుకుంటావ్..! లాగుతా... నిన్నూ.. నీ ఎనకున్న యదవలందర్నీ బయటకు లాగుతా.....!

భద్ర : అట్టా అందర్నీ లాగితే నాయనా..! నాలుగు దేశాల్లో, పదమూడు రాష్ట్రాల్లో ప్రభుత్వాలు మారిపోతాయరా నాయనా.! అంతమందినీ లోన తొయ్యటానికి జైళ్ళు చాలవు.! మాలాంటోళ్ళని మేపటానికి ప్రభుత్వ బడ్జెట్టూ చాలదు. దేశ జనాభాలో

కొంతమందన్నా నాలాంటోళ్ళద్వారా తగ్గుతున్నారని అనుకోవచ్చుగదరా నాయనా..!

భర : చనిపోయిన వాళ్ళలో నీవాళ్ళుకూడా వుంటే తెలుస్తుంది ఆబాధ...!

భద్ర : నావాళ్ళెందుకుంటారు పెద్దాయనా.!

దశ : చాలీచాలని తిండితింటూ ఒంటిని దాచుకోటానికి చిరిగిన బట్టలు కప్పుకుంటూ ప్రతిరోజూ చావుతో పోరాడుతూ బ్రతికే ఆ పేదలు నీ ఫార్మసీ ప్రయోగాలకు సమిధలా..!

భద్ర : ఆల్లలా బతికి ప్రయోజనమేందిరా నాయనా.! ఎంతోమందికి ఉపయోగపడే మందుల తయారీకి పానాన్ని బలిచేసుకున్నందుకు ఆల్లకు పుణ్యమొత్తది.

భర : మరీ పుణ్యం నీ కుటుంబానికి వద్దా భద్రన్నగారూ...!

భద్ర : నువ్వేంది 'పెద్దాయనా మద్యలో దూరతన్నా.! అయినా నాకుటుం బానికి అంత పెద్ద పున్యమెందుకులే..! ఏదో పజాసేవ సేసుకుంటున్న పున్యంచాలు.! ఇయన్నీ కాదురా నాయనా, నీరూట్‌లో అడుగు తున్నా. నాక్కావలసింది నువ్వియ్యటానికి నేనెంతిచ్చుకోవాలి?

దశ : అడిగింతర్వాత కాదనవుగా..!

భద్ర : నాకు తెలుసురా నాయనా...! నువ్వు రూట్‌లోకొస్తావని..! మీలాం టోల్లు ముందు భయపెడతారు..! ఆ తర్వాత మా దగ్గర డబ్బులు గుంజుతారు.! సెప్పు..! కోటిరూపాయలా..? రెండు కోట్లా..? పద్దెనిమిది కోట్లు..! ఆల్లతో మాట్టాడి నేనిప్పిత్తా..! సాచ్చాలన్నీ ఇచ్చి సైలెంటైపోరా నాయనో...!

దశ : అయితే..! చేసిన తప్పులన్నీ ఒప్పుకొని చట్టం ముందు లొంగిపో..!

భద్ర : అదే చేసేవాణ్ణయితే ఈ గోలంతా ఎందుకు నాకు? అయినా తప్పుచేశాను... తప్పుచేశా నంటున్నావ్.! నేను చేసిన తప్పేంది తమ్మీ.! నాదేశ ప్రజలకు మంచి మంచి మందులు తయారు చెయ్యటం కూడా నేరమేనా నాయనా.! అసలు నాలోంటోన్ని గుర్తించి ప్రభుత్వం పరమవీర చక్ర ఇచ్చినా తప్పులేదుతమ్మీ. !

భర : నోర్ముయ్.! పరమవీరచక్ర గురించి మాట్లాడే అర్హత నీకు లేదు. అది దేశంకోసం ప్రాణాలర్పించిన యుద్ధవీరులకు ఇస్తారురా..! మిలటరీలో పనిచేసే వారికి మాత్రమే సొంతం. దేశాన్ని దోచేసే నీలాంటి దొంగవెధవలకి కాదు.

భద్ర : నువ్వేంది పెద్దనాయనా..! ఉన్నట్టుండి అంతెత్తు ఎగిరిపడ్డావ్.! కొంపదీసి మిలటరీలో పనిసేసావా ఏంది? పోనీలే పద్మశ్రీనో, పద్మభూషణ్ అయినా అడ్జెస్ట్ అవుతా..!

దశ : ఛ.. ఛ.. నీలాంటి వెధవలకి వాటి పేరు కూడా స్మరించే హక్కులేదు.

భద్ర : అనుకున్నా..! ఏంట్రా ఈ జర్నలిస్టుగాడిలా మాట్టాడుతున్నాడని. అదంతా నీ

పెంపకమన్నమాట.

భర : ఎముకలు కొరికే చలిలో కంటి మీద రెప్పవాల్చకుండా సరిహద్దుపహారా కాస్తూ దుర్మార్గులు శత్రుదేశాల్లోనే ఉన్నారను కున్నా..! కానీ సొసైటీలోంచి పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న మీలాంటి వాళ్ళను చూసి ఏరిపారెయ్యటానికి ఒకడు రావాలను కున్నా..! ఆ ఒక్కడు నా ఇంట్లోంచే రావాలని కోరుకున్నా.! వచ్చాడు! అడుగో..! జర్నలిస్ట్.!

భద్ర : తప్పేంచేశానో సెప్పకుండా మీ అయ్యా కొడుకులిద్దరూ సెరోపక్కా తగులుకున్నారేందిరా నాయనోయ్..!

దశ : తప్పేంచేశావా.! ప్రభుత్వ నిబంధనలకు విరుద్ధంగా ప్రయోగాలు చేస్తున్నావ్.!

భద్ర : నిబంధనలేందిరోయ్..!

దశ : అవేంటే తెలీకుండానే ఫార్మాకంపెనీ రన్ చేస్తున్నావా..! మల్టీ స్పెషాలిటీ మెయింటేన్ చేస్తున్నావా. !

భద్ర : అఏందో నువ్వే సెప్పచ్చుగా..! తెలుసుకుంటారా నాయనా..!

దశ : నువ్వు తయారు చేసిన డ్రగ్ రికగ్నైజ్డ్ కంపెనీస్ అప్రూవల్ చెయ్యాలి.!

భద్ర : చేశారు.!

దశ : ఎలకలమీద ప్రయోగాలు చేయాలి.

భద్ర : తెల్లెలుకలు తెచ్చాంరా నాయనా.!

దశ : రిపోర్ట్స్ మళ్ళీ అదే రికగ్నైజ్డ్ కంపెనీస్ ఆక్సెప్ట్ చేయాలి.!

భద్ర : ఓరినాయనో..! అయన్నీ సేశాంరా తమ్మీ..! తల్లోయ్.! నాలాంటి దేశభక్తుడికి ఏందీపరీచ్చ.! (మాలతి వస్తుంది)

దశ : వెంటనే మనుషుల మీద ప్రయోగాలు చేస్తున్నారు.

భద్ర : అవున్రా నాయనా.!

దశ : అదేరా నువ్వుచేసిన నేరం. ! ఎలకలమీద ప్రయోగాలు చేసింతర్వాత రిపోర్ట్స్ కంపెనీస్ ఆక్సెప్ట్ చెయ్యాలి. ఆతర్వాత మీరు కోతులమీద ప్రయోగాలు చేసి వాటిని మళ్ళీ కంపెనీస్‌కి పంపించాలి. అలా కాకుండా డైరెక్ట్ మనుషుల మీద చేస్తున్నారు. అలా చేస్తున్న టైంలోకూడా సేఫ్టీ ప్రికాషన్స్ పాటించట్లేదు. యాంటీ రియాక్షన్ డ్రగ్స్ పక్కన పెట్టుకోవట్లేదు. అందుకే ఎంతోమంది యువతీ యువకులు అంగవైకల్యం పొందుతున్నారు. మరికొంతమంది అశువులు బాస్తున్నారు. ఇంకా...

భద్ర : ఓర్నాయనో.. ఓర్నాయనో...! ఇంత ఇన్ఫర్మేషన్ ఎట్టా వచ్చిది తమ్మీ..! సిన్నప్పుడు ఆమ్మకాడ తాగిన ఉగ్గుపాలు కూడా కక్కిపిత్తారా ఏంది మీ జర్నలిస్టులు.

దశ : ఈజన్మలోనేకాదు..! నీ జన్మజన్మల పాపాలూ బైటికి లాగుతాంరా.!

భద్ర : ఓర్నాయనో..! ఇయి సేతులు కాదు కాల్లనుకోరాదే.! ఇకనుంచే నువ్వుసెప్పినట్టే సేత్తా..! ఇప్పుడైతే న్యూస్ ఆపెయ్ తమ్మీ..! ఇదిగో ఫోన్..! మీ ఆపీసోల్లకి ఫోన్‌చేసి సెప్పెయ్..! ముందు నేను చెప్పినట్టే 'పైసలిత్తా..! మదర్ ప్రామిస్..!

దశ : (ఫోన్ తీసుకుంటాడు. భరద్వాజ, మాలతి ఆశ్చర్యపోతాడు. భద్రన్న సంతోషంగా ఫోన్ చెయ్యమన్నట్లు చూస్తుంటాడు. దశరథ ఆఫోన్ పట్టుకొని ఏదో నెంబరు నొక్కబోతూ...) మాటమీదే నిలబడతావ్‌గా..!

భద్ర : మాటతప్పే వంశంకాదురా నాయనా..!

దశ : నాకింకో క్లారిటీ కావాలి.! చనిపోయిన కుటుంబాలకి జరిగిన నష్టం.!

భద్ర : పొయ్యారు... ఏం చేస్తాం..! ఫోన్ చెయ్ తమ్మీ.!

దశ : అయితే నేను ఫోన్ చెయ్యను. (ఫోన్ భద్రన్న చేతిలో పెడతాడు)

భద్ర : అమ్మమ్మమ్మ..! అంతమాటనమాక. ఫోన్ చెయ్యరా నాయనా..! నీకు పున్నెముంటుంది. నాయనా..! నీ పిచ్చిరాతలకి దేశాలకుదేశాలు, రాష్ట్రాలకురాష్ట్రాలే కూలిపోయేలా వున్నాయి. ఆ రాతలు ఆపరా..! నాయనా...! అంటా నీ కాల్లు పట్టుకొని బతిమాలుకుంటానని అనుకున్నావారా నాయనా..! నువ్వు సెప్పినట్టల్లా ఆడతన్నానని కామెడీ కేరక్టరనుకున్నావా...! సెకండ్ యాంగిల్ కూడా వుంది చూస్తానంటే..! నీ కూతురు నీకు సేఫ్‌గా ఇంటికి చేరద్దా..!

మాల: అయ్యా..! ఆయనమాటలేం పట్టించుకోకండయ్యా..! నా బిడ్డని నాకు తెచ్చివ్వండయ్యా..! చిన్న పిల్లయ్యా అది..!

భద్ర : ఆయిసయం నీ మొగుడికి తెల్వాలే.! నాలుగ్గంటల్లో చదివేసి అవతల పారేసే న్యూస్ పేపర్‌లో వార్తకోసం నాలాంటి పెద్దమనిషితో పెట్టుకుంటాడే..! రేయ్ రేయ్ జర్నలిస్టు మీ వార్తా పత్రికలన్నీ మాలాంటి పెట్టుబడి దారుల కబంధ హస్తాల్లో వున్నాయి. మీ పేపర్లోనే కద నా గురించి గొప్పగా రాశారు. ఇప్పటికీ ఆ కటింగ్స్ నాదగ్గరున్నాయి. రేయ్ జర్నలిస్టు మీ జాతిజాతికే రెండునాల్కలురా..! యాడ్లిస్తే అనుకూలంగా రాస్తారు..! ఇవ్వకపోతే బురదజల్లుతారు. అసలు మీ మీడియా వాల్లకి మా చుట్టూ తిరగటం తప్ప ఇంకేపని వుండదట్రా..! మాలాంటోల్లు ఏంతిటున్నారు, ఏం తాగుతున్నారు, ఏడ పడుకుంటున్నారని సేకరిస్తారు, ఈడియోలు తీస్తారు. ఇదేనారా మీ మీడియా నైతిక విలువ.? రేయ్ జర్నలిస్టూ...! గుడ్డొచ్చి పిల్లనెక్కిరించినట్లు జర్నలిజం, ప్రెస్ గురించి నాకు చెప్పబోక. రేపో మాపో నేనూ ఓ పత్రిక, న్యూస్ ఛానల్ పెట్టబోతుండా..! ఆ న్యూస్ ఆపేత్తే నిన్ను ఎడిటర్‌ని చేత్తా.!

దశ : నోర్ముయ్..! రాస్కెల్.! ప్రెస్‌గురించి నీకేం తెలుసురా..! పి అంటే పబ్లిక్ ఆర్ అంటే రియలైజేషన్, ఇ అంటే ఎనాలిసస్ ఎబిలిటి, ఎస్ అంటే సోషల్, ఎస్

అంటే సెక్టార్. సమాజాన్ని చైతన్యపరిచే విశ్లేషణాత్మకమైన సామర్థ్యాన్ని కలిగిన సాంఘిక వ్యవస్థ ప్రెస్.

మాల: మీరూరుకోండి..! పెద్దమనిషితో ఏంటా మాటలు..! మనమ్మాయి అతని దగ్గరుంది.!

భద్ర : అద్గది పాయింట్రానాయనా..! నీపెల్లాం అర్థం సేసుకున్నంత కూడా నీకర్థం కాకపోతే, నువ్వేం జర్నలిస్టువో నాకర్థంకాటంలేదు. ఒరేయ్ నాయనా...! నువ్వరాసే పిచ్చి వార్తల వల్ల ముందు జనంలో చర్చమొదలెద్ది. ఆతర్వాత ఎంక్వైరీ. డబ్బు ఎంత ఎక్కువుంటే ఎంక్వైరీ అన్నేళ్ళు జరుగుద్ది. తీరాఎంక్వయిరీ కొంతసాగేసరికి నేనో నలుగురు పెద్దోళ్ళతో సంబంధాలున్నాయనిచెప్తా. ఆళ్ళతో దిగిన ఫోటోలున్నాయిలే. నేన్జెప్పింది నిజమా కాదా అని తేలటానికి మరికొన్నాళ్ళుపట్టిద్ది. ఇలా నేను బతికుండగా ఆ కేసు తేలదు.

దశ : చట్టంలో లొసుగులు అడ్డంపెట్టుకొని జనాన్ని నిలువునా దోచేస్తున్నారు మీరంతా...

భద్ర : ఎనకటికి నీలాంటోడే ఇల్లు గెలవలేను కానీ ఊరినే గెలుత్తా అన్నాట్ట.! ఇంట్లో సమస్సెట్టుకొని ఊరినుద్దరిత్తా నంటాడేంది? అడగవేందమ్మా..!

మాల: సమాజం.. జనం .. ఇవన్నీ వదిలేయండది..! ముందు జ్యోతిగురించి ఆలోచించండి.!

భద్ర : అట్టా అడగవే నా తల్లీ..!

భర : ఏంటమ్మా వాడిమాటలింటావ్.!

భద్ర : ఒరేయ్ బుడ్డే..! అదేకాదు నువ్వా నామాటే ఇంటావ్..! ఇప్పుడు చూడు నేను చెప్పినట్టల్లా ఇంటది..! ఏమ్మా కూర్చో... నుంచో... (మాలతి అలాగే చేస్తుంది).

దశ : మాలతీ..! ఏం చేస్తున్నావ్ నువ్వు.!

భద్ర : అది నీ మాటినదురా నాయనా..! దాని రిమోట్ నాదగ్గరుంది.! నీ బిడ్డ నాకాడున్నంతవరకూ నీ పెల్లాం నా చేతిలో కీలుబొమ్మ.! ఏరా బుడ్డే..! నీ మనవరాలు సేఫ్‌గా ఇంటికి రావద్దా..! ఆడున్నది శ్రీనుగాడు. ఆడేసే పిచ్చేసాలకి నీ మనవరాలు సచ్చిపోద్ది.! అవసర మారా నాయనా...! నీకిదంతా..! అరెయ్ బుడ్డే..! ఈడంటే కుర్రోడు ..! ఆవేశమే తప్ప ఆలోచనలేదు.! ఇంత వయసొచ్చినా నువ్వేందిరా..! చెప్పు నీకొడుక్కి..!

భర : రేయ్..! దశరథ్..!

దశ : ఏంటి నాన్నా..! నువ్వుకూడా...!

భర : తప్పదురా..!

దశ : నాన్నా..! ఈ దేశమే నాకుటుంబమని పెంచావ్. ఆ కుటుంబం గురించి ఆలోచిస్తున్నాను. నా ఒక్క బిడ్డ గురించి ఆలోచిస్తే ఎంతో మంది తల్లులు పిల్లల్ని కోల్పోతారు నాన్నా..!

భద్ర : ఒరేయ్..! నాయనా..! ఆ ముచ్చట్లన్నీ చదుకోటానికి, రాసుకోటానికి బాగుంటాయి. మాలాంటోళ్ళంటే మాటలు కాదురా..! అంగబలం, అర్ధబలం, అధికారబలం.. నేరచరిత్ర, మాఫియా సంబంధాలు, ఖాకీల అండదండలు. మాలాంటి ఖద్దరు పెద్దల్ని కెలకటమంటే తేనెతుట్టెలో చేయిపెట్టటమే.!

దశ : తెలుసురా..! ప్రజలు ప్రశ్నించనంతకాలం నీలాంటి యదవలు పుట్టుకొస్తారని. అందుకే మీ పాపాల చిట్టామొత్తం రికార్డుచేశా.! విప్పమంటావా.! దేశంలోని 4,807 మంది ఎమ్మెల్యేలూ, ఎంపీల్లో 30శాతం మందికి నేరచరిత్రుంది. అందులో 14శాతం దాకా హత్యలూ, అత్యాచారాల్లాంటి అభియోగాలెదుర్కొంటున్నారు. 2004-11 మధ్యకాలంలో దేశంలోని ఆరు ప్రధాన రాజకీయ పార్టీల మొత్తం ఆదాయం 4,895.96 కోట్లరూపాయలు... ఇందులో 91.01 శాతం గుర్తుతెలీని వారి విరాళాలు పెద్దమొత్తంలో వున్నాయ్.! ఈ అంకెలేరా ప్రజాస్వామ్య వ్యవస్థను అపహాస్యం చేస్తున్నాయ్! శూలాల్లా వెంటాడి గుండెల్ని ఛిద్రం చేస్తున్నాయ్.! మీ అవినీతి పీఠాల్ని పెకలించటానికి క్షరంకాని అక్షరమనే ఆయుధాన్ని పట్టుకొని, మీమీ చీకటి బ్రతుకుల భాగోతాన్ని బయట పెడుతూ, నిద్రిస్తున్న నా యావత్ భారతాన్ని ఉత్తిష్టభారతి నినాదంతో మేల్కొలుపుతాను.!

భద్ర : (చప్పట్లు కొడతాడు) నువ్వు చెప్పిందింటుంటే మైండ్‌పోతంది తమ్మీ.! ఇంత పక్కాగా లెక్కలేద్నించి వచ్చాయ్.! చాలా వర్కుచేశావ్ తమ్మీ.! నీగురించి నాకు చానా లేటుగా తెలిసింది.! కానీ నా గురించే నీకింకాతెల్వలే.! శ్రీనుగాడు లాంటి గలీజు యదవలు నాకాడ చాలామందున్నారు. ఆల్లంతా కలిసి నీ బిడ్డని..

మాల: మీకు దండంపెడ్తా నా బిడ్డనేం చెయ్యకండి... తమకి మాత్రం పిల్లలు లేరా..!

భద్ర : ఎంతధైర్యమే నీకు నా బిడ్లతో నీ బిధడను పోలుస్తావే..!

మాల: అయ్యా... నీకాళ్ళు పట్టుకుంటా.! (కాళ్ళు పట్టుకుంటుంది) అంత మాటంటానా దొరా..! నీ బిడ్డలెక్కడ..! నా బిడ్డలెక్కడ.!

దశ : మాలతీ ఎందుకు వాడికాళ్ళు పట్టుకుంటావ్. !

మాల: మీరూరుకోండి..! మీకేం తెలీదు.!

దశ : నాన్నా..! వాడిక్కడున్నంతసేపూ మన జ్యోతికేం కాదు.! వచ్చి వచ్చి ఉచ్చులో ఇరుక్కున్నాడు. రేయ్ ఇప్పుడు ఆ శ్రీనుగాడికి ఫోన్ చేసి నా కూతుర్ని సేఫ్‌గా ఇంటికి తెమ్మను.

భద్ర : చెప్పకపోతే ఏం చేస్తావ్‌రా నాయనా..!

దశ : నీ ప్రతికదలికా అబ్జర్వేషన్‌లో వుందిరా నాయనా..! నీ అంతట నువ్వే విట్‌నెస్‌లు వదిలేసి వెళుతున్నావ్‌రా నాయనా..! ఇందాకటినుంచి నీ పిచ్చివేషాలు అన్నీ రికార్డ్ అవుతున్నాయి..! అర్ధమైందా.!

భద్ర : కొంపతీసి సీసీ కెమెరాలు పెట్టావేందిరా నాయనా..! ఏడున్నాయిరా అయి..!

దశ : నువ్వెంతెతికినా కనబడవులేకానీ ముందు ఫోన్ చెయ్..!

భద్ర : (ఫోన్‌తీసి) అలో... శ్రీనుగా..! ఏడున్నావ్‌రా...! (శ్రీను ప్రవేశం)

శ్రీను: జర్నలిస్ట్ ఇంట్లో..!

భద్ర : వచ్చేసినావేందిరా..! అరేయ్ నువ్వెల్లి.. ఆ జర్నలిస్ట్‌గాడి.. ఈజర్నలిస్ట్ సార్ కూతుర్ని ఎంటబెట్టుకొచ్చెయ్.!

శ్రీను: ఏంమాట్లాడతున్నావన్నా..! ఈ గిఫ్ట్..!

భద్ర : గిఫ్టేందిరా..! (శ్రీను భద్రన్నని పక్కకి తీసికెళ్ళి చెవిలో చెప్తాడు) వామ్మో..! ఈ మేటర్ నువ్వే డీల్ చేసుకో..! ఒరేయ్ నాయనా నాకు దీనికీ సంబంధంలేదు. ఎల్లిపోతున్నా..! (వెళ్ళబోతాడు)

శ్రీను: ఎక్కడికెల్తావన్నా.! నువ్విణ్ణే వుండాల.! రేయ్.. ఈ గిఫ్ట్ తీసుకొని వార్తాపెయ్.!

దశ : గిఫ్ట్‌లు తీసుకొని న్యూస్ అమ్ముకొనే లుచ్చా జర్నలిస్ట్‌ని కాదు.! ముందా గిఫ్ట్ తీసెయ్.!

భద్ర : నేన్సెప్పలే..! ఆడు మారడురా నాయనోయ్..! నాకు చిప్పకూడు తప్పదురా.. నాయనో..!

శ్రీను: నువ్వేం ఫికర్ చెయ్యక్.! నేనున్నాకదా..! రేయ్..! గిఫ్ట్ ఓపెన్ చెయ్యరా..!

దశ : అవసరంలేదు.

శ్రీను: ఒకసారి దాన్ని చూసినంక ఎనక్కిమన్నా ఇయ్యవ్..! నచ్చితేనే తీసుకో..! నచ్చకుంటే నేనే తీసుకెల్తా..! ఆంటీ..! దా..! అచ్చి ఓపెన్ చెయ్.! రేయ్ బుడ్డే..! దా..! (ఇద్దరూ వచ్చి గిఫ్ట్ ఓపెన్ చేస్తుంటారు.)

దశ : నాన్నా..! నన్ను అవినీతి పరుణ్ణి చెయ్యద్దునాన్నా..! ప్లీజ్ నాన్నా..! ప్లీజ్ నాన్నా..! ( గిఫ్ట్ ఓపెన్ చెయ్యగానే అందులోంచి ముందు చున్నీ వస్తుంది. భద్రన్న జారుకుంటుంటాడు. శ్రీను భద్రన్నని పట్టుకుంటాడు. భద్రన్న వణికిపోతుంటాడు. శ్రీను ధైర్యం చెబుతుంటాడు. భరద్వాజ ఆ గిఫ్ట్ ప్యాక్‌లోంచి ఒక మొండిచెయ్యిని బయటకి తీస్తాడు. అంతే భద్రన్నకిందపడతాడు. దశరథ్, మాలతి, భరద్వాజ ఇద్దరూ అవాక్కయిపోతారు. ఒక్కసారిగా మాలతి ఏడుస్తుంది. భరద్వాజ ఆమెని ఓదారుస్తాడు. దశరథ్ మాలతి భుజంమీద చెయ్యేస్తాడు. మాలతి ఒక్కసారిగా లేచి ఆ చెయ్యి పట్టుకొని దశరథ్‌కి చూపిస్తూ...)

మాల: నా జ్యోతి..! సమాజానికి వెలుగునివ్వాలన్న నీ ఆకాంక్షకోసం కొడిగడుతున్న నాకూతురు జ్యోతి..! నీ ఆశయకాంక్షకు నిర్దాక్షిణ్యంగా నా కూతురుని బలిచేస్తున్నావ్.! మావయ్యా..! ఇప్పుడు మీకు ఆనందమేనా..! ఒక కొడుకు దేశ సేవకోసం జవానుగా మారి ఆ సేవలో మరణించి మీ ఆశయాన్ని సాధిస్తే..! ఇంకో కొడుకు సమాజాన్ని రక్షించటానికి జర్నలిస్టుగా మారి ఇదిగో సమాజంకోసం ఈతల్లికి ఈ బహుమతి నిచ్చాడు.

దశ : మాలతీ...!

మాల: వద్దు..! నన్ను తాకద్దు..! తన ఆకలి తీర్చుకోటానికి కన్నబిడ్డల్ని కూడా తినేసే పాముకేం తీసిపోని ది గ్రేట్ సిన్సియర్ జర్నలిస్ట్ దశరథరామ్.! చెప్పు దీనికి నువ్వేం సమాధానం చెప్తావ్.! (దశరథ తలవంచుకుంటాడు) పెన్ను పట్టుకొని సమాజాన్ని ఉద్ధరిస్తానన్నావ్..! ఈయన గారు సమర్ధించారు. సమాజంకన్నా ముందు నీ కుటుంబం గురించి ఆలోచించమంటే ఉపన్యాసాలిచ్చారు. ఆ ఉపన్యాసాలు ఏ ఒక్కరినన్నా మార్చాయేమో చూడండి. అలా మార్చి వుంటే నా కూతురికీ గతి పట్టేదా..!

భర : అమ్మా..! మాలతీ..!

మాల: వద్దు..! అనుక్షణం ఇలా ప్రమాదాలతో భయపడుతూ బతికే బతుకు నాకొద్దు. ఇలాంటి భర్తా వద్దు. ఈ కుటుంబమూ వద్దు.! అయ్యా..! ఇంత గొప్ప బహుమతిని నాకు అందించిన మీకు చేతులెత్తి శిరసు వంచి ప్రణామం చేస్తున్నా.! కృతజ్ఞతలు చెబుతున్నా.! ఏతల్లీ కూడా ఇలాంటి కానుకను అందుకొని వుండదు.! శ్రీను నీమాటమీద నాకు నమ్మకముంది. చేసిన పనిని నిజాయితీగా ఒప్పుకుంటావన్న నమ్మకంతో అడుగుతున్నా. నా జ్యోతి బ్రతికే వుందా..! లేక చనిపోయిందా..!

శ్రీను: చావుబతుకుల మధ్య కొట్టాడుతోంది.! ఇంకో పదినిమిషాలకన్నా బతకదు.!

మాల: యావండీ... నాకు నా జ్యోతి కావాలండీ.! తను ప్రాణాలతో వుంటే చాలండీ..! మావయ్యా... మీరన్నా చెప్పండి మావయ్యా..! శ్రీను నా కూతుర్ని ఇలా చేస్తున్నప్పుడు నీ కడుపున పుట్టిన బిడ్డకానీ, నీ తోబుట్టువులు కానీ గుర్తురాలేదా..! చిన్న పిల్లను చిత్రవధ చేస్తున్నప్పుడు నా బిడ్డచేసిన ఆక్రందనలు నీకు వినిపించలేదా.! నీ మనసుని కనీసం కదిలించలేదా..! అసలు నీకేం అనిపించలేదా..! నాబిడ్డ మాతో ఏమైనా చెప్పమందా...!

శ్రీను: ఇది జస్ట్ శాంపిల్ మాత్రమే.! న్యూస్ ఆపక పోతే నీ బిడ్డను చంపేస్తా.! ఒక్క నీ బిడ్డనేకాదు నీ పెళ్ళాన్ని,నీ బాబుని, ఆఖరికి నిన్ను చంపైనా ఆ వార్తరాకుండా ఆపుతా..!

దశ : నాకుటుంబం మొత్తం అంతమైపోయినా ఆ వార్త ఆగదు. ప్రశ్నించే వాడు లేడనేకదరా..! మీలాంటోళ్ళు పుట్టుకొస్తుంది.! నేర్పిస్తా..! ప్రజలకి ప్రశ్నించటాన్ని నేర్పిస్తా..!

శ్రీను: నీ ఒక్కడి వల్లే సాధ్యమౌతుందా...!

దశ : నావల్లే సాధ్యమౌతుంది.! నా కలం నుండి వెలువడే ఒక్కో సిరాచుక్క లక్షల మెదళ్ళని కదిలిస్తుంది. ! వాళ్ళ ఆలోచనల్లో ఆవేశాన్ని రేకెత్తిస్తుంది. ఒక గడ్డిపోచ దుర్భలమైతే, వేయి గడ్డిపోచలు దుర్భేద్యమై మదపుటేనుగునే కట్టిపడేస్తాయి.

ఒక్కడి వల్ల సాధ్యంకానిది సమూహంతో సాధ్యమౌతుంది. ! లోక్‌పాల్ కూడా ఒక మెదడుతోనే ప్రారంభమై ప్రజాగర్జనతో ప్రభంజనమై పార్లమెంటునే కదిపింది.! అవినీతిని ప్రశ్నించింది. ! మీలాంటి చీడపురుగులు ఈ సమాజంలో ఉంటానికే వీల్లేదు.! ఎంతోమంది చావుకి కారణమైన మీచేత ప్రతి చావుకి బదులు చెప్పిస్తా..!

(భద్రన్న జారుకుంటుంటాడు)

శ్రీను: యాడికన్నా ఎల్లేది..!

భద్ర : చెయ్యినరకమని నీతో చెప్పినాన్రా..! పిల్లని కిడ్నాప్ చేసి బెదిరించ మన్నా..! నువ్వేందిరా ఇట్టాచేసినావ్.! ఓరి జర్నలిస్టో..! దీంతోనాకు సంబంధంలే..!

శ్రీను: ఏందన్నా..! కథ క్లైమాక్స్ కొచ్చినాంక ఇట్టా మాట్టాడతన్నా..! (శ్రీను సీరియస్ గా మాలతి వైపు అడుగులేస్తాడు. మాలతి మెల్లె మెల్లెగా వెనక్కి వెళ్ళి దశరథ్ ని తగులుతుంది. శ్రీను చాలా శాంతంగా) తల్లీ..! (శ్రీను ప్రవర్తనకి అందరూ ఆశ్చర్యపోతారు) నా బిడ్డ నాకేమన్నా చెప్పమందా అని అడిగినవ్..! సెప్పమనుండే..! మరో జన్మంటా వుంటే మీ ఇంట్లోనే, నీ కడుపునే పుట్టాలని కోరుకునుండె.! నీ బిడ్డకు హ్యాడ్సఫ్, ఒక్క నీ బిడ్డకే కాదు... నీకు, నీకు, నీ కుటుంబానికే హ్యాడ్సఫ్.! ఈ గలీజ్ కొడుకు చేసిన ప్రయోగాల్లో నా భార్యకూడా చనిపోయుండె.! గాదినమే ఈణ్ణి టుకడటుకడలెక్క నరికి చంపెటోన్ని..! కానీ నా పెండ్లంలెక్కే నా ఈదిలో మస్తుమంది ఇసొంటోల్లు సేసిన ప్రయోగాలకు కాళ్ళు పోగొట్టుకొని,చేతులు పోగొట్టుకొని కుక్కిమంచంలో పది బతకలేక చస్తూ, చావుతోని పోరాడుతుండ్రు. చంపాల్సిందీన్ని కాదని గాదినం డిసైడైయుంటి.! మనుషుల ప్రాణాలతో ఇసొంటాట లాడే లసుకోరు కొడుకుల్ని జనం ముంగట బెట్టి పుంగి బజాయించెటోడు ఒక్కడు రాబోతాడాని సోంచాయించినా.! జర్నలిస్టుసారూ...! మీఅసొంటి జర్నలిస్టుకోసం మస్తుట్రైచేసినా.! ఈనిగురించి పేపర్లో రాయండ్రా అంటే..! ఈడు మస్తు యాడ్లిస్తడంట.! ఇసొంటోని గురించి బ్యాడ్‌గా రాస్తే తమ పత్రికలు నడసవంట.! నీగురించి ఇనున్నా సాబ్.! నువ్వెంతలెక్క నిలబడతవని జర టెస్ట్‌చేసినా...! గీ భద్రన్నగాని అడ్డాలకొచ్చినంక కరెంట్ ఫెన్సింగ్ దాటతంటే కరెంట్ కట్‌చేసినా.. నువ్వెటురావాల ఎప్పటికప్పుడు ఎస్ఎంఎస్‌ల రూపంలో అలర్ట్‌చేసిన. ! కావాలనే నిన్ను సిసికెమరాలకి ఇరికిపిచ్చా.! ఆకరికి నీ బిడ్డ సెయ్యి చూసినంక భీ కదల్లే..! జరిగే అన్యాయాన్ని ఎదిరించేందుకు పెన్ను పట్టుకొని ముందుకొచ్చిన వీరుడివి నువ్వు. హ్యాడ్సఫ్. అమ్మా..! నీ పట్ల గలీజోనిలెక్క ప్రవర్తించినా.! నన్ను మాఫ్‌చెయ్యమ్మా..! గీ సెయ్యి నీ బిడ్డది కాదు.! ఈ గలీజుకొడుకు చేసిన ప్రయోగాల్లో బలైనో ఆడకూతురిది.! (భద్రన్నని శ్రీను ఒక్కతోపు తోస్తాడు. భద్రన్న టీపాయ్‌మీద పడతాడు. అక్కడే ఉన్న కత్తితో శ్రీనుని పొడుస్తాడు. పారిపోబోతున్న భద్రన్నని భరద్వాజ పట్టుకుంటాడు.)

జర్నలిస్ట్ సాబ్..! ఇంతమంది సావులకి కారణమైన ఈడికి శిక్షపడేలా చేయండి. ఇసొంటి గలీజుకొడుకుల్ పుట్టుకురానికి భీ దడసాలె.! అసొంటి శిక్షలుంటే వాటిని ఏపించండి.! మాటియ్యిసారూ..! అలా సేత్తానని మాటియ్యి.!

(దశరథ శ్రీను చేతిలో చెయ్యివేస్తాడు. శ్రీను కన్నుమూస్తాడు. భరద్వాజ భద్రన్నని గట్టిగా పట్టుకుంటాడు. భద్రన్న పారిపోటానికి ప్రయత్నిస్తుంటాడు.)

దశ : మాటిస్తున్నాను శ్రీను.! నీ ఒక్కడికే కాదు..! యావత్ భారతీయులకీ మాటిస్తున్నాను.! నాదేశ వ్యవస్థలో లోపాల్ని కడిగేయటానికి, సమాజంలో పాపాల్ని తరిమేయటానికి, నిద్రపోతున్న యువ వ్యవస్థని, నిద్రపోతున్నట్లు నటిస్తున్న మేధావి వ్యవస్థని క్షరంకాని అక్షరాలనే కొరడాలతో కొట్టి ఉత్తిష్టభారతి నినాదంతో పట్టిన మత్తునుండి మేల్కొలుపుతాను. ప్రశ్నించటమే మరిచిన ప్రజలకి ప్రశ్నించటం నేర్పిస్తాను. యావత్ భారతావని ఉత్తిష్టమైతే భద్రన్నలాంటి వెధవలెలా పుట్టుకొస్తారో చూస్తా..! లక్ష్యశుద్ధి, సామాజిక స్పృహ, నిబద్ధత భావసారూప్యం ఉన్న బాధ్యతాయుత పౌరులను ఒక్కచోటికి చేరుస్తా..! వివిధ సంఘాలుగా ఏర్పాటుచేస్తా..! ఒక సంఘం నేతల పనితీరుపై ప్రోగ్రెస్ కార్డులు తయారు చేస్తుంది. ఒక సంఘం ఓటు హక్కు ప్రాధాన్యతను పౌరులకు వివరిస్తుంది. ఒక సంఘం అవినీతి భాగోతాల్ని బట్టబయలు చేస్తుంది. ఒక సంఘం పాలకులకు పాలనాపాఠాలు బోధిస్తుంది. నిలదీసేదొకటి, నిప్పులతో కడిగేదొకటి. ప్రశ్నించటం నేర్పటమే ప్రధానోద్దేశంగా పనిచేసేదొకటి, హక్కుల సాధనకోసం పోరాటాలు చేసేదొకటి, బాధ్యతతో మెలిగేలా హెచ్చరించేదొకటి ఇలాంటి సంఘాలను ఏర్పాటు చేస్తా..! ఎన్నిసంఘాలున్నా... వేటి లక్ష్యాలు వాటివైనా...! అంతిమ ప్రయోజనం మాత్రం ప్రజాస్వామ్య పరిరక్షణే..! ప్రజాప్రయోజనాల ముసుగులో జనాన్ని దోచేస్తూ వాళ్ళకు తెలియకుండా జేబులు కొట్టేస్తున్నా మాట్లాడని ప్రజల్ని, తమ ప్రాణాల్ని సైతం కబళిస్తున్నా పట్టించుకోని నా దేశ ప్రజల్ని ఉత్తిష్టభారతి అంటూ మేల్కొలుపుతున్నాను.! వాణ్ణి వదిలెయ్యండి నాన్నా..! వాడి సంగతి జనం చూసుకుంటారు.! రేయ్ భద్రన్నా.. న్యూస్ ఆగదు..! నా గేటుదాటేలోగా నువ్వెక్కడికెళ్ళాలో అక్కడికే వెల్తావ్.! (పోలీస్ వ్యాన్ సైరన్ వినిపిస్తుంది. అందరూ ఫ్రీజ్ అవుతారు.)

శుభం

హర్షక్రియేషన్స్, విజయవాడ

# స్వర్ణకమలాలు

(సాంఘిక నాటిక)

దర్శకత్వం : కత్తిశ్యాంప్రసాద్

**పాత్రలు - పాత్రధారులు**

| | |
|---|---|
| 1. శ్రీహర్ష | కత్తి శ్యాంప్రసాద్ |
| 2. కమల | అమృతవర్షిణి |
| 3.పార్ధసారధి(పార్వతమ్మ) | రమేష్ |
| 4.నందగిరి | విజయసాగర్ |
| 5. సంగీతం | వై.సాయితేజ |
| 6. రంగాలంకరణ, రంగోద్దీపన | అనిల్ |

## నాటిక రచన వెనుక

ఈ నాటిక రచన చేయటానికి వెనుక ఏదైనా మంచి శృంగార భరితమైన నాటిక చేయాలని అనిపించింది. అందునా తెలుగు నాటకంలో ఈ మధ్య కాలంలో శృంగారభరితమైన నాటికలు వచ్చినట్లు అనిపించలేదు. అయినా కూడా శృతిమించని శృంగారం కావాలి. అంతటితో అయిపోదు కదా.. అన్ని రసాలూ మేళవింపే నాటకం. అలా ఆలోచిస్తున్న సమయంలో రచయిత పాత్ర హీరో అయితే.. అన్న ఆలోచన వచ్చింది. ఎంతో పెద్ద పేరున్న రచయిత దీనికి ఆపోజిట్ గా చదువురాని అమ్మాయి హీరో ఇన్.. వీరి మధ్య శృంగార సన్నివేశాలు.. కాస్తంత హాస్యంగా... రొమాంటిక్ గా వుంటూ వుండాలి. మరి హీరో కి కష్టాలు రావాలంటే బయటి నుండన్నా రావాలి.. లేదా తన గొయ్యి తనే తవ్వుకోవాలి అని ఆలోచించి చదువురాని భార్యకి చదువు నేర్పితే అన్న ఆలోచన. కొందరికి చదువు సంస్కారాన్ని నేర్పిస్తుంది.. మరికొందరికి అహంకారాన్నిస్తుంది. శ్రీహర్షకి అహంకారం ఎక్కువైంది.. సహజంగానే నిష్కలమ్మషమైన కమల సంస్కరించబడింది. ఇక్కడ రెండు విభిన్నధృవాలయ్యారు. రెండు విభిన్న ధృవాలు ఆకర్షించ బడతాయి అంటుంది సైన్స్.. కానీ ఇక్కడ వికర్షణ కూడా వుండాలంటే ఇద్దరినీ ఏకం చేసే పాయింట్ వుండాలి. అందుకే ఇద్దరూ నవలా రచయితలు అయ్యారు.

ఈర్ష్య, అసూయ, ద్వేషం వంటి దుర్లక్షణాలు బుద్ధిని మందగింపచేస్తాయి. అలా తన బుద్ధి మందగింపచేయటంతో శ్రీహర్ష రచనలు అమ్ముడు పోవటంలేదు.. దీంతో అతనిలో అహం మరింతగా దెబ్బతిన్నది.

స్వచ్ఛమైన మనసున్న కమలకి పాఠకలోకం బ్రహ్మరథం పట్టింది. ఇది కూడా సహించలేనంతగా శ్రీహర్ష దిగజారిపోయాడు. ఇక్కడ హీరో దిగజారిపోవటం, హీరోఇన్ హైలెట్ అవ్వటంలో కావలసినంత నాటకీయత సంతరించుకుంటుంది.

తనలో తనే రగిలిపోతున్న అగ్నిపర్వతం ఏదోరోజు బద్దలవ్వాలి.. అలా బద్దలైనప్పుడే దానిలో వుండే విలువైన ఖనిజాలు బయటికి వచ్చి సంస్కరింప బడతాయి. అన్న సూత్రాన్ని అనుసరించి శ్రీహర్షను బద్దలు కొట్టాలని ఆలోచించి ఎప్పటి నుండో అతను కోరుకుంటున్న పురస్కారం అతనికి కాకుండా కమలకి వస్తే అన్న ఆలోచన వచ్చింది. అంతే కథ క్లైమాక్స్ కి చేరింది. శ్రీహర్ష హృదయంలో అప్పటి వరకూ దాచుకున్న అరిషడ్వర్గాలు ఒక్కసారిగా భగ్గుమన్నాయి. అతనిలో దాగి వున్న బాధ, కుళ్ళు అన్నీ కూడా బయటికి వెళ్ళిపోయాయి.

బద్దలైన అగ్నిపర్వతం నుండి వెదజల్లబడిన లావా కొంతకాలానికి ప్రకృతి చల్లబరిచినట్లు కమల (స్త్రీ ప్రకృతి స్వరూపిణి) తన ప్రవర్తనతో అతన్ని శాంతింపచేస్తుంది. శ్రీహర్ష ద్వారా సంస్కరించబడిన కమల తనే తన ప్రవర్తనతో శ్రీహర్షని సంస్కరించాలని నిర్ణయించుకుంటుంది. అది ప్రకృతి ధర్మం. తన ధర్మాన్ని తను నిర్వర్తిస్తుంది.

అరిషడ్వర్గాలు తన నుండి బయటికి వెళ్ళిపోయినాక ఇంకేముంటుంది.. నిష్కల్మషమైన మనసు.. అలాంటి నిష్కల్మషమైన మనోకమలం స్వర్ణ కమలం అవుతుంది. సహజంగానే కమల స్వర్ణకమలం. ఇప్పుడు శ్రీహర్ష కూడా స్వర్ణకమలం అయ్యాడు. కనుక ఇద్దరూ స్వర్ణకమలాలై నిలబడాలి. అని ఆలోచించి నేను రాసిన కథ స్వర్ణకమలాలు. ఈ కథ ప్రతిలిపి లో పబ్లిష్ అయింది. దానిని ఎవికె ఫౌండేషన్ వాళ్ళు 2023 కథా నాటికల పోటీలకోసం నాటకీకరణ చేయటం జరిగింది. ఎంపికై అనేక ప్రదర్శనలకు నోచుకుంది.

# స్వర్ణకమలాలు

## కథాసంగ్రహం

శ్రీహర్ష ఒక పేరుమోసిన నవలా రచయిత. అతను జ్ఞానపీట్ పురస్కారం పొందాలని ప్రయత్నిస్తుంటాడు. ఏవో కారణాలవల్ల అతనిని ఆ పురస్కారం వరించదు. కానీ ఎప్పటికైనా ఆ పురస్కారం పొంది తీరాలన్నది అతని తపన. అందుకు తగిన విధంగానే రచనలు కొనసాగుతుంటాయి. శ్రీహర్ష తన ఊహల్లో కథానాయికగా వున్న అమ్మాయిని అనుకోని రీతిలో నిజజీవితంలో కలుసుకుంటాడు. ఆమెని పెళ్ళిచేసుకుంటాడు. తన ఊహల్లో నవలానాయికగా ఉన్న ఆమెకి రకరకాల పేర్లు పెట్టుకున్నా నిజజీవితంలో ఆమె పేరు కమల. కమలకి చదువు లేదన్న సంగతి మొదటిరాత్రి రోజు గమనిస్తాడు. అటుపై ఆమెని కొన్నిరోజుల్లో చదువు నేర్పి సంస్కరిస్తాడు.

పార్ధసారధి అనే ప్రకాశకుడు శ్రీహర్ష రచనలను ప్రచురిస్తూంటాడు. ఒకసారి శ్రీహర్ష పార్ధసారధికి కాకుండా వేరేవారికివ్వటంతో పార్ధసారధి గొడవపడతాడు. వారం రోజుల్లో తన భర్తతో మంచి రచన చేయించి ఇస్తానని కమల అతనికి నచ్చచెబుతుంది. పార్ధసారధి వెళ్ళిపోయిన తర్వాత కమలతో రచన చేయించాలని నిర్ణయించుకుంటాడు శ్రీహర్ష. అలా కమల చేసిన రచనే "స్వర్ణకమలాలు" నవల. ఆ నవలని కమల రాసిందని తెలియటంతో పార్ధసారధి పొగడ్తలతో ముంచెత్తుతాడు. ఎప్పుడూ శ్రీహర్ష తీసుకునే రెమ్యునరేషన్ కంటే ఎక్కువ మొత్తం ముట్ట జెబుతాడు పార్ధసారధి. అంతటితో ఆగకుండా వేర్వేరు భాషల్లోకి కూడా నవలను అనువదించుకోటానికి హక్కులు కూడా తీసుకుంటాడు. అప్పటి వరకూ శ్రీహర్ష రచనలకు అలాంటి గౌరవం దక్కి వుండలేదు. దీంతో శ్రీహర్షలో కమలపై ఈర్ష్యాభావం మొదలవుతుంది. అక్కడి నుండి కథ అనేకానేక మలుపులు తిరిగి ఎలా ముగుస్తుందో.. నాటిక మొత్తం చదివి తెలుసుకుంటారని ఆశిస్తున్నాను.

# స్వర్ణకమలాలు

## దర్శకత్వం : కత్తి శ్యాంప్రసాద్

(దూరంగా రేడియో వినిపిస్తుంటుంది. ఆకాశవాణి వివిధభారతి ప్రసారాల్లో చివరిగా ఏకవీర చిత్రంలోని ప్రతీరాత్రీ వసంత రాత్రీ గీతం.. రచన సి.నారాయణరెడ్డి. సంగీతం కె.వి.మహదేవన్.. పాట వస్తుండగా.. లైట్స్ వెలిగాయి.)

(శ్రీహర్ష మంచంమీద పడుకొని వున్నాడు. అగరొత్తుల వాసనతో రూం అంతా ఘుబాళిస్తోంది. ఏవో కూనిరాగాలు తీస్తున్నాడు. ఉన్నట్లుండి లేచి కూర్చొని తనలో తాను మురిసిపోతూ...)

శ్రీ : నా ఊహల్లో వుండి.. నా రచనలతో ప్రాణం పోసుకొని.. ఎన్నో విలువైన సందేశాలను సమాజానికి పంచిన కావ్యనాయకి... తనపేరేదో తెలియక అనేక కథల్లో అనేకమైన పేర్లతో పిలిచిన నా కావ్యసుందరి ఈరోజు నిజజీవితంలో అదే రూపంతో కమల అనేపేరుతో నాకు భార్యగా రావటం యాదృచికమో.. లేక దైవలిఖితమో అర్థంకావట్లేదు. మత్తెక్కిస్తున్న ఈ ధూపం.. మైమరపిస్తున్న ఈ విరుల సువాసనలు.. వీచే చల్లనిగాలి.. బయట విరగకాస్తున్న పండువెన్నెల ఒక కవికి ఇంతకంటే సౌందర్యోపాసనచేసే వాతవరణం ఎక్కడదొరుకుతుంది. నా కలలసుందరితో తొలి రేయి జరుగుతుందని కనీసం నా ఊహలో కూడా అనుకోలేదు.. నా అంత అదృష్టవంతుడు ఈ ప్రపం చంలో వుంటాడా..? ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగిన తను నా ఊహల్లోకి రావటమేమిటి? తననే నేను కథా నాయికగా వర్ణిస్తూ రాయటమేమిటి? ఇది కలా.. లేక నిజమా అన్నది ఇప్పటికీ నమ్మబుద్ధి కావట్లేదు.

(ఇంతలో గదిలోకి కమల వచ్చింది. కమలని చూస్తూనే లేచి నిలబడ్డాడు. కమల సిగ్గుపడుతూ పాలగ్లాసు పట్టుకొని అలాగే నిలబడిపోయింది. శ్రీహర్ష దగ్గరకి వెళ్ళి కమలని నడిపించుకుంటూ మంచం దగ్గరికి వచ్చాడు. పాలగ్లాసు చేతికి అందించి వంగి శ్రీహర్ష పాదాలు పట్టుకుంది. శ్రీహర్ష గ్లాసు టేబుల్ మీద పెట్టి కమలని పైకిలేపాడు. కమలతో..)

శ్రీ : ఇలాంటివి నాకు ఇష్టముండవు. సంసారమనే బండిని లాగటానికి భార్య, భర్త ఇద్దరూ కూడా రెండు ఎద్దుల్లా వుండాలనే కాడిమాను వాడతారు. దానికి మంగళప్రదమైన సూత్రాన్ని అనుసంధానిస్తూ పాలతో అభిషేకిస్తారు. దంపతులుగా మనల్ని దీవిస్తారు. అప్పుడు మనిద్దరం సరిసమానులమైనప్పుడు ఈ పాదనమస్కారం అనే సంస్కారానికి అర్థమేంటి?

క : అయన్నీ నాకు తెలవదండే.

శ్రీ : తెలవదా.. నువ్వు చదువుకోలేదా..?

క : మూడుదాకా సదివానండీ.. ఆతర్వాత పేదరికం వల్ల పనికిపోవాల్సొచ్చింది.

శ్రీ : నీతప్పేంలేదు.. నిన్ను చూడగానే నా ఊహాసుందరి కళ్ళముందు

సాక్షాత్కరించిందనే ఆవేశంలో నీ గురించి ఏమీ తెలుసుకోకుండానే వివాహం చేసుకున్నాను. నీ గురించి చెప్పు.

క : సెప్పుకునేంత నాకాడేముంటది. నేను మూడు సదు తున్నప్పుడే నాయన పాముకరిసి వైద్యం అందేలోపే సచ్చిపోయాడు. అప్పటి నుండి అమ్మతో కలిసి నేను పొలం పనులకి పోతా వుండా.. ఇద్దరు మడుసులం పనిసేత్తేనే ఇల్లు గడిసిద్ది.. ఈమద్దే అమ్మ కూడా గుండెల్లో నెమ్ముసేరి సచ్చిపోయింది. ఒక్కదాన్నే పత్తిసేలో పత్తి తీత్తుంటే మీరొచ్చారు దొరగారూ.. పెల్లిసేసుకుంటావా అని అడిగారు.

శ్రీ : ఆక్షణంలో నీకేమనిపించింది కమల..

క : ఈ దొరగారికి మురికి పట్టిన బట్టల్లో వున్న నేను నచ్చటమేంది? ఏలాకోలమాడతన్నారా అని ఆలో సిచ్చా.. కానీ మీ మాటల్లో సొచ్చత కనిపించింది. మీ కల్లలో నిజాయితీ కనిపిచ్చింది. ఎందుకో మీకు నేను నిజంగానే నచ్చానేమో అనిపిచ్చింది. మా యమ్మ పోతాపోతా నన్ను ఒక అయ్యసేతుల్లో పెట్టి పోవాలే అనేది. అమ్మ పోయి ఏడాది కాకుండానే మీరొచ్చి పెల్లి సేసుకుంటాననేసరికి మా యమ్మ కోరిక కూడా తీరుద్దిలే అనుకున్నాను. పెల్లికి ఒప్పుకున్నాను.

శ్రీ : కనీసం నాపేరైనా తెలుసా నీకు.

క : తెలవదు.

శ్రీ : నాపేరు శ్రీహర్ష.. నేనేం చేస్తానో తెలుసా.?

క : తెలవదు..

శ్రీ : నేను పేరుమోసిన రచయితని. జ్ఞానపీఠ్ పురస్కారం త్వరలో అందుకోబోతున్నాను. ఓహ్.. నీకు అవన్నీ తెలీవుకదా.. భారత సాహితీ పురస్కారాల్లో అదొక గొప్ప పురస్కారం. నాలాంటి కవిపండితుల్ని గుర్తించి ఇచ్చే గౌరవం. అదిసరే.. ఇంతకీ నన్నెందుకు పెళ్ళి చేసుకున్నావో తెలుసా?

క : మీకు ఏకట్టం కలక్కుండా సుఖపెట్టటానికి. మీరు సెప్పిందల్లా సెయ్యటానికి.

శ్రీ : అయితే నేను చెప్పినట్లు చేస్తావా?

క : ఊ...

శ్రీ : చదువుకుంటావా?

క : ఈ వయసులోనా..

శ్రీ : చదువుకోటానికి వయసుతో పనిలేదు.

క : అమ్మో నేను బడికి పోను. పంతులుగారు.. కొడతారు.

శ్రీ : పోనీ నేనే నీకు చదువునేర్పుతాను.

క : ఇప్పుడు నాకు చదువు అవసరమా దొరగారూ..

శ్రీ : ముందు నువ్వు నన్ను దొరగారూ అంటం ఆపేయాలి. యావండీ అనో.. లేదా

శ్రీహర్ష అనో పిలువు.

క : అమ్మో.. మీలాంటి పెద్దోళ్ళని పేరుపెట్టి పిలిత్తే ఏమైనా వుందా..? యావండీ.. అనే పిలుత్తాను.

శ్రీ : సరే.. అలాగే కానీ.. నీకు రేపటి నుండి చదువు నేర్పిస్తాను.

క : ఈరోజు సానా ముక్కెమైన రోజనీ.. ఈ గదిలో మాట లుండకూడదనీ.. నన్నీ గదిలోకి పంపుతా.. పక్కింటి పెద్దావిడ సెప్పింది.. తమరేమో సదువు సదువు అని మాట్టాడతన్నారు.

శ్రీ : సరే.. మాటలు కాకుండా మరేం చెయ్యాలని చెప్పిందేంటి ఆ పెద్దావిడ..

క : నువ్వు గదిలోకెల్లి పాలగ్లాసు మీ ఆయన సేతుల్లో పెట్టి కాల్లట్టుకో.. ఆతర్వాత అంతా ఆయనే చూసుకుంటాడు.. ఆయనేం చేసినా ముందు కొంచెం బాధగా వుంటుంది.. భరించు.. ఆ తర్వాత నీకు ఆయన జీవితం మొత్తం గుర్తుండిపోయేలా మంచి బహుమతినిత్తాడు అని సెప్పింది.

శ్రీ : (చిన్నగా నవ్వి) అంతేనా ఇంకేమైనా చెప్పిందా...

క : మా ఆడాళ్ళ ఇసయాలు సానానే సెప్పింది. అయన్నీ మీరు అడగ్గూడదంటా.. నేను మీకు సెప్పకూడదంటా.. నాకు నిద్దరొత్తుంది యావండీ.. ఆ బహుమతేదో ఇత్తే పడుకుందాం... తెల్లారగట్టే లేసి సెయ్యాల్సిన పనులు సానానే వుండాయ్...

శ్రీ : (నవ్వుకుంటాడు) అవునా.. సరే.. పడుకో.. (కమల కింద పడుకుంటుండగా...) అక్కడెందుకు.. ఇక్కడ.. మంచం మీద పడుకో..

క : పెల్లిసేసుకొని నాకు బతుకియ్యటమే గొప్ప.. మీ పక్కన పడుకుంటే నాకు పుట్టగతులుంటాయా... వద్దు యావండీ..

శ్రీ : (ఈసారి పెద్దగా నవ్వాడు..) నేను నీకు బతుకిచ్చానా..? ఈ ప్రపంచంలో ఎవ్వరూ.. ఎవ్వరికీ బతుకునియ్యరు.. ఎవరి బతుకు వారిదే.. కాకపోతే మనిద్దరి జీవితాలూ ఒకటయ్యాయి. అవన్నీ ముందు ముందు నీకు అర్థమయ్యేలా చెప్తాను.. నామాట వినాలి కదా.. వచ్చి మంచంమీద పడుకో... పెద్దావిడేం చెప్పింది.. నేనేం చేసినా కాదనద్దని చెప్పిందిగా..

క : సెప్పింది..

శ్రీ : అయితే రా మరి.. (ఓడను జరిపే ముచ్చట గనరే అనే త్యాగరాయ కృతి వయొలిన్ మీద ప్లే అవుతుంది.. లీలగా.. అంటూ ఆమెని మంచంమీద కూర్చోపెట్టాడు.. ఆమెని వెనక్కి పడుకోబెడుతుండగా...)

## లైట్స్ ఆఫ్
## సెంటర్ స్పాట్ ఆన్

(వయొలిన్ బిట్ కంటెన్యూ అవుతునే వుంది.. శ్రీ హర్ష మంచంమీద నిద్రపోతున్న తన

భార్యనిచూస్తూ..)

శ్రీ : రాతిరంతా నిదుర కొదిగి.. ఒదిగి వున్నవి కనుల గువ్వలు.. వెలుగు వేలితో గూటితలుపులు.. తట్టిలేపెను ఉదయభానుడు. (వయోలిన్ బిట్ ని ఓవర్ ల్యాప్ చేస్తూ.. దూరంగా రేడియోలోంచి వందే మాతరం.. అంటూ వస్తుండగా.. కమల ఒళ్ళు విరుచుకుంటూ లేచి కూర్చుంది. ఆమెనే చూస్తూ. ) ఒళ్ళు విరుచుకొని లేచిన కళ్ళకోమలివి... (తననే కన్నార్పకుండా చూస్తున్న భర్తని చూసి సిగ్గుపడుతూ.. చెదిరిన పైటని సరిచేసుకుంది. ఆమె చెదిరిన బొట్టుని ఇతను సరిచేశాడు. లేవబోతుండగా చెయ్యి పట్టుకొని ఆపాడు.. డైలాగ్ చెప్తూ ఆమెకి చేయాల్సినవన్నీచేస్తుంటాడు.) రెప్ప రెక్కల రెపరెపలతో.. కలలవేటకి ఎగురుతుంటే, మసకసందెల మేలిముసు గున మోము మిసమిసలు తొణుకుతుంటే.. పసుపు పచ్చని నొసట సిరులై అలరుచున్నవి కురుల చీకటి.. కిరణమాలిని స్వాగతించే రమణి ప్రకృతివా.. తరుణివై నను పలకరించే ధరణి ఆకృతివా... (ఆకాశవాణి విజయవాడ కేంద్రం ఈరోజు 1970వ సంవత్సరం జనవరి 26 ఆదివారం.. సమయం ఉదయం 5గంటల 30 నిమిషాలు....)

క : సెయ్యి వదిలిపెట్టు యావండీ... కసువు సిమ్మాల.. ముగ్గులెట్టాల.. మీకు కాపీ పెట్టాల..

శ్రీ : వాటన్నింటికంటే ముందు లేవగానే మొగుడికి ముద్దుపెట్టాలి..

క : ఆపెద్దావిడ కాల్లకి దన్నం పెట్టమందే కానీ.. దీని గురించి చెప్పలేదే..

శ్రీ : నామాట వినమని చెప్పిందికదా.. మరి నేను చెప్పినట్టు వినాలికదా... ఇవ్వమంది ముద్దే కదా...

(అంటూ లేచిన ఆమెని తిరిగి మంచంమీదికి లాగేశాడు.. )

## స్పాట్ ఆఫ్

## 2వ సీన్

## రైట్ స్పాట్ ఆన్

సాకీ మొదలైంది..

**యాకుందేందు తుషార హార ధవళా యా శుభ్ర వస్త్రాన్వితా**
**యా వీణావరదండ మండితకరాయా శ్వేత పద్మాసనా**
**యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిదేవై సదా పూజితా**
**సామాంపాతు సరస్వతీ, భగవతీనిశ్శేష జడ్యా పహాః**

(కమల కూర్చొని పుస్తకాలు చదువుతోంది.. శ్రీహర్ష ఆమెకి అన్నీ చెబుతున్నాడు.. ఆమె శ్రద్ధగా నేర్చుకుంటోంది.. మూడవ లైను వచ్చేసరికి మూడు స్పాట్ లు ఒకేసారి ఆన్ అయ్యాయి.. కమల ఆ స్పాట్స్ లో నడుస్తూ పుస్తకాలు చదువుతుంటుంది..3వ లైను నుంచి శ్రీహర్ష కమలతో వుండడు..)
(జనరల్ లైట్స్ ఆన్ అయ్యాయి.. ధూపంతో ఇల్లు వుంటుంది. తలంటి పోసుకున్నట్లుగా కమల తలకి గుడ్డకట్టుకొని వేదికమీదికి వస్తుంది. శ్రీహర్ష రచనలు చేసే బల్ల, కుర్చీదగ్గరికి వస్తుంది..

అక్కడున్న వాటిని అందంగా సర్దుతుటుంది. అంతలో శ్రీహర్ష టవల్ తో తల తుడుచుకుంటూ వచ్చి వెనుకగా ఆమెని కౌగలించుకుంటాడు. ఆమె ఉలికిపాటుగా చూసి విడిపించుకుంటుంది. శ్రీహర్ష తన నుండి వెళిపోతున్న కమల చెయ్యి పట్టుకొని ఆపాడు.. ఆమెకి తనే దగ్గరగా జరుగుతూ.. కళ్ళల్లోకి కళ్లు పెట్టి చూస్తుంటే... కమల అడుగుతుంది...)

క : ఏంటలా వింతగా చూస్తున్నారు..

శ్రీ : ఎంత చూసినా తనివితీరని నీ ముఖాన్ని ఎంతసేపైనా ఇలాగే చూస్తుండాలనిపించటం వింతెలా అవుతుంది. నువ్వడుగుతుంటే నాకూ వింతగానేవుంది.. ఇంత అందాన్ని ఆదేవుడు నాకోసమే సృష్టించాడా అని..

క : మరిప్పుడే ఏం చేద్దాం..

శ్రీ : భోం చేద్దాం..

క : ఇంత పొద్దునా..అదీ పూజకూడ కాకుండా...

శ్రీ : పూజ చెయ్యట్లేదని ఎవరన్నారు కమలా? అనుక్షణం నేను చేస్తోంది సౌందర్యదేవతోపాసనేగా.. శృంగార గంగా తరంగాలలో మునకలేస్తూ.. నిత్యం ఈ సౌందర్య దేవతా మూర్తిని నా మనోఫలకంపై ధ్యానిస్తూ... అంగాంగ వర్ణనల ఆహాఓహో మంత్రాలతో అర్చిస్తూ... ఆలింగన చుంబనాలతో అభిషేకిస్తూ... అధరసాగర మధనం నుండి ఆవిర్భవించిన అమృతాన్ని తీర్ధజలంగా స్వీకరిస్తూ...

క : చాలు చాలు...

శ్రీ : దేవత అనుగ్రహించే అందాల్ని భోంచేద్దామని నా ఉద్దేశం..

క : అవునా..ఆ దేవతకిప్పుడు వరాలిచ్చే తీరికలేదు.

శ్రీ : మరీ భక్తుని ఆకలో....

క : ఉప్మా ప్రసాదం చేశాను. వచ్చి ఆరగించండి..

శ్రీ : మరి అందాలో..

క : పొందాలంటే రాత్రిదాకా ఆగాల్సిందే... (అంటూ ముద్దుగా ముక్కునిపట్టుకొని లాగి నవ్వుతూ లోపలికి వెళ్ళిపోయింది.. ఆమె వెళ్ళినవైపే నిరాశగా చూస్తూ...)

శ్రీ : (గోముగా...) కమలా.. కమలా.. ఏం పెట్టావయ్యా దేవుడా.. ఈ ఆడాళ్ళల్లో.. కింగుని కూడా కొంగున కట్టేసుకు తిరుగుతారు. (ఇంతలో పార్ధసారధి లోపలికి వస్తాడు..)

పా : నమస్తే శ్రీహర్షగారూ...

శ్రీ : ఓ.. నమస్తే.. పార్ధసారధిగారూ... ఏంటిలా వచ్చారూ...

పా : మీరు చేసిన పని నాకు నచ్చలేదు సార్..

శ్రీ : ఏపని..

పా : ఏపనీ నచ్చలేదు..

శ్రీ : అబ్బా విషయానికిరండీ..

పా : విషయం తేల్చుకుందామనే మీ ఇంటికి వచ్చాను.

శ్రీ : ముందలా కూర్చొని మాట్లాడండి. (పార్ధసారథి కూర్చున్నాడు..) ఇప్పుడు చెప్పండి.. మీకు నచ్చని పని నేనేం చేశానో..

పా : మీ నవలలు, మీ కథలు ఇన్నాళ్ళూ పబ్లిష్ చేసుకుంటూ వచ్చింది ఎవరు? నేను. కానీ మీ కొత్త నవల రాకాచంద్రులు పబ్లిషింగ్ ఎవరికిచ్చారు? మానస పబ్లికేషన్స్ వాళ్ళకిచ్చారు. ఇదేమైనా న్యాయంగా వుందా చెప్పండి..

శ్రీ : అదా విషయం..

పా : అంత తేలిగ్గా తీసుకుంటారేంటిసార్.. ఎంతో మంది పెద్దపెద్ద రచయితలున్న ఆరోజుల్లో కొత్తగా వస్తున్న మిమ్మల్ని గుర్తించింది ఎవరు? నేను. మీ రచనలన్నీ జనాల్లోకి తీసుకెళ్ళింది ఎవరు? నేను. ఈ రోజు మీరు ఒక ఉన్నతమైన నవలా రచయితగా ఎదగటానికి కారణం ఎవరు సార్..? నేనేగా... నేనే కనుక ఆరోజు మీ రచనలు పబ్లిష్ చెయ్యకపోతే.. వాటిని మార్కెటింగ్ చెయ్యకపోతే ఈరోజు మీరెక్కడుండేవాళ్లు సార్..

శ్రీ : మీరు చెప్పినవన్నీ నిజాలేనండీ.. ఆ రోజుల్లో నన్ను రచయితగా గుర్తించింది మీరే.. కానీ ఈ రోజు నేనింతటి వాడిగా వుండటానికి కారణం మాత్రం మీరు కాదు. ఎందుకంటే నాలోని టాలెంట్ ఈ రోజు నన్ను ఈ స్థానంలో నిలబెట్టింది. ఇంతమంది అభిమానుల్ని సంపాదించి పెట్టింది...

పా : అంటే.. అంటే .. ఇందులో నా పార్టిసిపేషన్ లేదంటారా.?

శ్రీ : లేదని నేను అనలేదండీ.. నేను ఎదగటానికి తొలిపునాది వేసింది మీరే.. మొదటి రెండు నవలలు ఫెయిల్ అయినా మూడోదానికి అవకాశం కల్పించిన మహానుభావులు. అక్కడినుండేగా నేను నవలా రచయితగా బిజీ అయింది.

పా : అది గుర్తుందిగా.. మరి మీరు చేసిన ఈపనికి అర్ధమేంటిసార్...

శ్రీ : మీరు నాపట్ల ఏం చేశారో.. నేనూ మానస పబ్లికేషన్స్ వారి విషయంలో అదే చేశాను. పాపం లాస్ లో నడుస్తోంది. సరైన నవల దొరక్క పబ్లికేషన్స్ మూసేసే పరిస్థితిలోకి వెళ్ళిపోతే.. ఆయన వచ్చి నన్నుబ్రతిమాలుకున్నాడు.

పా : కానీ ఆ వ్యక్తే మిమ్మల్ని మొదట్లో మీవి రచనలే కాదన్నాడు. అది గుర్తుందా...?

శ్రీ : అలాంటివన్నీ గుర్తుపెట్టుకోకపోతే ఈ రోజు నేను ఇంత బాగా రాయగలిగేవాడినంటారా పార్ధసారధిగారూ..

(ప్లేట్లో టిఫిన్ తీసుకొస్తుంది... పార్ధసారధిని చూసి ఆగిపోయింది..వెంటనే చిరునవ్వుతో.. పార్ధసారధికి టిఫిన్ ఇస్తూ..)

క : ఇదిగోండి పార్ధసారధిగారూ.. తీసుకోండి..

పా : ముందు మీవారు మాటివ్వందే పచ్చిగంగ ముట్టను.

క : పెద్దవారు.. మాలాంటివారిమీద మీరలా అలగచ్చా.. పైగా ఆహారంమీద..

పా : పెద్దవాడినని నువ్వు గుర్తించావమ్మా.. కానీ మీ ఆయనే ఇంకా నన్ను గుర్తించట్లేదు..

శ్రీ : ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు చెప్పండి..

పా : మానస పబ్లికేషన్స్ వారికిచ్చిన నవల కాపీరైట్స్ మన పబ్లికేషన్స్ కి ట్రాన్స్ఫర్ చేయండి..

శ్రీ : చాలా తప్పండీ.. ఒకరి నోటి దగ్గర పెట్టిన అన్నాన్ని లాగి మీకు పెట్టాలని కోరుకోవటం పాపం కూడా.. పోనీ వారికిచ్చిన నవలకంటే మంచి నవల రాసిస్తాను.. శాంతిస్తారా?

పా : శ్రీహర్షగారూ.. నాలాంటి వాడిపట్ల మీరు చూపించే కృతజ్ఞత ఇదేనంటారా?

క : పెద్దలు.. ఆగ్రహించకండి... మావారు చెప్పేది కూడా సబబుగానే వుంది. మంచి నవల దగ్గరుండి రాయించే పూచీనాది.. అనుగ్రహించండి..

పా : నేను చెప్పింది మీరెలాగూ వింటంలేదు. మీరు చెప్తున్నారు కనుక ఒప్పుకుంటున్నాను. శ్రీహర్షగారూ.. చెప్పండి.. నవల ఎన్నిరోజుల్లో ఇస్తారు.

శ్రీ : వారం రోజుల్లో ఇస్తాను..

పా : సరే.. అప్పుడే వస్తాను..

క : టిఫిన్ తీసుకోండి..

పా : ఇప్పుడు కాదమ్మా.. నవరసాలతో కూడిన భావావేశాలతో నిండిన నవలను నాకిచ్చాకే నీ చేతివంటను షడ్రుచులను ఇష్టంగా ఆరగిస్తాను. వస్తానమ్మా.. (అంటూ పార్థసారధి అక్కడి నుండి లేచి వేగంగా వెళ్ళిపోయాడు...)

క : ఏంటండీ ఈయన..

శ్రీ : అలాంటివారంతా అంతే.. నన్నేదో వారి పెట్టుబడిగా భావిస్తున్నారు. నామీద సర్వహక్కులూ వారివే అన్నట్లుగా మాట్లాడతారు.

క : ఈ టిఫిన్ చేసి రచనకు కూర్చోండి..

శ్రీ : టిఫిన్ సంగతి తర్వాత.. ముందు నాకోసం ఒకపని చేస్తావా..?

క : మీకోసం ఒకపనేంటి? ప్రాణాలిమ్మన్నా ఇస్తాను.

శ్రీ : ప్రాణాలు నాకెందుకు... వాగ్దానాలు కావాలి..

క : వాగ్దానాలంటున్నారంటే.. ఏదో పెద్దపనే పెట్టేట్లున్నారే..

శ్రీ : చేస్తావా.. చెయ్యవా.. చెప్పు.

క : ప్రాణాలే ఇస్తానంటే.. అర్థంకాలేదా.. మీరేం చెప్పినా చెయ్యటానికి సిద్ధంగా వున్నానని...

శ్రీ : భరోసా ఇచ్చావు కనుక చెప్తున్నాను. నువ్వే ఒక నవల రాయకూడదూ...

క : నేనా..? నాకేం వచ్చండీ..

శ్రీ : లేదు కమలా.. ముందు నీకు చదువు లేదు. ఇప్పుడు రాలేదా.. నవల ఎలా రాయాలో

నేను నీకు నేర్పుతాను. ఈ వారం రోజుల్లో నీతో నవల నేను రాయిస్తాను.

క : ఆయన రాయమంది మిమ్మల్ని.. నన్నుకాదు..

శ్రీ : రాయిస్తానని మాటిచ్చింది నువ్వు. నేను రాయకపోతే నీ మాటపోదూ..

క : పోయేది నామాటేగా...

శ్రీ : నీమాటొకటీ.. నా మాటొకటీనా..

క : అందుకనీ.. నన్ను రాయమంటం ఏమన్నా బాగుందా..

శ్రీ : చాలా బాగుంటుంది.

క : నేను రాస్తే బాగోదండీ..

శ్రీ : రాస్తేనేగా బాగుంటుందో లేదో తెలిసేది..

క : వినరా..

శ్రీ : వినిపిస్తాను. నేను విన్న నీగుండెచప్పుడుని, ఆగుండెలోతుల్లోని సంభాషణల్ని, ఆ సంభాషణలు చెప్పే కథల్నీ పదిమంది పాఠకులకీ వినిపిస్తాను.

క : కష్టమే.. మీతో మాట్లాడటం.. మిమ్మల్ని ఒప్పించడం..

శ్రీ : ఈమాత్రం మాటనేర్పుంటే చాలు.. సులువుగా రచన చెయ్యటానికి..

క : నేర్పించండి... నేర్చుకుంటాను.

శ్రీ : అయితే ఇలా వచ్చి నా పక్కన కూర్చో.. కళ్ళు మూసుకో.. (ఇక్కడ నుండి అతను మూమెంట్ తీసుకుంటూ, డైలాగ్ చెప్తూ అందికు తగిన విధంగా పెర్ఫార్మ్ చేస్తూంటాడు) నీ చుట్టూ వున్న వాతావరణాన్ని అనుభూతి చెందు. దీర్ఘమైన శ్వాసతీసుకో.. గాలిలో వున్న పరిమళాల్ని అనుభూతి చెందు.. వీచే గాలిని అనుభూతి చెందు.. అదురుతున్న ఈ పెదవులను అనుభూతి చెందు.. ఎరుపెక్కిన నీ బుగ్గల్ని అనుభూతి చెందు... నీ ఉచ్వాస నిచ్వాసలకు లయబద్ధంగా చేసే నీ గుండె చప్పుడును అనుభూతి చెందు. నీలో అణువణువునీ అనుభూతి చెందు. ఇప్పుడు నీ మనసులో కలిగిన ఆలోచనలను ఈ కలంతో ఆ కాగితంమీద రాయి.. (తను రాస్తుంటుంది. స్పాట్ ఆన్..ఆమె భుజంమీద నుంచి తలపెట్టి ఆమె చెక్కిలికి తన చెక్కిలి తాకించి.. ఆమె అనుభూతి చెందుతూ రాస్తోంది.. అతను కరెక్షన్స్ చేస్తుంటాడు. వెనుక నుంచి సాకీ స్టార్ట్ అయింది. అతను మెల్లిగా స్పాట్ నుంచి ఫేడ్ అయ్యాడు. ఆమె రాస్తోంది.. జనరల్ లైట్స్ డిమ్ గా వెలిగాయి.. ఆమె రాసేసి అలాగే టేబుల్ మీద తలవంచి పడుకుండి పోయింది. అతను షర్ట్ వేసుకొని లోపలి నుంచి బయటికి వచ్చాడు.. ఆమె రాసిన పేపర్లు చేతిలోకి తీసుకొని చూస్తున్నాడు...ఆమెని డిస్టబ్ చెయ్యదలచుకోలేదు.. లోనికి వెళ్ళి టీ తీసుకొచ్చాడు... సాకీ కంటెన్యూ అవుతోంది.. మెల్లిగా ఆమె ముఖంపై సుతారంగా ఊదాడు. ఆమె అరమోడ్పు కనులతో భర్తని చూసింది.. టీ గ్లాసుతో ఆమె ముందు నిలబడిన అతన్ని చిరునవ్వుతో చూసింది.. అతను కూడా చిరునవ్వుతో టీ అందించాడు.. టీ అందుకుంది. టీ తాగింది..)

క : టీ చాలా తీయగా వున్నాయి.

శ్రీ : నీ రచనలో వర్ణనలకన్నానా..

క : కేవలం ఈ రచన నాదిమాత్రమేనా.. మీదికూడా..

శ్రీ : నేను నీకు సాయం చేశాను. అయినా ముగింపు రాత్రి మనం అనుకున్నది కాదే..

క : ఎందుకో.. ఇలా ముగించటమే సబబు అనిపించింది.

శ్రీ : ఈ ముగింపే చాలా బాగుంది. ఇంతకి నవలపేరు ఏం పెట్టావు..

క : స్వర్ణకమలాలు.

శ్రీ : అద్భుతం.. ఈ కమల నవలా ప్రపంచంలో కొత్తగా వికసించిన స్వర్ణకమలం. వారం రోజుల్లోనే ఇంత అద్భుతంగా నవల రాశావంటే.. ముందు ముందు ఇంకెన్ని నవలలు ఇంకెంత అద్భుతంగా రాస్తావో.

క : పెళ్ళాన్ని పొగడ్తల ఊయలలో ఊపేస్తున్నారు.

శ్రీ : కొత్తేముంది. మన పెళ్ళికాకముందు నిన్ను నా ఊహల ఊయలలో ఊగించాను. పెళ్ళయ్యాక ప్రణయ ఊయలలూగించాను. రచయిత్రివయ్యావుగా అందుకే పొగడ్తల ఊయలలూగిస్తున్నాను. నువ్వెప్పుడూ నాకు దేవతవేగా..

క : దేవతనా..? ఎలా.?

శ్రీ : నా ఊహల్లో నీ పాత్రను వర్ణించే క్రమంలో నా పదాలకు ప్రాణం పోసే కవితాదేవతవి, భార్యగా నా జీవితంలో అడుగడుగునా వుంటూ నా ఆలన, పాలనా చూసే క్రమంలో నా జీవితాన్ని సాఫల్యం చేసే భాగ్యదేవతవి.. ప్రణయ సంగమవేళలో నా మనసుని ఉర్రూతలూగించే శృంగారదేవతవి.. నిత్యం నీ నగుమోముతో, నిష్కల్మషమైన ప్రేమను అందించే సమయంలో సౌందర్యదేవతవి. ఇంకా...

క : చాలు.. నన్ను దేవతని చెయ్యకండి.. నన్ను మనిషిగా వుండనివ్వండి.. (అంటూ బయటికి చూస్తుంది..) ఇదేంటి ఇంటిముందు అప్పడే కల్లాపిచల్లి ముగ్గులు పెట్టివున్నాయ్.. (తనే చేశానన్నట్లుగా చూశాడు..) మీరూ.. (అంటూ అతని గుండెలపై చిన్నగా గుద్దుదూ అతని కౌగిట్లో ఒరిగిపోయింది.) ఎందుకు చేశారలా.. నేను చేసుకునే దాన్నిగా..

శ్రీ : రాత్రంతా రచనలు చేసి అలసిపోయిన అర్ధాంగికి కాసింత సాయం చేద్దామని..

క : ఇంకెప్పుడూ అలా చెయ్యకండి.. నా పని నన్ను చేసుకోనివ్వండి..

శ్రీ : నువ్వెళ్ళి తయారవ్వు.. పార్ధసారధిగారు వచ్చే సమయం అయింది.. వీటిని ఈలోపు వరుసలో పేర్చుతాను. (అంటూ కమలని గదిలోకి పంపించాడు. రాసిన కాగితాలను వరుసలో పేర్చుతున్నాడు. పార్ధసారధి వచ్చాడు.)

శ్రీ : రండి పార్ధసారధిగారూ.. మీకోసమే ఎదురు చూస్తున్నాను.

పా : రచన పూర్తయిందా..

శ్రీ : కాకపోతే మీరూరుకుంటారా... ఇదిగోండి..

పా : స్వర్ణకమలాలు.. టైటిల్ అద్భుతంగా వుందండీ..

శ్రీ : ఈలోగా మీరు చదువుతూ వుండండి... నేను ఇప్పుడే వస్తాను.

పా : మీరు రాసింతర్వాత నేను కొత్తగా చదివేదేముంది?

శ్రీ : ఎంతమాటా.. మీరు చదవాలి.. అభిప్రాయం చెప్పాలి..

పా : సరే.. (అంటూ పార్థసారథి చదవటం మొదలు పెట్టాడు.. శ్రీహర్ష లోనికి వెళ్ళాడు.. అతని మీద స్పాట్ ఆన్ అయింది. పార్థసారథి పేజీలు తిప్పుతున్నాడు.. జనరల్ లైట్స్ వెలిగాయి.. శ్రీహర్ష, కమల కాఫీ తీసుకొని వచ్చి పార్థసారథికిచ్చి, కూర్చున్నారు. పార్థసారథి తృప్తిగా కాఫీ తీసుకొని తాగుతూ.. శ్రీహర్షవైపు నవ్వుతూ చూస్తూ...) చాలా అద్భుతంగా వుంది. ఈ రచనలో స్వచ్ఛత కనిపిస్తుంది. శైలి కొత్త వరవడిని సంతరించుకుంది. ఈ నవలతో సరికొత్త శ్రీహర్షని ఈ నవలాలోకం చూడబోతోంది. ముఖ్యంగా భార్యాభర్తల మధ్య జరిగిన ఆ శృంగార సన్నివేశాలు, ప్రణయకలహాలు, ప్రకృతి వర్ణనలూ ఆహా ఎంత అద్భుతంగా వున్నాయో.. మరీ ముఖ్యంగా స్త్రీ యొక్క మానసిక సంఘర్షణని మీరు స్త్రీగా మారి రాశారేమో అని అనిపించింది.

శ్రీ : మీరన్నది నిజం.. నవల ఆద్యంతమూ కూడా కొత్తదనం ఉట్టిపడింది. స్త్రీ మానసిక సంఘర్షణని తెలియజే యాలంటే అది పురుషుల తరమా చెప్పండి. అందుకే ఈ నవల మొత్తం స్త్రీ చేతనే రాయించటం జరిగింది.

పా : మీరు రాయలేదా..?

శ్రీ : ఈమె రాసింది..

పా : కమలగారు రాశారా? మరిన్నాళ్ళూ మీ రచనా కౌశలాన్ని ఎక్కడ దాచేశారండీ.. మేడం ఇదిగోండి... (అంటూ సంచిలోంచి డబ్బులు తీసి టేబుల్ మీద పెడుతూ...) ఇది శ్రీహర్షగారు రాస్తే ఇద్దామని తెచ్చిన డబ్బు. పదిహేనువేలు. పేరు పొందిన రచయితలకు మాలాంటి వారం ఇచ్చే రెమ్యునరేషన్. మీ లాంటి నవయువ రచయిత్రికి సగౌరవంగా సమర్పిస్తున్న కానుక. మీరిలాగే అంచెలంచెలుగా ఎదగాలని త్వరలోనే ఉన్నత శిఖరాలను అధిరోహించాలని పెద్దవాడిగా దీవిస్తూ ఇస్తున్న ధనం.

క : నాకెందుకండీ.. ఆయనేకనుక పూనుకోకపోతే నేను రాసేదాన్నేకాదు..

శ్రీ : తీసుకో కమలా.. నీ రచనమీద నువ్వు తీసుకుంటున్న తొలి పారితోషికం.

పా : మరొక చిన్న విన్నపం.. ఈ నవలని నేను హిందీ, ఇంగ్లీషు భాషల్లోకి కూడా అనువదించుకోటానికి అవకాశం ఇవ్వవలసిందిగా అభ్యర్థిస్తున్నాను. చూడమ్మా.. ఇప్పటిదాకా మీ ఆయన రాసిన ఏనవలా కూడా ఇలా వేరే భాషల్లోకి అనువదింపబడలేదు. నీ మొట్టమొదటి నవలే ఒకేసారి మూడు భాషల్లో విడుదల

అవుతోంది. అలాగే బాగా అందంగా ముస్తాబై ఒక మంచి కలర్ ఫోటో కూడా దిగండి.. రచయిత్రిగా పుస్తకం మీద అచ్చువేయించాలి. శ్రీహర్షగారూ.. మీకు ఇంట్లోనే మరోపోటీ సిద్ధమైంది. ఏమంటారు శ్రీహర్షగారూ...

శ్రీ : (భార్యవైపు చూశాడు.. తను నవ్వుతోంది.. సీరియస్ గా మొహం పెట్టాడు.. అంతలోనే తిరిగి నవ్వేస్తూ..) నా భార్య నాకు పోటీ ఏంటండీ.. మా ఇద్దరిలో ఎవరికి పేరొచ్చినా మాకొచ్చినట్లు కాదా... మీరు అగ్రిమెంటు తయారు చేసుకొని రండి.. సంతకాలు పెట్టిస్తాను.

పా : సంతోషం... ఈ స్వర్ణకమలాలు పాఠకలోకంలో ముందు ముందు ఎన్నెన్ని స్వర్ణకమలాలు పూయిస్తుందో ఎవ్వరూ ఊహించలేరు శ్రీహర్షగారూ. మీరు మాకు మీ రచనలు ఇవ్వకపోయినా కమలగారు మాకు రచనలిస్తారు. కొత్త రచయిత్రి దొరికింది సార్.. (నవ్వు మాయమైపోయింది.. కమల తల వంచుకొని వుంది..)

శ్రీ : అంతకన్నా కావాల్సిందేముంది పార్థసారధిగారూ...

పా : సార్ మేడంగారిచ్చారని మీరు మమ్మల్ని మర్చిపోకండి... మీ నవలకోసం ఎదురు చూస్తుంటాను. ( శ్రీహర్ష నమస్కారం చేశాడు. పార్థసారథి నవల కాగితాలు తీసుకొని అక్కడి నుండి వెళ్ళిపోతూ...) కమలగారూ.. మీ కలాన్ని కొనసాగించండి.. (వెళ్ళిపోయాడు)

శ్రీ : కమలా.. ఆ డబ్బుని లోపలపెట్టు..

క : నిజంగానే ఆ రచనకి ఇంత డబ్బు...

శ్రీ : ఇంత డబ్బు రావటం నీకు కొత్తేమో... నాకు కాదు. అయినా ఆ డబ్బు నేను రాసిన నవలకోసం తీసుకొచ్చింది. నేను సహజంగా తీసుకునే పారితోషికమే.. రచన నీది అనేసరికి కాదనలేక మొహమాటంగా అతను నీకు ఇచ్చాడు.. అంతకన్నా మరేంలేదు.. ఎక్కువగా ఆనందపడకు.. ఆరచనకి అంతలేదు. ఆ డబ్బులు లోపలపెట్టు.

క : అంటే నవల మీకు నచ్చలేదా..?

శ్రీ : అంతా బానే వుంది కమలా.. కానీ ఆకరులో భార్య కాళ్ళమీద భర్త పడటం.. వాడి కన్నీళ్ళతో ఆమె పాదాలను అభిషేకించటం.. ఉదాత్తంగా భార్య భర్తని చిన్నపిల్లవాడిలా గుండెలమీదకి తీసుకొని ఓదార్చటం... ఇవన్నీ వాస్తవానికి విరుద్ధంగాలేవా... ఏ భర్తయినా భార్య కాళ్లు పట్టుకుంటాడా? వాడి కన్నీళ్ళతో భార్య కాళ్ళు కడుగుతాడా..?

క : ఆ భర్త పాత్ర అలా చెయ్యటమే బాగుంటుందనిపించింది. ఇందాక మీరు కూడా బాగుందనే అన్నారు.

శ్రీ : అన్నాను.. ఎందుకు..? నువ్వు బాధపడకూడదని.. ఈసారి నువ్వేం రాసినా నాకు చూపించు.. నేను వాటిని సరిచేస్తాను. సరేనా.. ముందు ఆ డబ్బులు లోపలపెట్టు..

నేనలా లైబ్రరీ దాకా వెళ్ళొస్తాను.

క : ఆగండి.. నేను ఎదురొస్తాను.. (అని రాబోతుండగా..)

శ్రీ : నాకు నువ్వు ఎదురు రావటం ఇష్టంలేదు.. (ఆమె మొహం చిన్నబోయింది.) నా వుద్దేశం.. నాతో కలిసి నడిస్తే బాగుంటుందని.. రచయిత్రివయ్యావుకదా.. చలోక్తి విసిరాను. (అని ఇద్దరూ నవ్వుకున్నారు. ఆమె డబ్బులు తీసుకొని లోపలికి వెళ్ళింది. శ్రీహర్ష మొహంలో నవ్వు మాయమైపోయి ఈర్ష్య, అసూయలు చోటుచేసు కున్నాయి.)

## లైట్స్ ఆఫ్
## సీన్ 3

(వేదిక మీద లైట్లు వెలిగాయి.. శ్రీహర్ష బయటికి వెళ్లే పనిలో వుండగా.. నందు ఎదురయ్యాడు. నందుని చూస్తూ ఆశ్చర్యంగా శ్రీహర్ష)

శ్రీ : ఎవరు మీరు? ఏం కావాలి?

నం : నాపేరు నందు. నేను మీ అభిమానిని.. గుడిపూడి నుండి వచ్చాను.

శ్రీ : ఓహ్.. మీరా నందుగారూ.. ఎంతసేపు ఉత్తరాల్లోనే మాట్లాడుకునేవాళ్ళం.. ఇప్పుడు ముఖాముఖి కలిశాం..

నం : అవును.. మిమ్మల్నిలా కలుసుకున్నందుకు చాలా ఆనందంగా వుంది సార్. మీ తొలినవల ముద్దబంతులు నుంచి రాకాచంద్రులు వరకూ ప్రతి నవలా నన్ను ఆకట్టుకుంది..

శ్రీ : థ్యాంక్యూ.. మీలాంటి అభిమానులున్నంతవరకూ నా కలం ఆగదు. ఎన్నో కొత్తకొత్త ఆవిష్కరణలు వెలుగుచూస్తునే వుంటాయి. అన్నట్లు కాఫీనా, టీనా..

నం : మీరు ఏది తీసుకుంటే నేనూ అదే.. మీ అభిమానిని కదా..

శ్రీ : అభిమానం మనసులో వుంటే చాలండీ.. కమలా రెండు కాఫీ..

క : (లోపలి నుండి) అలాగే..

నం : అభిరుచులు కూడా నాకు నచ్చిన రచయితలా వుండాలని నేను మిమ్మల్నే ఫాలో అవుతుంటాను. మీరు నవలల్లో చెప్పినట్లుగా స్త్రీ అభ్యుదయం కోసం నేను కొన్ని ఉపన్యాసాలు చెప్పటం మొదలు పెట్టాను. చాలా వరకూ మీరు చెప్పిన మాటలే నానోట వస్తాయి అనుకోండి. ఏది ఏమైనా స్త్రీలపట్ల మీ అభిప్రాయాలు, మీరు చూపించే గౌరవాభిమానాలూ నన్ను ఎంతగానో ఆకట్టుకున్నాయంటే నమ్మండి.. మీ నవలలు చదివే నేను వరకట్నానికి వ్యతిరేకంగా వివాహం చేసుకున్నాను. నాకు తెలిసిన వాళ్ళతో కూడా కట్నం లేకుండా వివాహాలు చేయించాను.

శ్రీ : చాలా థ్యాంక్స్.. మీలాంటి వారితో మాట్లాడినప్పుడే మా రచయితలు పడ్డ శ్రమకి ఫలితం వుంటుంది..

క : కాఫీ తీసుకోండి.. (అంటూ కాఫీ ఇచ్చింది. నందు కాఫీ అందుకుంటూ కమలనే చూస్తున్నాడు.

శ్రీహర్ష గొంతు సవరించుకున్నాడు.. నందు ఈ లోకంలోకి వస్తూ...)

నం : సార్ వీరు.. అచ్చం మీరు రాసిన నవలల్లోని కథానాయికలాగే వున్నారు. నిజం చెప్పాలంటే మీ రచనలోని కథానాయిక ప్రాణం పోసుకొస్తే ఎలా వుంటుందో అలా... ఎవరు వీరు?

శ్రీ : నా అర్ధాంగి.. పేరు కమల..

నం : నమస్కారం మేడం.. నా పేరు నందగోపాల్. అందరూ నందు అంటుంటారు. సార్ తో నాకు చాలా కాలంగా ఉత్తర పరిచయం వుంది. ప్రత్యక్ష పరిచయం ఈరోజే జరిగింది. ఒక చిన్న అనుమానం అడగమంటారా?

శ్రీ : అడగండి నందు గారూ..

నం : మరేంలేదు.. ఈమధ్య కాలంలో స్వర్ణకమలాలు, మానసవీణ, మధురాతిమధురం వంటి నవలలు చదివాను. అవి రాసిన కమల గారు మీరేనా?

శ్రీ : కాదు..

క : అవును.. (ఒకేసారి అన్నారు ఇద్దరూ... నందు అయోమయంగా చూశాడు. కమల తలవంచుకుంది. శ్రీహర్ష లేని నవ్వుని తెచ్చుకుంటూ...)

శ్రీ : ఛలోక్తి విసిరాను.

నం : అనుకున్నానులేండి.. మీలాంటి పండితులు అబద్ధ మాడినా అది సంబద్ధంగానే వుంటుంది. మంచి కాఫీ కలిపిచ్చిన మీచేతులకీ, ఇంత చక్కని ఆప్యాయతతో కూడిన ఆతిధ్యం ఇచ్చిన శ్రీహర్షగారికి కృతజ్ఞతలు.

శ్రీ : ఈ మాత్రానికేనా..?

నం : శ్రీహర్షగారూ.. రాకాచంద్రులు తర్వాత మీ రచనల్లో మునుపటి పసలేదండీ.. తర్వాత వచ్చిన నాలుగు నవలలూ కూడా అంతగా ఆకట్టుకోలేదు. ఈ విషయం చెప్పటానికి చాలా బాధగా వుంది. ఎందుకో మీ రచనలో పట్టు కోల్పోయినట్లు అనిపిస్తోంది..

శ్రీ : లేవండి.. (కోపంతో...)

నం : సార్..

శ్రీ : మిమ్మల్నే పైకిలేవండి.. (మరింత కోపంతో...)

నం : క్షమించాలి.. మీకు కోపం రావటంలో అర్ధముంది.. పాఠకుడిగా మా మనసుని తెలియజేయాల్సిన అవసరం వుందనిపించింది. అందుకే చెప్పాను.

శ్రీ : మీరు చెప్పినందుకు చాలా థ్యాంక్స్.. మీరు బయల్దేరితే మాపనులు మాకున్నాయి.. (చాలా ఆవేశంగా..)

నం : ఇంత ఆవేశంతో మీరు రచనలు చెయ్యలేరు సార్.. అందుకే మీ రచనల్లో పస తగ్గింది. నిదానించి నేను చెప్పింది ఒక్కసారి ఆలోచించండి.

శ్రీ : ఐ సే షటప్ అండ్ గెటవుట్. (అని పెద్దగా అరుస్తూ బయటికి చూపించాడు.. నందు మౌనంగా అక్కడి నుండి బయటికి కదులుతూ... ఆగాడు... కమల వైపు తిరిగి.. )

నం : మేడం.. మీ మూడు నవలలూ అద్భుతం. ముఖ్యంగా స్వర్ణ కమలాలు మహాద్భుతం. చూస్తుండండి.. జ్ఞానపీఠ్ పురస్కారం ఆనవలకు తప్పకుండా వస్తుంది.

శ్రీ: రేయ్ ఆగరా.. నిన్నగాక మొన్న రాయటం మొదలు పెట్టింది. నేను రాసినన్ని నవలలు కూడా అది రాయలేదు. ఒక్క నవలకే జ్ఞానపీఠ్ వచ్చేస్తే.. సీనియార్టీ వున్న నేనెందుకురా? ఈ సంవత్సరం నాకే వస్తుంది.

నం : నిజమేసార్.. జ్ఞానపీఠ్ పురస్కారం పొందటానికి ఒకప్పుడు మీకు అన్ని అర్హతలూ వున్నాయి. కానీ ఇప్పుడు మీకులేదు.

శ్రీ : యూ స్కౌండ్రల్.. నాకు లేని ఆ అర్హత తనకేముంది?

నం : నన్ను కాలర్ పట్టుకొని అవమానించారు. నోటికొచ్చినట్లు తిట్టారు.. తిరిగి నేను మీ కాలర్ పట్టుకోటానిక్కానీ, తిట్టటానిక్కానీ క్షణం పట్టదు. ఎందుకు చెయ్యలేదో తెలుసా..? ఒకప్పుడు నేను మీ అభిమానిని కావటం, ప్రస్తుతం మీ శ్రీమతిగారికి అభిమానిని కావటం వల్లనే. కమల గారూ... రాసిపెట్టుకోండి.. జ్ఞానపీఠ్ పురస్కారం ఈ సంవత్సరం మీదే.. దీన్నెవ్వరూ మార్చలేరు.

శ్రీ : హహహహ... ఎంపికలకు ఎంట్రీలు పంపటానికి లాస్ట్ డేట్ అయిపోయింది.

నం : అవును. మీరన్నట్లు లాస్ట్ డేట్ అయిపోయి వుండచ్చు. కానీ నా మాట పొల్లుపోదు.

శ్రీ : పిచ్చివాళ్ళతో మాట్లాడే ఓర్పు నాకు లేదు. గెటవుట్.. (నందు ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.) ఏంటి? అతను అన్నమాటలకి పొంగిపోతున్నావా?

క : అదేంలేదండీ..

శ్రీ : పైకి నువ్వు పొంగిపోకపోవచ్చు.. కానీ పురస్కారం పొందాలన్న పిచ్చి ఊహలు నీ మెదడులో వున్నాయని నాకు తెలుసు. అదెప్పటికీ జరగదు.

క : నిజంగానే నా మనసులో అలాంటి ఆలోచనలు లేవు. పురస్కారం రానంతమాత్రాన మీ విలువ తగ్గుతుందా.. వస్తే నవలలు రాయటం ఆపేస్తారా.? చెప్పండి.. మనపని మనం చేసుకుంటూ వెళ్ళిపోవటమే..

శ్రీ : వసంతమాసం కూడా కాదే.. కోకిల కూయటానికి..

క : మీరునాపక్కనేవున్న ప్రతి క్షణమూ నాకు వసంతమే.. కాదంటారా? (శ్రీహర్ష మౌనంగా .. సీరియస్ గా అక్కడి నుండి కదలాడు.. మెల్లిగా లోపలికి వెళ్ళబోతుండగా.. ) నేను మీతో మాట్లాడాలి.

శ్రీ : ఇప్పటిదాకా చేసింది అదేకదా..

క : కాదు.. మీరూ మీరూ మాట్లాడుకున్నారు. (ఏంటన్నట్లుగా చూస్తూ.. చెప్పమన్నట్లుగా తలూపాడు..) నాతో ఈ మధ్య కాలంలో సరిగా మాట్లాడటంలేదు. ( అనీజీగా అలా

కుర్చీలో కూర్చున్నాడు. తను దగ్గరికి వెళ్ళి అతని భుజం మీద తల పెట్టి...) పెళ్ళయిన కొత్తల్లో.. మనిద్దరం ఎలా వుండే వాళ్ళమో ఇప్పుడూ అలా వుండలేమా...

శ్రీ : అప్పటికీ ఇప్పటికీ నేను మారలేదు.

క : అవును.. నేనే మారాను. నన్ను మీరే మార్చారు. మీకు అనుకూలంగా..

శ్రీ : అదే నేను చేసిన తప్పా..

క : కాదు. మారటమే నేను చేసిన తప్పేమో..

శ్రీ : మార్పు అనేది సహజం. కానీ ఆశించిన దానికంటే ఎక్కువగా జరిగింది. అందుకే ఈ సమస్యలు..

క : అంటే.. (అతను మౌనంగా వున్నాడు. ఆమె చెంప అతని చెంపకి ఆనించింది.. శ్రీహర్ష చాలా అనీజీగా ఫీల్ అవుతున్నాడు.. ఆమె అది పట్టించుకోకుండా..) ఒక పని చెయ్యనా..

శ్రీ : ఏంటి?

క : నాకు పేరుప్రఖ్యాతలు తెచ్చుకోవటంమీద ఆసక్తిలేదు. కేవలం మీకు సేవలు చేసుకుంటూ జీవితాంతం వుండిపోవాలనీ, పుణ్యస్త్రీగా మీ చేతుల్లో పోవాలనీ..

శ్రీ : ఏం చెప్పదలచుకున్నావో సూటిగా చెప్పు..

క : మీరు నవ్వుతూ వుండాలంటే నేనేం చెయ్యాలో చెప్పండి.. పోనీ రచనలు చెయ్యటం ఆపెయ్యనా.. (అంటూ చిరునవ్వుతో అతని మొహంలోకి మొహం పెట్టి చూసింది.)

శ్రీ : (ఆమె చెంప ఛెళ్లుమనిపించాడు.. ఆమె కింద పడింది. ఆవేశంగా కుర్చీలోంచి లేచాడు.. ఆమె వైపు సీరియస్ గా అడుగులేస్తూ.. ఆమె మీదికి వంగి.. ) ఏం కూశావ్.. నువ్వు కూడా నన్ను ఆ బాస్టర్డ్ గిరి గాడిలా తక్కువ చేసి మాట్లాడతావా? మూడు నవలలు పాఠకులు ఆదరించేసరికి నువ్వేదో పెద్ద రచయిత్రి వయ్యావనుకుంటున్నావా? నీ నవ లలు నాలుగు భాషల్లోకి అనువాదం పొందేసరికి కళ్ళు నెత్తికెక్కాయా..? నువ్వు రాయటం ఆపేస్తే నాకు పేరొస్తుందని భావిస్తున్నావా? నీకంటే నేను అంత తక్కువ స్థాయి రచయితనా..

క : నేను అలా అనలేదండీ.. నా ఉద్దేశమూ అది కాదు..

శ్రీ : నోర్ముయ్.. నువ్వన్నది అదే.. నీ ఉద్దేశమూ అదే.. త్యాగం చేస్తున్నావా..? నాకు భిక్షవేస్తున్నావా? ఛంపేస్తా.. ఎవరి త్యాగాలవల్లనో నేను గొప్పరచయితను కాలేదు.. ఎవరి దయాభిక్షవల్లనో నేనీ స్థాయికి ఎదగలేదు. నా స్వయం కృషితో ఇక్కడి దాకా వచ్చాను. ఏదో రెండు మూడు నవలలు జనాదరణ పొందకపోతే అంతమాత్రానికే వెనుక బడిపోయానా..? ఇవిగో ఇవి చూడు ఎంతమంది అభిమానులు నా నవలలను మెచ్చుకుంటూ నాకు ఉత్తరాలు రాశారో.. (అంటూ కొన్ని కాగితాలు ఆమె నెత్తిన పోశాడు..) నా రచనలు అర్థంచేసుకునే స్థాయి నీ నవలలు చదివే పాఠకులకు ఉండదు.. కేవలం మేధావులు మాత్రమే అర్థంచేసుకుంటారు.

నా రచనలు మేధావులకోసం అలగా పాఠకులకోసం కాదు.. అర్థమైందా.. (అంటూ అక్కడి నుండి వేగంగా బయటికి నడిచాడు.. కమల ఏడుస్తూ అలాగే నేలపై పడుకుండి పోయింది.. ఆమె మీద స్పాట్ .. వెనుక నుండి హై పిచ్ లో ఆలాపన...)

## లైట్స్ ఆఫ్
## సీన్ 4

(శ్రీహర్ష తనకు కేటాయించిన సీట్ లో కూర్చున్నాడు. అతని మీద స్పాట్ ఆన్ అయింది. దూరంగా రేడియోలో...

ఓ.బీ: ఆకాశవాణి జాతీయ వార్తలు.. భారత సాహితీ పుర స్కారాల్లో ప్రతిష్ఠాత్మక జ్ఞానపీఠ్ పురస్కారం ఈ సంవత్సరం తెలుగు వారిని వరించింది. విజయవాడకు చెందిన ప్రముఖ నవలా రచయిత కమల మునిపల్లె ని పురస్కారం వరించింది. స్వర్ణకమలాలు నవలకు గాను ఈ పురస్కారాన్ని అందజేస్తున్నామనీ, టైమ్స్ ఆఫ్ ఇండియా వార్తా పత్రిక వ్యవస్థాపకులైన సాహు జైన్ కుటుంబం ఏర్పాటు చేసిన భారతీయ జ్ఞానపీఠం వారు తెలియ జేశారు. వాగ్దేవి కాంస్య ప్రతిమ, పురస్కార పత్రం, పదకొండు లక్షల రూపాయల నగదు భారత ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ చేతులమీదుగా అందజేస్తున్నట్లు ప్రకటించారు.

(శ్రీహర్ష పెద్దగా అరుస్తూ టేబుల్ మీదున్న పుస్తకాల్ని విసిరి కొట్టాడు.. (లైట్స్ అన్నీ వెలిగాయి...) తన పెన్నుని విరగ్గొట్టాడు. తను రాసిన కాగితాలు చించేశాడు.. పెద్దగా అరుస్తూ మోకాళ్ళమీద కూలబడ్డాడు..)

శ్రీ : ఒక్క ఆడది.. నా ఇంట్లోనే నాతోనే వుంటున్న ఆడది.. నేను తయారు చేస్తే రచయిత్రి అయిన ఆడది.. నాకన్నా ముందుగా... నేను కోరుకుంటున్న పురస్కారాన్ని పొందిన ఆధది.. అఫ్ట్రాల్ ఆడది.. ఏడు సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్నా రాని పురస్కారం ఏడునెలల్లో దానికెలా వచ్చింది. కమలా.. (అని పెద్దగా అరిచాడు.. కమల మెల్లిగా బయటికి వచ్చింది... తల వంచుకొని నిలబడింది.)

శ్రీ : రా.. దగ్గరకు రా... (దూరంగా నిలబడింది..) రమ్మంటుంటే.. (అదిరిపడి దగ్గరకు వచ్చింది.) ఎలా.. ఇలా ఎలా జరిగింది.?

క : ఏంటి?

శ్రీ : జ్ఞానపీఠ్ పురస్కారం నీకెలా వచ్చింది?

క : తెలీదండీ..

శ్రీ : అబద్ధం.. నీకు తెలుసు.. నువ్వు దరఖాస్తు చెయ్యకుండా ఈ పురస్కారం నీకెలా వస్తుంది. ఏడు సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్న నాకు రాకుండా అది నీకెలా వచ్చింది.? (అంటూ ఆమె జుట్టు పట్టుకొని కోపం ఆమె కళ్ళల్లోకి చూశాడు.. ఆమె వణికి పోతూ...)

క : నిజంగా నాకేం తెలీదండీ.. అసలదేంటో.. దాని వల్ల ఏం ప్రయోజనమొస్తుందో

కూడా నాకు తెలీదు. అలాంటిది మీకు పోటీగా నేను ఎందుకు దరఖాస్తు చేసుకుంటాను..

శ్రీ : ఏయ్.. (అంటూ చెంపమీద కొట్టాడు...) నాకు పోటీనా.. నువ్వు నాకు పోటీనా.. అదెన్నటికీకాదు.. శ్రీహర్షకి పోటీగా ఎవ్వరూ రాలేరు.. కానీ నా చేతుల్లో పడాల్సిన పురస్కారం నీచేతుల్లోకి వస్తోందంటే తట్టుకోలేక పోతున్నాను. గతంలో ప్రయత్నించినప్పుడు విశ్వనాథ సత్యనారాయణ గారు అడ్డుపడ్డారు. పోనీలే పెద్దవాడు అని సరిపెట్టుకున్నా.. ఆ తర్వాత మూడేళ్ళకి ఇప్పుడు నువ్వు.. నువ్వు ఆడ సైంధవుడిలా అడ్డుపడ్డావ్..

క : ఒట్టేసి చెప్తున్నాను. నేను మీకు పోటీ ఎప్పటికా కాను..

శ్రీ : ఇప్పుడయ్యావ్.. ఈక్షణంలో నాకు నిన్ను చంపెయ్యాలన్నంత కోపంగానూ.. కసిగానూ వుంది..

క : నేను చెయ్యని దానికి మీరనే మాటలు వింటుంటే చావుకూడా చిన్నదిగానే వుంది.. నన్ను చంపెయ్యండి.. మీ చేతులతోనే చంపెయ్యండి.. ఆ పురస్కారమూ వద్దు.. నాకు పేరూ వద్దు.. అసలు నాకీ చదువే వద్దు.. హహహహా... (అంటూ పిచ్చి పట్టిన దానిలా పెద్దగా అరుస్తూ.. కూలిపోయింది... శ్రీహర్ష కంగారు పడుతూ ఆమెను పిలుస్తూ లేపటానికి ప్రయత్నిస్తున్నాడు.. ఆమె లేవలేదు.. శ్రీహర్షకు ఏం చెయ్యాలో అర్థంకాలేదు. ఇంతలో గిరి, పార్థసారథి ఇద్దరూ కూడా లోనికి ప్రవేశించారు.)

పా : అభినందనలు కమలగారూ... (అని వచ్చి అక్కడి పరిస్థితి చూసి షాక్ అయ్యారు.. గిరి, పార్థసారథి ఇద్దరూ...)

గి : ఏమైంది ఆమెకి?

శ్రీ : ఏంలేదు.. పెద్దగా అరిచి పడిపోయింది.. ఏం చెయ్యాలో అర్థంకాక అటూ ఇటూ చూస్తుంటే ఇంతలో మీరొచ్చారు. మీరేంటిలా వచ్చారు.?

గిరి : ఆరోజు నేను చెప్పినట్లే మేడంగారికి జ్ఞానపీఠ్ పురస్కారం వచ్చిందికదా.. కంగ్రేట్స్ చెప్పాలని వచ్చాను..

శ్రీ : (గిరి కాలర్ పట్టుకున్నాడు..) నీకెలా తెలుసు.. తనకి పురస్కారం వస్తుందని..

గి : కాలర్ వదిలిపెట్టండి శ్రీహర్ష.. తిరిగి పట్టుకోటానికి క్షణం పట్టదు. మర్యాదస్తుడ్ని కనుక నేనాపని చెయ్యట్లేదు.

పా : ఏం మాట్లాడుతున్నావయ్యా.. ఆయన ఎవరనుకుం టున్నావ్..

శ్రీ : నా అభిమానని చెప్పి దానికి అభిమానయ్యాడు..

పా : ఆయన జ్ఞానపీఠ్ కమిటీలో ఒక మెంబర్.. ఈ సంవత్సరం జరిగిన ఎంపికల్లో "స్వర్ణకమలాలు" పురస్కారం అందుకోటానికి కారణం ఈయనే..

శ్రీ : (షాక్ అయ్యాడు.. మెల్లగా తేరుకున్నాడు..) నన్ను క్షమించండి.. మీరని తెలియక మిమ్మల్ని

అవమానించాను.

పా : డాక్టర్ గిరి కమల గారికి ఏమైందో ఒక్కసారి చూడండి.. (గిరి కమల నాడి పట్టుకున్నాడు. చెక్ చేశాడు. శ్రీహర్ష వైపు చూశాడు.. శ్రీహర్ష తల వంచుకున్నాడు. గిరి అర్థమైనట్లు తలూపుతూ.. పార్థసారథి వైపు తిరిగి..)

గి : పార్థ సారథి గారూ.. మీరు కాసేపలా బయట వుంటారా? వీరితో నేను ఏకాంతంగా మాట్లాడాలి.

(పార్థసారథి ఏం మాట్లాడకుండా బయటికి వెళ్ళిపోయాడు. గిరి సీరియస్ గా శ్రీహర్ష వైపు కదులుతూ...)

గి : చెప్పండి.. మీరేం చేశారు?

శ్రీ : అదీ.. ఏం లేదు.. ఏదో చిన్న గొడవ వల్ల.. అలా..

గి : ఇక్కడ చూడండి.. మీరు ఆమెని కొట్టిన దెబ్బను బట్టి చూస్తుంటే గొడవ చిన్నది కాదు.. చాలా పెద్దదే జరిగింది.

శ్రీ : అదేంలేదు.. చాలా చిన్న గొడవే..

గి : చిన్న గొడవైతే ఇంత పెద్ద దెబ్బ పడదు.. చెప్పండి.. ఇక్కడ నేనూ మీరూ తప్ప ఎవ్వరూ లేరు.. తను స్పృహలో లేదు.. (శ్రీహర్ష తల దించుకొని మైమ్ లో చెబుతున్నాడు.. గిరి వింటున్నాడు.. అంతా విన్నాక గిరి మౌనంగా నాలుగడుగులు శ్రీహర్షవైపు వేసి... అతని కళ్ళల్లోకి చూస్తూ...) మీరు ఎంత పెద్ద తప్పు చేశారో తెలుసా..?

శ్రీ : నా భార్యని నేను కొట్టుకుంటాను, తిట్టుకుంటాను.. అడగటానికి మీకు హక్కులేదు.

గి : నిజమే హక్కులేదు.. కానీ బాధ్యత వుంది. ఒక భారతీయుడిగా.. ఒక సోదరుడిగా.. కమిటీ మెంబరుగా నేను రచయిత్రిని వ్యక్తి గతంగా కలుసుకుందామని నేను మీ ఇంటికి వచ్చాను. అప్పుడే తెలిసింది ఇది నావెలిస్ట్ శ్రీహర్ష గారిల్లు అని. అప్పటికే మీరు మీ నవలల్ని మాకు పంపటం, మేం వాటిని పరిశీలిస్తున్న సమయంలో మీ నవలకు నేను అభిమానిగా మారటం జరిగింది. అదే చనువుతో మీతో మాట్లాడాక నేను నిశ్చయించుకున్నాను జ్ఞానపీఠ్ పురస్కారం ఈ సంవత్సరం ఈమెకివ్వాలని.. మా కమిటీని నేను కన్విన్స్ చేశాను.

శ్రీ : అసలు ఇంగ్లీషు చదవటం రాయటంరాని ఈమె దరఖాస్తు ఎలా చేసింది. అదీ నాకు తెలీకుండా..?

గి : తెలుగు తప్ప మరే భాషా రాని ఈమె గురించి మీకు తెలిసి కూడా ఇంగ్లీషు, హిందీలో వుండే దరఖాస్తు మరప్పుడు ఎలా చేసిందనుకున్నారు? (శ్రీహర్ష ఆలోచనలో పడ్డాడు..) అర్థంకావట్లేదు కదా.. అర్థమయ్యేలా చెప్తాను. దానికంటే ముందు ఈమెకి విశ్రాంతి ఇవ్వాలి.. అసలే ఆమె వట్టి మనిషి కాదు.

శ్రీ : ఏమంటున్నారు మీరు..

గి : తన కడుపులో మీ ప్రతిరూపం పెరుగుతోందంటున్నాను. నీళ్ళు తీసుకురండి..

(శ్రీహర్ష నీళ్ళు తీసుకురావటానికి లోనికెళ్ళాడు.) పార్థసారథిగారూ.. మీరు లోపలికి రావచ్చు.

పా : అయ్యా.. అంతా వినపడక పోయినా కొంత విన్నాను.. జరిగిన గొడవకి కారణం నేనే.. అని నాకు అనిపిస్తోంది..

గి : ఇందులో మీ తప్పేంలేదు.. మీరలా వుండండి.. (శ్రీహర్ష నీళ్ళగ్లాసు అందించాడు..) శ్రీహర్ష గారూ.. దరఖాస్తు ఎవరు పంపారు అని అడిగారు కదా.. ఈయనే..

శ్రీ : నువ్వా ... పార్థసారథీ..

పా : అవును శ్రీహర్షగారూ.. విషయం ఇది అని చెప్పకుండా ఆమె దగ్గర సంతకాలు తీసుకుంది నేనే..

శ్రీ : మీకు తెలుసు కదా.. ఎన్ని సంవత్సరాల నుంచి నేను జ్ఞానపీఠ్ కోసం ఎదురు చూస్తున్నానో..

పా : తెలుసండీ.. కానీ మీ నుంచి ఇటీవలి కాలంలో ఇంతకు ముందు మీరు రాసిన స్థాయిలో రచనలు రావటంలేదు. రచనలో నాణ్యత తగ్గింది. పాఠకులూ తగ్గారు. అదే సమయంలో కమల గారి నవలలకి ఆదరణ పెరిగింది. స్వర్ణకమలాలు నవల ఎన్ని కాపీలు అమ్ముడు పోయాయో మీకు తెలుసా? రెండు కోట్ల కాపీలు.. హిందీలో 32 కోట్ల కాపీలు, ఆంగ్లంలో పదిహేను కోట్ల కాపీలు అమ్ముడు పోయాయి. అదే విధంగా కమల గారు రాసిన "మానస", "మౌనవీణ" నవలలు కూడా అదే విధంగా పాఠకులను ఆకట్టుకున్నాయి. ఆమె ఎదుగుదలను చూసి మీరు తట్టుకోలేక మీలో మీరే కుమిలి పోయారు.. అసూయతో రగిలిపోయారు.. అప్పటి నుండే మీ రచనలో నాణ్యత తగ్గిపోతోంది. పబ్లిషర్స్ మీ రచనలు తీసుకోటానికి వెనుకడుగు వేయటం మొదలు పెట్టారు. ఇదంతా కేవలం ఆరు నెలల్లోనే జరిగిపోయింది. కమల గారి సృజనాత్మక శక్తి, కాల్పనికత, ఆమె తీసుకునే కథావస్తువు, చెక్కే శిల్పం అద్భుతం. అందుకే వారు జ్ఞానపీఠ్ పురస్కారం పొందటానికి అన్ని అర్హతలున్నాయని అనుకున్నాను. అప్లికేషన్ పెట్టించాను. నిజానికి ఆమె దేనిమీద సంతకం పెడుతోందో.. ఎందుకు పెడుతోందో కూడా తెలీదు.

శ్రీ : మా రచనలతో వ్యాపారం చేసుకునే నీకు.... తనకి పురస్కారం తెప్పిస్తే ఏమొస్తుందిరా..? నీకు తెలుసుగా... నేనెన్ని సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్నానో..

పా : అవునుసార్.. అవును.. నేను మీ రచనల్ని అమ్ముకొని సొమ్ము చేసుకునే వ్యాపారినే.. మీరేం చేస్తున్నారూ.. మీరు కూడా మీ రచనల్ని మాకు అమ్ముకుంటున్నారుగా సార్.. మరి మీది వ్యాపారం కాదా.. నేను చేస్తే వ్యాపారం మీరు చేస్తే సమాజోద్ధరణా సార్.. నిజమే సార్ నేను వ్యాపారినే.. కానీ అంతకంటే ముఖ్యంగా సాహిత్య

ప్రేమికుడినిసార్.. నాకు నచ్చిన సాహిత్యాన్ని నలుగురికీ పంచాలని ఆశపడతాను సార్. గతంలో మీకు పురస్కారం రావటంకోసం నేనూ తాపత్రయ పడ్డాను సార్.. అప్పుడు మీ రచనలు బాగున్నాయి కనుక. ఇప్పుడు నేను దణ్ణం పెట్టుకుంటాను సార్.. జీవితంలో మీకు ఎటువంటి పురస్కారమూ రాకూడదని.. సార్.. శ్రీహర్షగారూ.. మీకో విషయం చెప్పనా.. కమలం స్వచ్ఛమైన చెరువులోనే కాదు.. బురదలో వున్నా కూడా దాని విలువ దానిదే.. అయితే ఈ కమల స్వర్ణకమలం సార్.. బంగారు కమలం. అలాంటి బంగారు తల్లికి అలాంటి పురస్కారం రావటం అవసరమని నాకు అనిపించింది.. అందుకే ఇదంతా చేశాను. వ్యాపారం కోసం కాదు. సాహితీప్రియుడిగా నా బాధ్యతకోసం.

గి : శ్రీహర్షగారూ.. మీరో విషయం మర్చిపోతున్నారు.. ఈ సంవత్సరం మీరు పంపిన అప్లికేషన్ ఎన్నో స్థానంలో వుందో తెలుసా? 23వ స్థానంలో వుంది. గతంలో మీరు పంపిన నవల చదివిన నేను ఈసారి మీరు పంపింది చదువుతుంటే నాకే చాలా ఆశ్చర్యమేసింది. ఏమైంది శ్రీహర్షగారికి ఇలాంటి నవల రాశారని.. ఈవిడ వచ్చి మీకు పురస్కారాన్ని చెడగొట్టలేదు సార్.. మీలో వుండే అహంకారం, అసూయలే మీ పతనాన్ని కొనితెచ్చాయి. ఇప్పుడు అర్థమైందిగా.. ( గిరి ఆమె మొహంమీద నీళ్ళు చిలకరించాడు.. ఆమె స్పృహలోకి వస్తూనే.. శ్రీహర్షని చూస్తూ.. )

క : ఏంది యావండీ.. ఏవైందినాకూ.. అందరూ అట్టా నిలబడ్డారు? ఎవురీల్లు..?

శ్రీ : కమలా.. నువ్వేంటి అలా మాట్లాడుతున్నావ్..

క : నేనెట్టా మాట్టాడతన్నా యావండీ.. బానే వుండాగా..

శ్రీ : కమలా.. నన్ను క్షమిస్తావా? నేను నీమీద చెయ్యి చేసుకున్నాను. నీ సంస్కారం ముందు నేను దిగజారిపోయి కుసంస్కారిగా మిగిలిపోయాను.

క : దొరగారూ.. సెమించండి.. యావండీ.. మీరేం మాట్టాడతన్నారో.. నాకు ఒక్క ముక్కా అర్థం కాటల్లేదు.. నేను తప్పు చేత్తే నన్ను చమించండి.. (చెంపలేసుకోబోతుంటే శ్రీహర్ష ఆపాడు.. ఆమె చేతులతో తనే రెండు చెంపలూ వాయించుకున్నాడు. కమల తన చేతులు వెనక్కి తీసేసుకుంది.) ఎందుకు యావండీ ఇట్టా సేత్తన్నారు. మీలాటోల్లు ఇట్టా సెయ్యచ్చా.. నేను తప్పు సేత్తే నన్ను కొట్టండి.. అంతేకానీ ఇట్టా సెయ్యకు యావండీ.. (కమల రెండు చేతులు పట్టుకొని తన కళ్ళకి అద్దుకుంటూ...)

శ్రీ : కమలా.. నేనేంటో.. నా స్థితేంటో తెలుసుకున్నాను. అజ్ఞానంలో వున్న నన్ను తిరిగి జ్ఞానభారతిగా మారి నీ ప్రేమామృత ధారలతో విజ్ఞానాన్ని అనుగ్రహించవా.. పసిపిల్లాడిలా నీ ఒడిలో చేరి సంస్కారమనే పాఠాలు నేర్చుకోవాలనుంది.. అనుగ్రహించవా.. (అంటూ ఆమె ఒడిలో తలపెట్టాడు.. శ్రీహర్ష.. )

క : ఏంది యావండీ ఏందేందో సెప్తున్నా.. నాకేం అర్థం కాటల్లేదు. బాధపడకు

యావండీ.. సిన్నప్పుడు నాకు భయమేత్తే ఇట్టానే మాయమ్మ ఒల్లో పడుకునేదాన్ని.. ఇప్పుడు నీకు భయమేత్తందా యావండీ.. నేనూ నిన్ను అమ్మలాగే సూసుకుంటా.. పక్కింటావిడ నన్ను గదిలోకి పంపుతా ఇంకా సానా ఇసయాలు సెప్పిందంటే ఏందని అడిగారుగా.. మీరు నాకు మొగుడైన మరునిమిసమే నేను అమ్మంత బాగా తమర్ని సూసుకోవాలని సెప్పింది. మొగుడుకి ఎప్పుడు ఏది అవసరమో ముందే తెలుసుకొని అయన్నీ ఏలకి అందించాలని సెప్పింది.. ఇప్పుడు నాకు అర్థమైంది మీకు ఓదార్పు అవసరమని... రండి యావండీ... రండి.. నా ఒల్లో ఇట్టానే పడుకో.... నేను జో కొడతా.. నిద్రపట్టిద్ది...భయాలన్నీ నిద్రలోనే పోతాయ్.. నిద్రలేసి రాసుకోండి.. (అంటూ లాలిపాట హమ్ చేస్తుండగా.. వారిద్దరి మీదా స్పాట్ ఆన్ అయింది... గిరి, పార్థసారథి మీద మరోస్పాట్ ఆన్ అయింది.)

గి : మనోకమలం స్వచ్ఛమైనప్పుడు ఆ మనిషి స్వర్ణకమల మౌతాడు. అలాంటి స్వచ్ఛమైన మనసులు పసిపాపల్లో మాత్రమే వుంటుంది. సహజంగానే స్వచ్ఛమైన మనసు కలిగిన కమల స్వర్ణకమలమే.. అయితే తనలోని అరిషడ్వర్గాలను త్యజించి పసిపాపలా మారిన శ్రీహర్ష కూడా ఇప్పుడు స్వర్ణకమలమయ్యాడు. వీరిద్దరూ స్వర్ణ కమలాలుగా మనముందు నిలబడ్డారు.

పు : మరి ఆమె పరిస్థితేంటి డాక్టర్.. ఎప్పటికీ అలాగే వుండిపోవాల్సిందేనా..? గతంలోకి వెళ్ళిన ఆమె మనసు వర్తమానంలోకి రాదా...

గి : ఏదో ఒక రోజు తిరిగి ఆమె వర్తమానంలోకి రావచ్చు.. రాకపోనూ వచ్చు. స్వచ్ఛమైన స్వర్ణకమలాలుగా వున్న వీరిని ఇలాగే వుండనిద్దాం.. ఎలాంటి అరమరికలూ లేకుండా వీరి జీవితాన్ని ప్రశాంతంగా సాగిపోయేలా చూడాలని ఆ భగవంతుని కోరుకుంటూ.. నా వంతుగా ఏ పురస్కారకోసం ఇంత రాద్ధాంతం జరిగిందో ఆ పురస్కారం ఇచ్చి వీరి జీవితకాసారంలో తిరిగి అలజడులు లేపటం ఇష్టంలేక ఈ సంవత్సరం జ్ఞానపీఠ్ పురస్కారం వేరేవారికి కేటాయించేలా కమిటీని నేను ఒప్పిస్తాను.

పు : ధర్మమేనంటారా?

గి : న్యాయం అంటాను. సందర్భాన్ని బట్టి, పరిస్థితిని బట్టి అది మారుతుంటుంది. ఇప్పటికిదే న్యాయం అని నాకు అనిపిస్తుంది.. వీరి సుఖం కోరుకుని వీరినిలాగే వుండనిద్దాం..

O.B:ఆ సంవత్సరం తెలుగు వారికి రావాల్సిన జ్ఞానపీఠ్ పురస్కారం వేరే భాషకి దక్కింది. విశ్వనాథ సత్యనారాయణ గారు రాసిన రామాయణ కల్పవృక్షం 1970 లో పురస్కారాన్ని పొందితే... 1988లో డాక్టర్ సి.నారాయణ రెడ్డి గారి వరకూ ఒక్క తెలుగు కవి కూడా పురస్కారాన్ని పొందలేకపోయారు. కాగా 2012 లో

తెలుగు వారైన రావూరి భరద్వాజ గారు ఇటీవలి కాలంలో జ్ఞానపీఠ్ పురస్కారం పొందారు. ఇది నాకున్న పరిధిలో నేను సేకరించిన, విన్న కొన్ని కథనాల ఆధారంగా చరిత్రకి ఎక్కని రెండు “స్వర్ణకమలాల” కథ.

శుభం

# సా విరహే...

## కథాసంగ్రహం

రాధ, కృష్ణ ఇద్దరూ అన్యోన్యమైన దంపతులు. వీరిద్దరికీ పెళ్ళయి చాలా కాలం అయినా కూడా సంతానానికి నోచుకోలేదు. ఈ విషయమై కృష్ణని రెండో పెళ్ళి చేసుకోమని అటు కృష్ణ తల్లితండ్రులు బలవంతం చేస్తుంటారు. రాధ కూడా కృష్ణని మరో పెళ్ళి చేసుకోమని చెబుతుంటుంది. అయితే రాధమీద వున్న ప్రేమతో కృష్ణ మరో పెళ్ళికి అంగీకరించడు. దీంతో కృష్ణ తండ్రి విసిగిపోయి అటు రాధ ఇంటి నుండి కానీ, తన ఇంటి నుండి రాకపోకలుండవనీ, వంశాంకురం కలిగితేనే తమని సంప్రదించమనీ కరాఖండిగా చెబుతాడు.

కొంతకాలానికి రాధకి నలతగా వుండి రమేష్ నాయుడు హాస్పిటల్ కి వెల్తుంది. ఆ హాస్పిటల్ వారు రాధకి ప్రెగ్నెన్సీ కన్ఫర్మ్ చేస్తారు. దీంతో వారి ఆనందానికి అవధులుండవు. అయితే రమేష్ నాయుడు మరుసటి రోజు ఉదయాన్నే వారింటికి వచ్చి రిపోర్టులు మారిపోయాయని రాధ గర్భవతి కాదని రాధ అనే వేరే పేషంట్ రిపోర్టు ఆమెకిచ్చి పంపారని... దీంతో వేరే డాక్టర్ ఈమెకి రిపోర్టు చూసి ప్రెగ్నెన్సీ కన్ఫర్మ్ చేసిందనే నిజాన్ని చెప్తాడు. దీంతో ఆ దంపతుల ఆనందం ఆవిరైపోతుంది. అటుపై రమేష్ నాయుడు రాధ కడుపులో బిడ్డకాదు కేన్సరు గడ్డ వుందని. అడ్వాన్స్ స్టేజీలో వుందని. తను ఎక్కువ కాలం బతకదని చెబుతాడు.

రాధకి ఈ విషయం తెలీకూడదని రమేష్ ని కృష్ణ బ్రతిమాలతాడు. కానీ కొంతసేపటికే తెలివిగల రాధ విషయాన్ని తెలుసుకుంటుంది. దీంతో ఆ దంపతుల మధ్య వున్న ఆనందం పూర్తిగా మాయమై విషాదం చోటు చేసుకుంటుంది. తన ఎంతగానో ప్రేమించే భర్త తను లేకపోతే ఏమైపోతాడో అన్న దిగులు రాధని పట్టి వేధిస్తుంటుంది. కృష్ణ తన భార్యకి సేవలు చేస్తుంటాడు. రాధ తీసుకునే నిర్ణయం ఏంటి? దానికి కృష్ణ అంగీకరిస్తాడా లేదా... అనేది తెలుసుకోవటానికి నాటిక మొత్తం చదువుతారని ఆకాంక్షిస్తున్నాను.

# సా..విరహే...!

(సాంఘిక నాటిక)

దర్శకత్వం : విద్యాధర్ మునిపల్లె

**పాత్రలు - పాత్రధారులు**

| | |
|---|---|
| 1. కృష్ణ | శ్రీని భాష, సూర్య |
| 2. రమేష్ | విద్యాధర్ మునిపల్లె |
| 3.రాధ | సరిత, మాధవి |
| 4.మేకప్ | పరమేష్ |
| 5.సెట్ అండ్ లైటింగ్ | అనిల్ |
| 6.మ్యూజిక్ | లీలామోహన్ |

**నాటిక రచన వెనుక**

ఈ నాటికను నేను రాయటం వెనుక రాధా,కృష్ణుల మధ్య వున్న అమర ప్రేమని ఎందుకో ఆవిష్కరించాలనిపించింది. అయితే రాధాకృష్ణుల జీవితంలో ప్రేమ ఎంత వుందో విషాదమూ అంతే వుంది. ఒకటవ్వాలను కున్న వారి ప్రేమ ప్రేమగానే మిగిలిపోయింది. కాలం వారి జీవితంతో ఆడుకుంది. అలా ఆలోచిస్తూ రాధాకృష్ణుల పాత్రలను సోషలైజ్ చేస్తూ.. కాలం పాత్రను డాక్టర్ రమేష్ నాయుడు గా మలచటం జరిగింది.

అటుపై ఈ పాత్రలను తీసుకొని వాటిమధ్య ఒక కథను అల్లి... సహజంగానే కథానాయకుడికి, కథానాయికకూ కష్టాల్ని కలిగించటం.. ఆ కష్టాలనుండి వారు గట్టెక్కటంతో కథ ముగుస్తుంది. కానీ నేను అనుకున్న థీమ్ ప్రకారం రాధాకృష్ణుల ప్రేమ సఫలం కానీ వారు అనుకున్న వైవాహిక జీవితం మాత్రం దుఃఖాంతమే.. అన్న దాన్ని అనుసరించి కథని నేను దుఃఖాంతం చేయాలి.

అలా ఆలోచించే ఈ నాటికలో రమేష్ పాత్రను తీసుకొచ్చి కథలో మలుపులు తిప్పటం జరిగింది. నాటికను ఆసాంతం ఆస్వాదిస్తారని ఆకాంక్షిస్తున్నాను.

# సావిరహే...!

( లైట్లు డిమ్ గా వున్నాయి. రాధ సోఫాలో కూర్చొని నిద్రపోతోంది. వెనుక నుండి మంద్రంగా సావిరహే తవ దీనారాధా అనే పాట వస్తుంది. కృష్ణ ల్యాప్ టాప్ బ్యాగ్ తో లోపలికి వస్తాడు. రాధ కృష్ణ వచ్చింది నిద్రలో వుండటం వల్ల గమనించలేదు. కృష్ణ రాధ నిద్రని భంగం చేయాలని కూడా అనుకోలేదు. వెండి వెన్నెలలో రాధ అందాన్ని తనివితీరా చూస్తున్నాడు. అలా ఆమె మోకాలిపై తన తలనువుంచి చూస్తుండిపోయాడు. అలాగే నిద్రలోకి జారుకున్నాడు. లైట్లు ఆరిపోయి స్పాట్ ఆన్ అయింది. రాధ పూలు కట్టుకుంటూ కూర్చుంది. వెనుక నుండి అమ్మపాట వస్తోంది. రాధ తనలో తనే మురిసిపోతోంది. మెల్లిగా అన్ని లైట్లు వెలిగాయి. కృష్ణ లోపలి నుండి రెడీ అయ్యి తన బెడ్ రూమ్ లోంచి బయటికి వచ్చాడు. రేడియో ఆఫ్ చేశాడు.)

కృష్ణ : ఐపాడ్ జనరేషన్ లో కూడా రేడియో పాటలు వింటున్నావేం రాధా..!

రాధ : ఏమోనండీ.. నాకు రేడియోలో వింటేనే పాటలు విన్నట్లుంటుంది. ! అది సరే ఏంటీ కృష్ణుడు పూలరంగడిలా తయరాయ్యాడు. గోపికల కోసమా?

కృష్ణ : అవును.. ! బందావనంలో రాధ నాకోసం ఎదురుచూస్తోంది.. వెళ్ళద్దూ..

రాధ : ఏ రాధ

కృష్ణ : ఈ రాధే..

రాధ : ఎప్పుడూ..

కృష్ణ : ఎప్పుడూ...

రాధ : మరిది బృందావనం కాదే..

కృష్ణ : ఎవరన్నారు? రాత్రి నీకో గుడ్ న్యూస్ చెప్పాలని ఇంటికొచ్చానా? ఇదిగో ఇక్కడే.. ఇదే ఫోజులో నాకోసం ఎదురుచూసీ.. చూసీ.. అలసిపోయి అందంగా నిద్రపోతున్నావ్.. ఆ కిటికీలోంచి పున్నమి చంద్రుడు తన వెండి వెన్నెలతో ఈ గదంతా నింపేశాడు. ఆ వెన్నెల వెలుగులో నీ మొహం ఆ చంద్రునికే పోటీపడేలా ప్రకాశిస్తోంది. కిటికీలోంచి వీచే చల్లని తెమ్మెరకి నీ ముంగురులు నుదిటిపై నాట్యం చేస్తున్నాయి. నీ అందాన్ని ఆస్వాదిస్తూ నేను ఇదిగో ఇక్కడే... ఇలాగే కూర్చొని చూస్తుండిపోయా.. నీ సౌందర్యం,

ఆ సౌందర్యానికి గుభాళింపులు తెచ్చిన గుండుమల్లెలు నాకు మత్తెక్కిస్తుంటే.. ఇక్కడే, ఇలాగే నీ పాదాలమీద నా తలవంచి అమరసుఖాన్ని అనుభవిస్తూ కళ్ళుమూసుకున్నాను. నిద్రలేచేసరికి నేను మన బెడ్ రూమ్ లో బెడ్ మీదున్నా..

రాధ : ఇదా రాత్రంతా మీరు చేసింది. అయినా పెళ్ళాం కాళ్ళమీద మొగుడు తలపెట్టటమేంటండీ..

కృష్ణ : పెళ్ళాంకాళ్ళమీద మొగుడు తలపెట్టటమేంటో నాకూ తెలీదుకానీ, నేను మాత్రం అనంతమైన ప్రేమను అందించే నా ప్రేమదేవత పాదాలపై తలవుంచాను. దేవతకి దాసుడు అంతకన్నా ఏం ఇవ్వగలడు చెప్పు. (రాధ వంగి కృష్ణ తలపై ముద్దు పెట్టుకుంది.) దేవి అనుగ్రహం.

రాధ : నేను అదృష్టవంతురాలినండీ.. మీ గుండెల్లోనే కాదు, మీ శరీరంలో సగభాగమే కాదు.. మీ తనువంతా నన్ను నింపేసుకొని ఆ అర్ధనారీశ్వరునికంటే అగ్రస్థానంలో మీరున్నారు. (అతని పాదాలమీద వాలింది.)

కృష్ణ : రాధా..! (ఆమెని పైకి లేపి) రాధ స్థానం అక్కడ కాదు. ఇక్కడ..! (తన గుండెలకు హత్తుకున్నాడు) ఈ కృష్ణుని గుండెలపై..

రాధ : ఈజన్మకి నాకింకేం కావాలి?

కృష్ణ : నాకు మాత్రం జన్మజన్మలకీ నువ్వేకావాలి. (వివాహ సమయంలో వచ్చే ధర్మేయ, అర్థేయ, కామేయ,మోక్షేచ నాతిచరామి అన్నవేదం వినిపిస్తుంది.)

రాధ : ఇందాకేదో గుడ్ న్యూస్ అన్నారు.

కృష్ణ : అదా.. నన్ను మా ఫార్మాకంపెనీవారు టీమ్ మేనేజర్ గా ప్రమోట్ చేశారోయ్..

రాధ : (అతని కౌగిలినుండి విడిపోతూ..) అవునా..?

కృష్ణ : అవును.

రాధ : నేనూ రాత్రి నుంచి మీకో గుడ్ న్యూస్ చెప్పాలని వెయిట్ చేశా..! అలా వెయిట్ చేస్తూ నిద్రపోయా..!

కృష్ణ : ఏంటో ఆ గుడ్ న్యూస్..!

రాధ : మనిద్దరి మధ్యలోకి ఒకరు రాబోతున్నారు.

కృష్ణ : మనిద్దరి మధ్యలోకి వచ్చే ధైర్యం ఇద్దరికే వుంది. ఒకరు మా నాన్న.. మరొకరు మీ చిన్నాన్న.. మూడేళ్ళుగా మాటల్లేవు కాబట్టి మా నాన్నరాడు. మా నాన్నని కాదని వచ్చే ధైర్యం మీ చిన్నాన్న

చెయ్యడు.. మరెవరొస్తున్నట్లూ..
రాధ : అబ్బా మెడికల్ మార్కెటింగ్ తప్ప మీకేం తెలీదు..
కృష్ణ : తెలిసేలా నువ్వు చెప్పచ్చుగా.. (ముద్దుచేస్తూ..)
రాధ : ఆఫీసువాళ్ళేకాదు.. నేను కూడా మీకు ప్రమోషన్ ఇచ్చాను.! డాడీగా..! ఆ విషయం చెబ్దామనే రాత్రంతా ఎదురు చూశాను.
కృష్ణ : నిజంగానా? (రిపోర్టు తీసి కృష్ణ చేతికిస్తుంది. కృష్ణ ఆ రిపోర్ట్సు చూసి ఆనందంగా) ఈ రిపోర్టు..
రాధ : నాదేనండీ.. రెండు నెలలుగా కడుపులో ఏదో బరువుగా అనిపిస్తోంది. వికారంగా అనిపిస్తుంది. అప్పుడప్పుడూ తిన్నదంతా వాంతైపోతోంది. చాలా అనీజీగా వుండి మాపెద్దమ్మ కొడుకు డాక్టర్ రమేష్ నాయుడు దగ్గరికి వెళ్ళాను. స్కానింగ్ తీయించి ఈ రిపోర్ట్ చేతికిచ్చాడు.
కృష్ణ : రాధా.. నాకు ఆఫీసులో వచ్చిన ప్రమోషన్ కంటే ఇదెంత ఆనందంగా వుందో తెలుసా? ఈ క్షణంలో నిన్ను ఎత్తుకొని గిరగిరా తిప్పి ముద్దులతో ముంచెయ్యాలనుంది.
రాధ : రాత్రైతే .. అడ్డు చెప్పేదాన్ని కాదు..
కృష్ణ : ఇప్పటికిప్పుడు రాత్రైతే ఎంతబాగుంటుందో కదా..
రాధ : అడగ్గానే చీకటి పడిపోతుందా ఏంటి?
కృష్ణ : కళ్ళుమూసుకుంటే చీకటి పడుతుందిగా..
రాధ : పోండీ..
కృష్ణ : రాధా.. నువ్విలారా.. కూర్చో.. ఇంతకాలం ఏ అసంతృప్తి మనల్ని కృంగదీసిందో దాన్ని మనం సగర్వంగా ఎదిరించి గెలిచాం.. ఇప్పటి వరకూ నీలో నా ప్రియురాలిని చూసుకున్నాను. ఈ క్షణం నుంచి నా ప్రతిరూపాన్ని మోస్తూ మాతృత్వాన్ని పొందిన నీలో పరిపూర్ణమైన స్త్రీ మూర్తిని చూస్తున్నాను.
రాధ : యావండీ.. వెంటనే మావయ్యకి ఫోన్ చేసి చెప్పెయ్యండి.. రాధ ఇక గొడ్రాలు కాదు.. ఓ బిడ్డకి జన్మనివ్వ బోతోంది.. మీ వంశాన్ని నిలబెట్టబోతోందనీ చెప్పండీ...
కృష్ణ : రాధా..
రాధ : అవునండీ.. వంశానికి ఒక వారసుడ్ని ఇవ్వలేక పోతున్నానని మీ నాన్నగారు మిమ్మల్ని మరో పెళ్ళి చేసుకొమ్మని బలవంత పెడుతున్నా.. నా మీద ప్రేమతో ఆయన్ని ఎదిరించి మీలో మీరు

చిత్రవధ అనుభవించిన క్షణాలు నాకింకా గుర్తున్నాయి. నన్ను గొడ్రాలన్నారన్న బాధకంటే, నావల్ల మీరు మీ నాన్నగారితో ఎన్నో మాటలు అనిపించుకున్నందుకు ఎక్కువ బాధపడ్డానండీ.. పిల్లలు పుట్టకపోవటం మన తప్పా.. అది దేవుడి చేతిలో వుంది. ఇప్పటికి ఆయన అనుగ్రహం కలిగింది. వెంటనే ఫోన్ చేసి మీ నాన్నకి చెప్పండి. వంశం మీతో ఆగిపోలేదని.. మరొక అంకురం నా కడుపులో ఊపిరి పోసుకుంటోందని.

కృష్ణ : రాధా.. నీ కవన్నీ.. (రాధ తెలుసన్నట్లు తలూపుతూ... అంత బాధని గుండెల్లో దాచుకున్నానన్న ఫీలింగ్ ఇస్తుంది.) మీ ఆడవాళ్ళు ఎంత గొప్పవాళ్ళోయ్.. గుండెల్లో అగ్ని పర్వతాలు బద్దలవుతుంటే.. ఆ బాధ లావాలా మీ గుండెల్ని దహించేస్తుంటే.. లోలోపల చిత్రవధ అనుభవిస్తూ మొహంలో చిరునవ్వుని వరంగా మాకు అనుగ్రహిస్తున్నారు.. రియల్లీ ప్రౌడ్ ఇట్ ఫర్ ఉమెన్ నేచర్..

రాధ : మీ నాన్నకి ఫోన్ చెయ్యండి..

కృష్ణ : నాతో ఆయన మాట్లాడ్డం మానేసి మూడేళ్ళయింది. మాట్లాడతాడంటావా?

రాధ : విషయం తెలిస్తే తప్పకుండా మాట్లాడతారు. ముందు ఫోన్ చెయ్యండి..

కృష్ణ : సరే.. (సెల్ తీసుకొని ఫోన్ చేస్తాడు.) నాన్నా.. నేను కృష్ణని..(అవతల ఫోన్ కట్ చేశాడు.) ఫోన్ కట్ చేశాడు రాధా..

రాధ : మళ్ళీ ట్రై చెయ్యండి.

కృష్ణ : (మళ్ళీ చేశాడు) నాన్న.. మీ మాట వినలేదని మూడేళ్ళుగా నాతో మాట్లాడ్డం మానేశావ్..(ఫోన్ కట్) ఆయన నాతో మాట్లాడడు..

రాధ : ఇంకోసారి ట్రై చెయ్యండి..

కృష్ణ : నాన్నా.. రాధ నిన్ను తాతని చేస్తోంది. హలో.. నాన్నా.. లైన్లో వున్నావా.. అవునునాన్నా.. నువ్వు తాతవు కాబోతున్నావ్. ఇదిచెప్పాలనే ఇందాకటి నుంచి ఫోన్ చేస్తున్నాను. నువ్వు కట్ చేస్తున్నావ్.. ఆ.. ఇస్తున్నా..

రాధ : మావయ్యా.. నాకు తెలుసు మావయ్యా.. అయ్యయ్యో.. మీరు పెద్దవాళ్ళు.. అలా మాట్లాడకూడదు. మీకు కోపం నామీద కాదు.. వంశాకురం కలగలేదనే మీ ఆవేదన.. నేను అర్ధం చేసుకోగలను. అలాగే..

కృష్ణ : (ఫోన్ తీసుకొని) నువ్వు వెంటనే వచ్చెయ్.. అబ్బా.. ఎప్పుడూ వుండే పొలంపనులేగా.. సరే.. సరే..! నువ్వు ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా బయల్దేరు. వస్తూ వస్తూ మావయ్యని కూడా తీసుకురా.. అబ్బు ఇస్తున్నా నుండు.. (ఫోన్ రాధకిస్తాడు)

రాధ : హలో.. బాబాయ్.. అవును.. మన రమేష్ అన్నయ్యే.. నిన్న వాడి హాస్పిటల్ కి వెళ్తే టెస్టులు చేసి కన్ఫర్మ్ చేశాడు. ఈ సమయంలో ఏ ఆడపిల్లకైనా అమ్మ దగ్గరుంటే బాగుంటుందనిపిస్తుంది. నాకు అమ్మైనా, నాన్నైనా నువ్వే కద బాబాయ్.. నాకు నిన్ను చూడాలని వుంది. వస్తావుగా.. ఆ.. ఆ.. ఇస్తున్నా..

కృష్ణ : అలాగే నాన్నా.. కాలుకిందపెట్టనివ్వను.. రాధనెలా చూసుకుంటానో నీకు తెలీదా..? అలాగే.. వుంటాను.! పంటకి తెగులు పట్టిందట, పురుగుమందు కొట్టించి.. మూడు రోజుల్లో బయల్దేరి వస్తానన్నాడు. రేపు ఊరందరికీ బంతి భోజనాలు పెడతాడట..

రాధ : యావండీ.. నాకు చాలా ఆనందంగా వుందండీ.. (రాధ కన్నీరు కారుస్తుంటే కృష్ణ కన్నీరు తుడుస్తాడు)

కృష్ణ : ఛఛ.. ఏంటిది.. చిన్నపిల్లలా.. ఎందుకా కన్నీరు?

రాధ : మూడు సంవత్సరాలుగా మాటలేలేని మనుషులు ఒక్కసారిగా మాట్లాడేసరికి మనసు తేలికైంది. ఇన్నాళ్ళూ గుండెల్లో పరుచుకున్న బాధ వారి పలకరింపుతో కరిగి కన్నీరై ఇలా.. (రాధ మెల్లెగా తేరుకుంది.) అది సరే.. మీకెవరు కావాలి? అమ్మాయా..? అబ్బాయా..?

కృష్ణ : (కృష్ణకూడా మామూలు స్థితిలోకి వచ్చేస్తూ..) నాకా.. చెప్పే స్తున్నా.. చెప్పేస్తున్నా..

రాధ : అబ్బు.. చెప్పండీ..

కృష్ణ : ఇంతే అందంగా.. ఇంతే తెలివితేటలతో బుజ్జి పాపాయి కావాలి..

రాధ : ఎందుకంట? నాకు మాత్రం ఇలాంటి చిన్ని కృష్ణుడే కావాలి

కృష్ణ : అమ్మాయే..

రాధ : అబ్బాయే..

కృష్ణ : అమ్మాయే..

రాధ : అబ్బాయే..

కృష్ణ : సర్లే.. ఒక పనిచెయ్.. ఒకేసారి ఇద్దర్నీ కనెయ్.. ఒకళ్ళు నీకు,

ఒకళ్ళు నాకు..

రాధ : అమ్మో.. ఒకేసారి ఇద్దరా.. నా వల్ల కాదు బాబూ..

కృష్ణ : రాధా.. ఆ దేవుడు నవమాసాలూ మోసి పిల్లల్ని కనే అదృష్టం తల్లికే ఇచ్చాడు.. కానీ మా మగాళ్ళక్కూడా ఇస్తే ఎంత బాగుండు..

రాధ : ఎందుకంటా.?

కృష్ణ : ఎందుకేంటి? నీ బదులు ఆ బిడ్డని నేనేమోసి, నేనే నొప్పులు అనుభవించి బిడ్డని కని నీ చేతిలో పెట్టేవాడిని..

రాధ : దేవుడు అలా ఎందుకు చేశాడో తెలుసా? బిడ్డని తొమమిది నెలలే మా ఆడవాళ్ళు మోసి బరువు దించేసుకుంటే, జీవితాంతం వాడి బరువు బాధ్యతలు మోయాల్సింది తండ్రే కనుక. అందుకే కాన్పు కష్టం మాత్రమే మాది.. వాడి ఎదుగుదలకోసం పడే కష్టమంతా మీదే.. తండ్రిది..

కృష్ణ : (ఆప్యాయంగా భార్యని చూస్తూ..) రాధా..

రాధ : ఇంతకి పుట్టే బిడ్డని పెద్దయ్యాక ఏం చేస్తారు? నాలా టీచర్ని చేస్తారా? మీలా ఎంబిఏ చేయిస్తారా?

కృష్ణ : అమ్మాయి పుడితే డాక్టర్ని చేస్తా.. అబ్బాయి పుడితే ఇంజనీర్ని చేస్తా.. నాకు తెలుసు బంగారు తల్లే పుడుతుంది డాక్టరవుతుంది.

రాధ : ఏం కాదు బుజ్జి కృష్ణుడే పుడతాడు.. (ఇద్దరూ నవ్వుకుంటుండగా కృష్ణ సెల్ రింగవుతుంది)

కృష్ణ : హలో.. అవును ఇంట్లోనే వున్నాను. ఏంటి విషయం? వన్ మినిట్.. రాధా! వెళ్ళి టిఫిన్ రెడీ చెయ్.. అర్జంటుగా ఆఫీసుకెళ్ళాలి.

రాధ : ఈరోజు సండేనేగా..

కృష్ణ : ఆఫీస్ నుంచి ఫోన్. అర్జంటుగా వెళ్ళాలి. మార్కెటింగ్ ఛీఫ్ ఫోన్ చేశారు. (రాధ అర్థం చేసుకొని లోపలికి వెళ్ళిపోతుంది. రమేష్ వస్తాడు. కృష్ణ రమేష్ ని చూస్తూనే షాక్ అవుతాడు..) అదేంటి బావా ఇప్పుడే ఫోన్ చేసి అప్పుడే వచ్చేశావ్..

రమే : రాధా..

కృష్ణ : (లోపలికి చూపిస్తూ..) ఎందుకు తనని లోపలికి పంపించ మన్నావ్?

రమే : చెప్తానురా.. నిన్న రాధ నా హాస్పిటల్ కి వచ్చింది.

కృష్ణ : యా యా.. నాకు చెప్పింది. టెస్ట్ చేసి తను కన్సీవ్ అయిందని చెప్పావటగా..

రమే : ఆ విషయం మాట్లాడదామనే వచ్చాను. రాధని నువ్వు ఇక నుంచి

చాలా జాగ్రత్తగా చూసుకోవాలి..

కృష్ణ : నీకు తెలీదా బావా.. నేను రాధని ఎలా చూసు కుంటానో..

రమే : తెలుసు.. కానీ .. డాక్టర్ గా నేను నీకు ఒక విషయం చెప్పాలి. నువ్వు కొంచెం ప్రశాంతంగా కూర్చో.. రాధ చెప్పిన సిమ్టమ్స్ ని బట్టి తనకి కొన్ని టెస్టులు రాశాను. అర్జంటుగా ఆపరేషన్ వుండి నేను థియేటర్ లోకి వెళ్ళాను. ఆ టైంలో నా ఓపీ వేరే డాక్టర్ చూస్తోంది.

కృష్ణ : అయితే..

రమే : నువ్వు కూర్చో.. రాధ అని వేరే పేషెంట్ రిపోర్టులు మన రాధకిచ్చి పంపించారు. అవి చూసిన ఆ డాక్టర్ మన రాధకి ప్రెగ్నెంట్ అని కన్ఫర్మ్ చేసింది.

కృష్ణ : ఏంటి నువ్వు మాట్లాడుతోంది..

రమే : రాధ గర్భవతి కాదు.. ఎప్పటికీ కాలేదు కూడా..

కృష్ణ : ఇప్పటివరకూతనుతల్లికాబోతోందనిఎంతసంబరపడిపోయిందో తెలుసా.. ఇన్నేళ్ళూ తను ఎదుర్కొన్న అవమానాలన్నీ ఎదిరించి గెలిచానని ఎంతో ఆనందించింది. ఇంతకు ముందే మా నాన్నకి ఫోన్ చేసి చెప్పాం. రాధ గర్భవతిని.. మీకు మాత్రం తెలీదా..? పిల్లల విషయంగా మా నాన్న ఎంత పట్టుదలగా వుంటాడో.. ఆయన చెప్పినట్లు వేరే పెళ్ళిచేసుకోలేదని మూడేళ్ళుగా మా మధ్య మాటలు లేవు.

రమే : అవన్నీ నాకు తెలుసు.. కానీ..

కృష్ణ : ఇంకా కానీ అంటావేంటి? ఎన్నో ఆశలు పెట్టుకున్న రాధ పరిస్థితేంటి? రేపు మా నాన్నొస్తే ఎంత గొడవ జరుగుతుందో తెలుసా? మా నాన్న ఊరికే వుండడు. ఈ పాటికి ఊరంతా బంతిబోజనాలు పెడుతున్నానని చాటింపేసి వుంటాడు. అది అబద్ధమని తెలిస్తే పరువుకోసం పాకులాడే వ్యక్తి.. ఏం చేసుకుంటాడో... ఊహించటానికే భయంగా వుంది.

రమే : ట్రై టూ అండర్ స్టాండ్ మీ కృష్ణ.. అదేదో పొరపాటున రిపోర్ట్స్ మారి అలా జరిగింది. ఐయాం సారీ..

కృష్ణ : సారీ.. ఒక్కమాట.. సారీ.. డాక్టర్లు.. మీపాటికి మీరు చెప్పేస్తారు.. మాలాంటి వాళ్ళ ఎమోషన్స్ అన్నీ మీ సారీతో కొట్టిపారేస్తారు..

రమే : నన్ను అర్థం చేసుకో కృష్ణా.. ఈ విషయానికే నువ్విలా ఫీలవుతున్నావ్.. అంతకన్నా ముఖ్యమైన విషయం నీకెలా

చెప్పాలో నాకు అర్థం కావట్లేదు.
కృష్ణ : అంతకన్నా ముఖ్యమైన విషయమా..?
రమే : అవునురా..? ఇది చాలా ముఖ్యమైన విషయం.. చెప్తే నువ్వెలా రియాక్టవుతావో అని ఆలోచిస్తున్నాను.
కృష్ణ : ఏంటది?
రమే : నీకు తెలుసు... నాకు నా చెల్లెలు సత్యకంటే.. నా చిన్నమ్మకూతురు రాధంటేనే ఎక్కువ ఇష్టం. తనతోనే నేను ఎమోషనల్ గా కనెక్టయ్యాననీ.. అలాంటిది రాధకి..
కృష్ణ : రాధకీ..
రమే : రాధకీ... నిన్న స్కానింగ్ తీయించాక వచ్చిన రిపోర్ట్స్ చూసి..
కృష్ణ : రాధకి ఏమైంది?
రమే : చెప్తాను కృష్ణా... ముందు నువ్వలా కూర్చో.. (కృష్ణని కూర్చోపెట్టి రిపోర్ట్స్ చేతిలో పెట్టాడు. కృష్ణ ఆ రిపోర్ట్స్ చదువుకుని షాకయ్యాడు.. అతన్ని స్పృహలోకి తెప్పించాడు..)
కృష్ణ : ఏంటిదంతా..?
రమే : నిజం..
కృష్ణ : నేను నమ్మను..
రమే : నమ్మాలిరా.. నమ్మితీరాలి..
కృష్ణ : ఇవి నా రాధ రిపోర్ట్స్ కావు.. ఎవరివో..
రమే : కాదురా.. అవి రాధ రిపోర్ట్సే...
కృష్ణ : బావా.. (చొక్కా పట్టుకున్నాడు..) ఇవి అబద్ధమని చెప్పు..
రమే : అబద్ధం.. ఇదంతా అబద్ధం.. అయితే చాలా బాగుండని నాకూ అనిపిస్తోంది.. నేను చెప్పగానే నిజం అబద్ధం అవ్వదుగా.. అవి.. (రాధరిపోర్టులే అని అభినయిస్తాడు..)
కృష్ణ : చెలాకీగా తిరిగే రాధకిలాటి వ్యాధి..
రమే : కోటిమందిలో ఒకరు మాత్రమే ఇలా వుంటారు. నిజానికి రాధ ఇంతకాలం ఎలా బ్రతికిందో నాకే అర్థమవ్వట్లేదు. రాధకి తన కండిషన్ తెలీదు.
కృష్ణ : తెలీకూడదు కూడా.. తెలీకూడదు..
రమే : కష్టంరా.. ఏదోకరోజు తనకి తెలిసే తీరుతుంది. తనేదో నార్మల్ గా వచ్చే కడుపునొప్పి అనుకుంటుంది. టెస్ట్ చేశాక నాకు డౌట్ వచ్చింది. అందుకే తనకి నేను స్కానింగ్ ప్రిఫర్ చేశా.. ఆ రిపోర్ట్స్

లో తనకీ..

కృష్ణ : వద్దూ.. చెప్పద్దు.. ఒక్కసారి చదివినందుకే గుండెపగిలిపోయింది. మరోసారి వింటే నేనేమై పోతానో...

రాధ : (ప్రవేశిస్తూ..) యావండీ టిఫెన్ రెడీ.. (రమేష్ ని చూస్తుంది) అన్నయ్యా.. నువ్వెంతసేపైంది వచ్చి.

రమే : ఇప్పుడే తల్లీ..

రాధ : నేనూ ఇప్పుడే ... వేడివేడిగా పెసరట్టుప్మాచేశా..

రమే : రాధా..నువ్వున్నపరిస్థితుల్లో ఇలాంటిపనులుచెయ్యకూడదమ్మా..

రాధ : నాకేంటి అన్నయ్యా.. నేను బానే వున్నానుగా.. అయినా ఇప్పటి నుంచే అవి చెయ్యకూడదూ.. ఇవి చెయ్యకూడదూ అంటే ఎలా..? రేపు బిడ్డని కనేప్పుడు ఇబ్బంది పడిపోనూ.. మీ డాక్టర్లే చెప్తారుగా తేలికగా డెలివరీ అవ్వాలంటే..

కృష్ణ : రాధా.. బావ చెప్పినట్లు విను..

రాధ : మీరేంటంత సీరియస్ అవుతారు?

కృష్ణ : (కవర్ చేసుకుంటూ) సీరియస్సా.. నేనా? అదేం లేదే.. నేను మామూలుగానే చెప్పా..

రాధ : ఏంటో మీరు మామూలుగానే చెప్పినా నా గుండెలు అదిరినంత పనైంది.. ఇంకోసారి అలా అరవకండి.. గుండాగి చనిపోయినా పోతాను.

కృష్ణ : రాధా.. జోగ్గాక్కూడా అలా అనద్దు.. నువ్వులేకుండా నేనుండలేను.

రాధ : (క్యాజువల్ గా..) ఏంటన్నయ్యా.. ఇంతపొద్దున్నే హాస్పిటల్ కి బయల్దేరావా?

రమే : అలాంటిదేంలేదమ్మా.. మీ వదినతో చిన్న ఫైటింగ్.. నిన్న మా వెడ్డింగ్ యానివర్సిరీ కదా..

రాధ : ఏం జరిగుంటుందో నేను చెప్తాను.. సైకాలజీ డాక్టర్ ని కదా.. వదిన నిన్ను తొందరగా ఇంటికి రమ్మనుంటుంది. నువ్వేమో పేషెంట్లందర్నీ చూస్తూ ఏ అర్ధరాత్రో వెళ్ళి వుంటావు. దీంతో వదిన అలకపాన్పు ఎక్కి వుంటుంది.రైటా..?

రమే : అంతే.. అంతే.. దాంతో ఈ పూట నా బ్రేక్ ఫాస్ట్ కి బ్రేక్ పడింది.

రాధ : లేటైతే అయింది ఏదోక గిఫ్ట్ తీసుకెళ్ళి ప్రేమగా ఇస్తే మా ఆడవారిట్ల ఐసై పోతారు. అది మా ఆడవారి సైకాలజీ..

రమే : అందరాడాళ్ళ సంగతి నాకు తెలీదుకానీ, మీ వదినా.. దాని

గురించెందుకులేమ్మా.. ఆకలి దంచేస్తుంది.. టిఫెన్ పెట్టమ్మా..

రాధ : రా అన్నయ్యా.. అవును ఈ రిపోర్ట్స్.. (చేతిలోకి తీసుకుంటుంది) రాధ.. రాధ.. రెండు రిపోర్టులున్నాయేంటి? (రమేష్ ఆ రిపోర్ట్స్ తీసుకో బోతుండగా రాధ ఓపెన్ చేస్తుంది.)

కృష్ణ : రాధా.. నువ్వా రిపోర్ట్ చూడకూడదు..

రాధ : నేను చూడకూడదా..

కృష్ణ : అదే.. డాక్టర్ పర్మిషన్ లేకుండా చూడకూడదు..

రాధ : నా రిపోర్ట్ నేను చూడకూడదా..

రమే : అది నీ రిపోర్ట్ కాదమ్మా.. వేరే రాధ రిపోర్ట్..

రాధ : ఆవిషయం మెల్లిగా చెప్పచ్చుకదండీ.. చూడ న్నయ్యా.. ఎలా సీరియస్ అవుతున్నారో.. అది సరే.. నిన్న నాకు స్కానింగ్ చేశారు కదా.. మీరు చెప్పకూడదు.. కానీ అడిగేస్తున్నా.. నా కడుపులో పెరుగుతోందీ.. అమ్మాయా.. అబ్బాయా... (కృష్ణ రమేష్ ఇద్దరూ మొహం మొహం చూసుకుంటారు..) చెప్పన్నయ్యా.. అమ్మాయా.. అబ్బాయా..

కృష్ణ : అలాంటివి వాళ్ళు చెప్పకూడదు..

రాధ : బయటివాళ్ళకు చెప్పకూడదు.. మనలో మనకి చెప్ప చ్చు.. నువ్వు చెప్పన్నయ్యా..

కృష్ణ : అదీ.. అదీ.. (చిత్రవధ అనుభవిస్తుంటారు ఇద్దరూ..)

రాధ : అదే.. అమ్మాయా... అబ్బాయా...

కృష్ణ : అమ్మాయి మాత్రం కాదమ్మా..

రాధ : నేను చెప్పానా..? నేను చెప్పానా..? ఇలాంటి చిన్న కృష్ణుడే నా కడుపులో పెరుగుతున్నాడని.. ఈయనే అమ్మాయే పుడుతుంది.. అమ్మలా వుంటుందంటూ నాతో వాదించారు.. ఇప్పుడు కుదిరిందా తిక్క.. (అమ్మా.. అంటూ కడుపు పట్టుకొని విలవిలలాడుతుంది..) అన్నయ్యా.. నొప్పి.. నొప్పి భరించలేకపోతున్నాను.. అమ్మా.. ( స్టేజీ అంతా హడావుడి వాతావరణం చోటు చేసుకుంటుంది. రమేష్ ఏవో మందులు రాసిస్తాడు)

రమే : వెంటనే వెళ్ళి ఈ మందులు తీసుకురా.. అర్జంట్.. (కృష్ణ బయటికి పరిగెత్తాడు. రాధ నొప్పితో విలవిలలాడుతుంది. రమేష్ ఆమెకి సపర్యలు చేస్తుంటాడు. మెల్లిగా రాధ కి నొప్పి తగ్గుతుంది.) రెస్ట్ తీసుకోమ్మా.. కాసేపు కళ్ళుమూసుకొని రిలాక్స్ అవ్వు.. (తను తీసుకొచ్చిన రిపోర్ట్స్ చూస్తూ పాయింట్స్ నోట్ చేసుకుంటున్నాడు రమేష్.. రాధ మెల్లిగా కళ్ళు తెరిచింది..)

రాధ : ఏం చేస్తున్నావన్నయ్యా..
రమే : నీ రిపోర్ట్స్ చూస్తున్నానమ్మా..
రాధ : రెండు మూడు నిమిషాలు భరించలేనంత పెయిన్ వస్తుంది. కాసేపటికి ఇలాగే దానంతటదే తగ్గిపోతుంది. ఆ కాసేపూ ప్రాణం పోతుందేమో అని పిస్తుంది. అయినా నువ్వేంటి ఆ రిపోర్ట్స్ చూస్తున్నావ్.. నా రిపోర్ట్స్ ఇవి కదా..
రమే : అదీ.. అదేంటంటే.. ఈ రిపోర్ట్స్.. అదీ.. (ఏం చెప్పాలో అర్థంకానట్లుగా చూస్తుంటాడు.)
రాధ : నావైపు చూడు అన్నయ్యా.. నా కళ్ళల్లోకి చూడు అన్నయ్యా.. నేను సైకాలజిస్ట్ ని.. ఆలోచిస్తుంటే ఇప్పుడు పూర్తిగా అర్థమౌతోంది. నువ్వు రిపోర్ట్స్ ఎప్పుడూ ఇంటికి తీసుకెళ్ళవు. కానీ ఈరోజు ఇంటికి తీసుకొచ్చావ్.. ఎప్పుడూ ఆయన నాతో సీరియస్ గా మాట్లాడడు. నువ్వు తెచ్చిన రిపోర్ట్స్ నేను చేతిలోకి తీసుకోగానే ఆయన నామీద సీరియస్ అయ్యారు. అంటే ఆ రిపోర్టులో ఏముందో ఆయనకి తెలిసే వుంటుంది. ఇప్పుడు నాకు ట్రీట్మెంట్ ఇవ్వటానికి నువ్వు మళ్ళీ నువ్వు తెచ్చిన ఆ రిపోర్ట్స్ చూస్తున్నావ్.. అంటే.. ఏం జరిగిందన్నయ్యా..
రమే : రాధా.. అదీ..
రాధ : రిపోర్ట్స్ మారిపోయాయా..? (అవునన్నట్లుగా తలూపాడు..) నేను ప్రెగ్నెంట్ అవ్వటం.. (తల అడ్డంగా ఊపాడు) మరి నా రిపోర్ట్ లో నిజం ఏంటన్నయ్యా...
రమే : ఏముంటుంది.. ఏమీలేదు.. నీకేం కాదు కూడా.. నిన్ను నేను దక్కించుకుంటానమ్మా..
రాధ : దక్కించుకుంటావా? దక్కించుకోటమేంటి? నాకేమైం దన్నయ్యా.. నేను వెళ్ళిపోతున్నానా...
రమే : రాధా.. (ఏడుస్తాడు)
రాధ : చెప్పన్నయ్యా.. నువ్వు చెప్పేది ఏదైనా వింటానికి నేను సిద్ధంగా వున్నా.. అదేదైనా వినితట్టుకోగలను. ఏముందా రిపోర్టులో...
రమే : (రిపోర్టు రాధచేతికిచ్చాడు.. రాధ చూస్తుండగా...) సెర్వికల్ కేన్సర్ విత్ మల్టిపుల్ డిజార్డర్..
రాధ : ఎంత మోసపోయానన్నయ్యా.. పిరియడ్స్ ఆగకుండా నేను నెలతప్పటమేంటి అన్న చిన్న లాజిక్ ని తల్లినవుతున్నానన్న

రిపోర్ట్ ఎంత మాయచేసిందన్నయ్యా.. అమ్మని అవ్వలేని నేను ఈ రిపోర్ట్ చూసి అమ్మనవుతున్నానని ఒక ఫూల్ లా ఎంత సంబరపడిపోయాను.. ఆలోచిస్తుంటే నాకే నవ్వొస్తోంది..

రమే : రాధా..

రాధ : అన్నయ్యా.. ఆపరేషన్ చేస్తే..

రమే : ఫస్ట్ సెకండ్ స్టేజీల్లో వుంటే ఆపరేషన్ చేసి యుటిలిస్ తొలగిస్తే చాలా కేసుల్లో ప్రాబ్లం సాల్వ్ అవుతుంది. కానీ నీకా పరిస్థితి దాటింది. ఫైనల్ స్టేజీలో నీ ప్రాబ్లం డిటెక్ట్ చేశాం తల్లీ.. అది నీ పేగుల్ని దాటి లీవర్ వరకూ పాకింది. అందుకనీ..

రాధ : (చాలా తేలిగ్గా తీసుకుంటుంది) అంతేకదా.. అయినా కొన్నాళ్ళు బ్రతుకుతానుగా.. (ఏడుస్తూ..) నాకు బ్రతకాలనుందన్నయ్యా.. నాకు బ్రతకాలనుంది. నాకోసం కాదు.. కృష్ణకోసం. ఆయనకి నేనంటే ఎంత ప్రేమంటే నేను లేకపోతే తను పిచ్చోడైపోతాడు.. (ఏదో ధైర్యంతో... ) నేనెలాగైనా బ్రతకాలి.. ఎలాగైనా బ్రతకాలి. నన్ను బ్రతికించన్నయ్యా.. (అంటూ కాళ్ళమీద పడింది.. )

రమే : (పైకి లేపుతూ..) తప్పకుండా ప్రయత్నిస్తానమ్మా.. నిన్ను ప్రాణాలతో దక్కించుకోటానికి ప్రపంచంలో ఎక్కడికైనా తీసుకెల్తా.. వైద్యశాస్త్రంలో నిన్ను బ్రతికించుకోటానికి ఎన్నిమార్గాలున్నాయో అన్ని మార్గాలనూ అన్వేషిస్తా.. వస్తాన్రా తల్లీ.. (వెళ్ళిపోయాడు..)

రాధ : (దేవుడి ఫోటో దగ్గరికి వెళ్ళి.. చేతులెత్తి..) గోవిందా.. ఇదేమైనా బాగుందా.. నాకు ఈ వయసులోనే చావొస్తుందని బాధపడటంలేదు. నామీదే ప్రేమ పెంచుకున్న నా భర్త నేను లేకపోతే ఏమైపోతాడో అని భయపడుతున్నాను. స్వామీ నేను నీ దగ్గరికి రావటానికి సిద్ధంగా వున్నాను. కానీ నా భర్తకి నేను లేని జీవితాన్ని అలవాటు చేసే దారి ఒకటి చూపించు..

కృష్ణ : (హడావుడిగా లోపలికి వస్తూ..) రాధా.. ఎలా వుందిప్పుడు..?

రాధ : బానే వున్నానండీ.. ఏంలేదు.. చిన్న నొప్పేగా..

కృష్ణ : చిన్న నొప్పా అది.. నీకేమైపోతుందోనని ఎంత విలవిల్లాడానో తెలుసా?

రాధ : ఎందుకండీ అంత భయం.. నేనేమైపోతానని.. నాకేం కాదని అన్నయ్య చెప్పాడు. మీరెందుకేడుస్తున్నారు?

కృష్ణ : ఏంలేదు రాధా.. ఏం లేదు.. (ఏడుస్తాడు)

రాధ : నాకు తెలుసండీ.. మీ కళ్ళల్లో నాకు తెలుస్తోంది నామీదున్న ప్రేమ.. ( అతని కన్నీళ్ళు పట్టుకుంటుంది) మీ కన్నీళ్ళలో తెలుస్తోంది.. ఆ ప్రేమలోని స్వచ్ఛత.. మీ చూపులో నేను అర్థం చేసుకోగలను.. నా భవిష్యత్తు శూన్యమని. (రాధ రిపోర్టు చూపిస్తుంది.)

కృష్ణ : రాధా.. (ఒక్క వుదుటున వచ్చి రాదని వాటేసుకుని ఏడుస్తాడు. రాధకి ఏం చేయాలో అర్థంకాలేదు. మెల్లగా తేరుకుంటుంది. పెదవులపై చిరునవ్వు తెచ్చుకుంటుంది.)

రాధ : యావండీ.. ఎందుకండీ బాధపడతారు? ప్రతి జీవి జీవితంలోకి తప్పకుండా వచ్చే ప్రత్యేక అతిధే మృత్యువు. ఆ అతిధిని ఆదరంగా ఆనందంతో ఆహ్వానించాలే కానీ .. భయపడి పారిపోకూడదండీ.. ఎప్పుడో అప్పుడు మన జీవితంలో ముందూ వెనుకగా మనం వెళ్ళిపోవాలి.. కానీ అదేంటో ఇప్పుడు ముందు నేను వెళ్ళిపోతున్నాను..

కృష్ణ : రాధా.. (అంటూ ఏడుస్తూ కిందపడిపోతుండగా.. రాధ కృష్ణతో పాటు కిందకూర్చుంటుంది..సాంగ్‌స్టార్ట్..కృష్ణ ఆమె ఒడిలో తలపెట్టి ఏడుస్తుంటాడు.. రాధ అతని మీద పడుకుండిపోతుంది.. సాంగ్ అయిపోయింది..)

## లైట్స్ ఆఫ్
## 2వ సీన్

(రాధ ఆహార్యంలో చిన్నపాటి మార్పులుంటాయి. ఉదయం పూట రాధకి కృష్ణ జెడవేస్తుంటాడు.పాట వస్తుంటుంది.. ఈ పాట వస్తున్న సమయంలో ఇద్దరూ ఎమోషన్ అవుతారు. ఇంతలో రమేష్ మందులు తీసుకొని లోపలికి ఎంటర్ అయ్యాడు. వీరిని చూస్తూ ఇతను కూడా ఎమోషన్ అయ్యాడు. అంతలోనే రమేష్ సాధారణ స్థితికి చేరుకుంటూ...)

రమే : ఏమ్మా.. ఎలా వుంది ఒంట్లో..

రాధ : నాకేంటన్నయ్యా.. ఇదిగో మహారాణిలా ఎలా సేవలుచేయించుకుంటున్నానో చూడు.

రమే : (చెక్ చేస్తూ..) ఏదీ.. నోరు తెరు.. సరే.. నేనిచ్చిన మందు లు వేసుకుంటున్నావ్ గా..

రాధ : చూస్తున్నావ్ గా.. చిన్న పిల్లకంటే ఎక్కువగా చూసు కుంటున్నారు. వద్దంటే వింటేనా..?

కృష్ణ : బావా.. తను నాకు చేసిన సేవలకి నాకు మరుజన్మంటూ వుంటే రాధకి నేను భార్యనైపుట్టి సేవలు చేసుకోవాలని రోజూ ఆ దేవుణ్ణి

కోరుకునేవాడిని. ఆ దేవుడు మాకు మరుజన్మలేకుండా చేయాలని కాబోలు ఇలాంటి రాత రాశాడు.

రమే : ఏంమాటల్రా అవి.. అమ్మా.. రాధా.. నీ రిపోర్ట్స్ అమెరికాలో వున్న నా ఫ్రండ్ జగదీష్ అనే ఆంకా లజిస్ట్ కి పంపించాను. వాడు నీ వ్యాధిని చాలా ఈజీగా క్యూర్ చేస్తానన్నాడు. ఇలాంటి వ్యాధే వచ్చిన రోజీ అనే అమెరికన్ కి లేటెస్ట్ జెనెటిక్ సైన్స్ ఇంజనీరింగ్ టెక్నాలజీతో నయం చేశాడట. మందులు కూడా పంపించాడు. నువ్వు ఇంతకు ముందులా ఛంగుఛంగుమని గెంతుతూ ఇల్లంతా తిరిగేస్తావ్.

కృష్ణ : నిజమా బావా నువ్వు చెప్తోంది.

రమే : ఇవిగోరా.. మెడిసిన్స్. ఇవి మూడుపూటలా డైట్ తీసుకున్నాక వాడాలి.

కృష్ణ : మరి ఆపరేషన్..?

రమే : ఆపరేషనా.. అసలిప్పుడు టెక్నాలజీ ఎంత డెవలప్ అయిందనుకున్నా.. కేన్సర్ ట్రీట్మెంట్ కి ఆపరేషన్ తోనే పనిలేదు. కీమోలు, రేడియేషన్ లూ లాంటివి లేకుండా కేవలం మెడిసన్స్ తోనే కేన్సర్ సెల్స్ ని నాశనం చేసి.. హెల్దీ సెల్స్ ని జనరేట్ చేస్తున్నారు. (కృష్ణ మొహంలో ఆనందం. రాధ అది గమనిస్తోంది.)

రాధ : (ఉత్సాహంగా..) గుడ్ న్యూస్ చెప్పావ్ అన్నయ్యా.. వుండు ఇప్పుడే నా చేత్తో స్వయంగా కాఫీ చేసి తీసుకొస్తా..

కృష్ణ : నువ్వు రెస్ట్ తీసుకో.. నేనెళ్ళి తీసుకొస్తా...

రమే : కృష్ణా.. అమ్మాయిని నువ్వలా రిస్ట్రిక్ట్ చెయ్యాల్సిన అవసరంలేదు. తనిప్పుడు చాలా హెల్దీగా వుంది. నువ్వెళ్ళమ్మా.. నువ్వేమేం చెయ్యాలనుకుంటున్నావో అన్నీ చేసెయ్..

రాధ : థ్యాంక్స్ అన్నయ్యా.. ఈయనున్నారే.. నన్ను చెయ్యి కదపనీరూ.. కాలు కదపనీరూ.. అన్నీ ఆయనే చేస్తానంటున్నారు.. మీరు మాట్లాడుకుంటుండండి.. చిటికెలో వస్తా.. (అంటూ రాధ ఛంగు ఛంగుమని రెండు గెంతులు గెంతి భర్తవైపు చూసి నవ్వుకుంటూ కిచెన్ వైపు వెళుతుండగా.. నొప్పి వస్తుంది. కడుపు పట్టుకొని బాధతో మెలితిరుగుతుంది. కృష్ణ కంగారుపడతాడు. రమేష్ వెంటనే తను తెచ్చిన మాత్ర ఆమెకేసి నీళ్ళు తాగించి మెల్లిగా కూర్చోబెడతాడు. రాధ కాస్త సెట్ రైట్ అవుతుంది.)

రమే : రాధా..రిలాక్స్.. రిలాక్స్.. రిలాక్స్.. ఇప్పుడెలా వుందమ్మా..

రాధ : టాబ్లెట్ వాడగానే నొప్పి తగ్గింది. వుండు కాఫీ తీసుకొస్తాను. (మెల్లగా లేచి అడుగులో అడుగేసుకుంటూ లోపలికి వెళుతుంది. కృష్ణ ఆమె వెనుకే కొంత దూరం వెళ్ళి రమేష్ వైపు కదులుతూ..)

కృష్ణ : బావా.. నీ మేలు ఈ జన్మలో మర్చిపోలేను..

రమే : ఎందుకు?

కృష్ణ : ఇప్పుడే చెప్పావుగా.. నా రాధకి నయమౌతుందని.. చెప్పు బావా.. నువ్వు చేస్తున్న ఈ మేలుకి నేను ఏమిచ్చి రుణం తీర్చుకోను.

రమే : ఇప్పుడు రుణాల గురించెందుకులే కృష్ణా..

కృష్ణ : లేదుబావా.. నాకు ఈ ప్రపంచంలో రాధకంటే ఏదీ ఎక్కువకాదు.. ఈ విషయం నీకూ తెలుసు. బిడ్డలు పుట్టని గొడ్రాలు.. తనని వదిలేసి వేరే అమ్మాయిని పెళ్ళిచేసుకోమని అటు మా నాన్న, ఇటు రాధకూడా నామీద ఎంత ఒత్తిడి తెచ్చినా నేను తనని వదులుకోటానికి సిద్ధపడలేదు. ఎందుకోతెలుసా..? రాధలేని నా జీవితాన్ని నేను ఊహించుకోలేను.. అలాంటిది రాధని కేన్సర్ నుండి కాపాడుతున్నావ్.. నీకు జీవితాంతం ఊడిగం చేసినా అది తక్కువే అవుతుంది బావా.. తక్కువే అవుతుంది.

రమే : అబద్ధం.. అబద్ధం చెప్పానురా..

కృష్ణ : ఒకసారి రిపోర్టులు మార్చి తను తల్లికాబోతుందని చెప్పి మా ఎమోషన్స్ తో ఆడుకున్నావు. అది గర్భంకాదు కేన్సర్ గడ్డ అని గుండెల్లో పిడుగులు కురిపించావు. ఎడారిలా మారిన మా జీవితాల్లో రాధ బ్రతుకుతుందని ఆశల జల్లులు కురిపించావ్.. అంతలోనే వాటిని అబద్ధమనే చిన్న మాటతో ఆవిరి చేస్తున్నావ్.. నేను నీకేం అన్యాయం చేశాను బావా.. ఇంతలా సాధిస్తున్నావ్..

రమే : ఒకడాక్టర్‌గా..తనమరణాన్నితాత్కాలికంగావాయిదావేయటానికి అబద్ధమే మార్గమని అలా చెప్పాను బావా.. మానవజాతిని పట్టి పీడిస్తూ.. నివారించటానికి లొంగని మహమ్మారిగా వైద్యశాస్త్రా నికి సవాలు విసురుగుతన్న మాయరోగం అది. మొదట్లోనే గుర్తించి వుంటే అదుపు చేసేవాళ్ళం. గర్భాశయం దాటి పేగులకి, అక్కడి నుండి ఆమె కాలేయానికి కూడా పాకిందా మహమ్మారి.. ఆపరేష ఎక్కడని చేస్తాం.. దేన్నని తీసేస్తాం.. నేను చేస్తుంది మోసం కాదు.. వైద్యం..

కృష్ణ : వైద్యం.. సమర్ధించుకోటానికి మీ డాక్టర్ వంద చెప్తారు. ఏం

టెక్నాలజీ ఇంత పెరిగింది కదా.. సైన్స్ ఇంత డెవలప్ అయింది కదా.. లేటెస్ట్ ఎక్విప్ మెంట్స్ ఇన్ని వచ్చాయి కదా.. అలాంటిది ఒక్క ప్రాణాన్ని బ్రతికించలేరా.. అదీ.. నా రాధప్రాణాన్ని..

రమే : చదువుకున్న వాడివన్న సంగతి మర్చిపోయి మాట్లాడుతున్నావ్.. డాక్టర్లు బ్రతికించటానికే ప్రయత్నం చేస్తార్రా.. పేషెంట్ కండిషన్ ని బట్టే బ్రతికించే ప్రయత్నం చేస్తాం.. ఇంత టెక్నాలజీ పెరిగింది కదా.. ప్రాణి శరీరంలో ప్రాణం అన్నది ఎక్కడుందో కనిపెట్టగలిగామా.. చైతన్యాన్ని కనిపెట్టగలిగామా? అంతే.. కొన్ని ప్రశ్నలకు సైన్స్ దగ్గర కూడా సమాధానం దొరకదురా..? రేయ్.. నువ్వెన్నయినా అనుకో.. తనను వీలున్నంతలో ఆనందంగా వుంచాలి. తనకేది ఇష్టమైతే అది చెయ్యనీ.. ఏది తినాలనిపిస్తే అది తినిపించు. ఇది దృష్టిలో పెట్టుకో.. తన ముందెప్పుడూ ఏడుపులూ, పెడబొబ్బలూ పెట్టద్దు. నువ్వు బాధపడకు.. బాధపడుతున్నట్లు రాధకి కనిపించకురా..

కృష్ణ : ఎలా? తనని అలా చూస్తూ ఎలా.. తను నాకు దూరమైపోతుందని తెలిసి కూడా నేను ఎలా తనతో అలా వుండాలి.

రమే : ప్రస్తుత పరిస్థితుల్లో తను ప్రశాంతంగా వుండటమే ముఖ్యం. అర్థం చేసుకో.. రాధకి సంతోషంగా కనిపించు.

కృష్ణ : అలాగే బావా.. నా రాధకోసం నా దుఃఖాన్ని దిగమింగుకుంటాను. మొహంపై నవ్వుని పూసుకుం టాను. అనుక్షణం నా రాధని ఆనందంలోనే వుంచు తాను. ఆనందంలో వుంచుతాను.

రమే : సరే. నువ్వెళ్ళి ఫ్రెష్ అయ్యిరా.. (కృష్ణ లోపలికెళతాడు. రాధ నవ్వుతూ కాఫీ తీసుకొని బయటికొచ్చింది.)

రాధ : ఇదిగో అన్నయ్యా.. ఈయనేరి?

రమే : ఫ్రెష్ అయ్యి వస్తానని లోపలికెళ్ళాడు.

రాధ : అన్నయ్యా... నువ్వు చెప్పిన అబద్ధం నిజమనకుంటున్నారు ఆయన.

రమే : ఏది?

రాధ : అదే.. నాకు కేన్సర్ నయమైపోయి ఎప్పటిలా తిరుగుతానని నువ్వు చెప్పిన ఆ అబద్ధం.. ఆ మాట నువ్వు చెప్పినప్పుడు ఆయన మొహం చూడాలన్నయ్యా.. ఆనందంతో ఎంతగా వెలిగిపోయిందో..

రమే : నేను చెప్పింది అబద్ధమని..

రాధ : నాకు తెలుసన్నయ్యా.. అనుక్షణం మరణం నాముందర నిలబడి నన్ను కబళిస్తానంటూ భయపెడుతుంటే ఎంతకాలమని నేను మాత్రం భయపడను. అలవాటు పడిపోయానంతే..

రమే : రాధా.. చావు తప్పదని తెలిసి కూడా ఇంత ధైర్యంగా ఎలా వుండగలుగుతున్నావ్ తల్లీ..

రాధ : నా ప్రశ్నకి నువ్వు సమాధానం చెబుతావా..? చాలా తేలికదే.. (అడగమన్నట్లు తలూపుతాడు రమేష్) ఈ ప్రపంచంలో చనిపోని జీవి ఏదైనా వుందా..?

రమే : రాధా..?

రాధ : ఆరోగ్యంగా వున్నవారూ చనిపోతున్నారూ.. అనారోగ్యంగా వున్నవారూ చనిపోతున్నారు.. ఎలా బ్రతికినా మనం గమనించాల్సిన విషయం చావు తప్పదని.. కాకపోతే ముందూ వెనుకలంతే.. అది తెలుసు కున్నాను కాబట్టే ఇలా..

రమే : ఎంత వైరాగ్యం తల్లీ..

రాధ : వైరాగ్యం.. ఇది ఆధ్యాత్మికతలో ఓ భాగం. ఆధ్యాత్మికం జీవి జీవనగమన నిర్దేశక సారం.. ఆధ్యాత్మికం వాస్తవ స్వరూప వీక్షణం. ఆద్యాత్మీకం యదార్ధవాదం. అది తెలుసుకోలేకే జీవి జీవన చక్రబంధంలో చిక్కి ఛిద్రమైపోతున్నాడు. ఆధ్యాత్మికతను అలవరచు కుంటే వాస్తవం అర్ధమౌతుంది.

రమే : ఏంటమ్మా ఏదేదో మాట్లాడుతున్నావ్.. అసలీ ఆధ్యాత్మికమేంటమ్మా..

రాధ : ఆధ్యాత్మికమంటే నిజాన్ని తెలుసుకోవటం.. అలా తెలుసుకున్నాను కాబట్టే ఇలా వున్నాను. ఈ ఛావు భయం ఎలాంటిదంటే బ్రతుకు మీద తీపిని పెంచుతోంది. ఎంత అసంబద్ధమని తెలిసినా ఆశకదా.. బ్రతుకు పాశం ఎక్కువ.. అన్నయ్యా.. నాకో సాయం చేస్తావా?

రమే : చెప్పమ్మా..

రాధ : నీకు తెలుసు.. ఆయనకి నేనంటే ఎంత ప్రాణమో.. నేను లేకుండా ఆయనుండలేరు. ఎన్నోసార్లు చెప్పి చూశాను. పిల్లలకోసం మీ నాన్న మాటవిని మళ్ళీ పెళ్ళిచేసుకోండని. ఆయన వినలేదు. అయిన వారంతా నన్ను గొడ్రాలన్నారు. ఆయన వంశానికి నేను పట్టిన శని అన్నారు.

రమే : ఇప్పుడవన్నీ ఎందుకమ్మా..

రాధ : లేదన్నయ్యా.. అదే నిజం. నేను బ్రతికుండగా కృష్ణ మరో పెళ్ళిచేసుకోడు. కానీ నేను పోకముందే ఆయనకి నాలా చూసుకునే మరో అమ్మాయినిచ్చి పెళ్ళిచెయ్యాలి. ఆయన వంశాన్ని నిలబెట్టటానికీ..

రమే : రాధా.. వద్దమ్మా.. నువ్వలా మాట్లాడద్దు. నిన్ను ఎలాగైనా దక్కించుకోవాలని ప్రయత్నిస్తున్నాం తల్లీ..

రాధ : మానవ ప్రయత్నం మీరు చేస్తున్నారు. మృత్యువుని అడ్డుకోవాలని నేను చూస్తున్నాను. కానీ కాలం కదన్నయ్యా.. దానికేమాత్రం కనికరంలేదు. తనలో నన్ను కలిపేసుకోవాలని చూస్తోంది. ఆ కాలాన్ని అడ్డుకునే శక్తి ఎవరికుందన్నయ్యా.. నాకు మాటివ్వు.. (రమేష్ సంశయిస్తుండగా రాధ రమేష్ చెయ్యి తన తలమీద వేసుకుంది. రమేష్ నిర్ఘాంతపోయి తప్పని సరి పరిస్థితుల్లో సరే అన్నట్లు తలూపాడు.) ఇక నేను పోయినా ఫర్వాలేదు.

రమే : అలా మాట్లాడద్దు తల్లీ.. నువ్వు చూసి ఓ.కే చేసిన అమ్మాయితోనే కృష్ణకి పెళ్ళిచేద్దాం.. సరేనా.. కానీ, కృష్ణని ఒప్పించే బాధ్యత మాత్రం నీదే..

రాధ : అయితే .. మన చెల్లెలు సత్యనిచ్చి కృష్ణకి పెళ్ళిచెయ్యి.

రమే : సత్యా.. తన గురించి నీకు తెలుసుగా.. తనమాటే నెగ్గాలంటుంది. తను సొంతం అనుకున్నాక మరొకరు అంటుకున్నా దానికిష్టముండదు..

రాధ : నాకు తెలుసన్నయ్యా.. అందుకే సత్యని కృష్ణకిచ్చి పెళ్ళి చెయ్యమని అడుగుతున్నా..

రమే : తల్లీ సత్య వస్తే నువ్వు కృష్ణకి దూరమౌతావమ్మా..

రాధ : ఎలాగూ దూరమయ్యేదాన్నే కదబాబాయ్..

రమే : కనీసం వాడి నీడ కూడా నీమీద పడనీదు.

రాధ : నాకూ అదే కావాలి. నా చావుని చూసి తట్టుకునే స్థితిలో ఈయనిప్పుడు లేరు. సత్య వస్తే నన్ను మరిపించేలా ఆయన్ను చూసుకుంటుంది. అప్పుడు నేనెక్కడ చనిపోయినా ఆ ప్రభావం ఆయనమీద పడదు.

రమే : ఏ భార్యా తన భర్త ప్రేమను వేరే స్త్రీతో పంచుకోవాలని చూడదు. నువ్వో..

రాధ : అన్నయ్యా.. నేనీ లోకాన్నే వదిలేసి వెళ్ళిపోతే నా భర్తకి ప్రేమను పంచేది ఎవరు? (కార్యేషు దాసీ అనే షట్కర్మలూ ఆమెకి గుర్తొస్తాయి.) భార్యగా నేను ఆయనకి ఏమేం చెయ్యాలో అవన్నీ చేశాననే అనుకుంటున్నా.. ఆ బాధ్యతల్లో భాగంగా ఇప్పుడు నేను అమ్మస్థానంలో నిలబడి ఆలోచిస్తున్నాను. నా భర్తని బిడ్డగా భావిస్తూ నేను మెట్టినింటి వంశాన్ని నిలబెట్టే ధర్మానికి కట్టుబడి అతనికి పెళ్ళిచేయాలని నిర్ణయించుకున్నాను. ఆఖరి బంధాన్ని తెంచుకుని ఆధ్యాత్మిక జీవనం సాగిపోవాలని ఆకాంక్షిస్తున్నాను.

రమే : నిన్ను చూస్తుంటే నాకు మాటలు రావట్లేదు. పరిపూర్ణమైన స్త్రీ రూపాన్ని ఈ రోజు చూస్తున్నా.. ఒక స్త్రీ ఇన్ని రకాలుగా తన ఎమోషన్స్ ని పురుషుడికి అందిస్తుందా.. అని నిన్ను చూస్తేనే నాకు అర్థమౌతుంది. వయసులో చిన్నదానివైనా, నైతికగా ఎంతో పెద్దదానిలా కనిపిస్తున్నావ్.. నీ పాదాలకి నమస్కారం చేద్దామని వున్నా.. నీకంటే పెద్దవాడ్ని నీకు దణ్ణం పెట్టి వున్న నీ కాస్త ఆయుష్షుని కూడా తగ్గించిన వాడినౌతానని ఆగిపోతున్నాను తల్లీ..

రాధ : అన్నయ్యా.. కృష్ణతో పెళ్ళికి సత్యని నువ్వు ఒప్పించు.. కృష్ణని నేను ఒప్పిస్తాను. వీరి పెళ్ళి అయిన మరుక్షణమే నన్ను ట్రీట్మెంట్ పేరుతో కన్యాకుమారికి తీసుకెళ్ళు.. అక్కడ స్వామీ వివేకానంద ఆశ్రమంలో.. చివరి రోజులు ప్రశాంతంగా గడిపేస్తా.. అందాకా నేను బ్రతుకుతాను కదూ..

రమే : రాధా.. (అంటూ ఏడుస్తూ.. తనని దగ్గరికి తీసుకుంటాడు.)

లైట్స్ ఆఫ్

3వ సీన్

( రాధకి కృష్ణ జావ తాగిస్తుంటాడు. కొంచెం జావతాగి రాధ వాంతి చేసుకుంటుంది. కృష్ణ క్లీన్ చేస్తాడు. కృష్ణ బయటికి వెళ్ళి ఫ్రూట్స్ తీసుకొస్తానని చెప్పటం. రాధ సరే అన్నట్లుగా చూస్తుంది. కృష్ణ బయటికి నడవగానే సంకీర్తన. అవ్వగానే కృష్ణ వచ్చాడు. కృష్ణ ఏడుస్తూ వెల్తుండగా.. ఆమె అతని చెయ్యి పట్టుకుంది. ఏంటన్నట్లుగా చూస్తాడు.)

రాధ : మీకో విషయం చెప్పాలి..

కృష్ణ : నన్నడగటానికి పర్మీషన్ కావాలా?

రాధ : అవసరంలేదు.. మరి నాకోరిక తీర్చటానికి కావాలేమో..

కృష్ణ : కోరిక కాదు రాధా.. ఆజ్ఞ.. ఆజ్ఞాపించు..
రాధ : సరే.. ముందీ ప్రశ్నకి సమాధానం చెప్పండి.. నేను లేకుండా క్షణం కూడా వుండలేనంటున్నారు కదా.. అసలు నేనీ ప్రపంచాన్నే వదిలేసి పోతే..
కృష్ణ : రాధా..
రాధ : అవునండీ.. సమాధానం చెప్పండి.
కృష్ణ : రాధలేని కృష్ణుడి జీవితానికి అర్ధమేలేదు.
రాధ : కానీ అంతం కాలేదుగా.. రాధా కృష్ణులు పెళ్ళి చేసుకొని సుఖపడిందిలేదండీ.. రాధ ఎప్పుడూ కృష్ణునికి ప్రేమదేవతే.. కృష్ణుడు ఎప్పుడూ సత్యావిధేయుడే..
కృష్ణ : నువ్వనేదేంటి?
రాధ : నా కోరిక మీరు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలి?
కృష్ణ : ఈ జన్మేకాదు.. జన్మజన్మలూ నీతోనే అని..
రాధ : ఎందుకు? ఈ జన్మలో మిమ్మల్ని నేనేం సుఖపెడు తున్నానని.. ఆయనవారిలో తలవంపులు తీసుకు రావటం తప్ప.. కనీసం మీ వంశాన్ని కూడా నిలబెట్ట లేకపోయాను. మీకు సేవలు చేయాల్సింది నేను మీతో చేయించుకుంటున్నాను. ఎలాంటి సుఖం మీకు ఇవ్వలేకపోతున్నాను.
కృష్ణ : రాధా.. ఏం మాటలవి.. నాకు నా రాధలోని ప్రేమానురాగాలే కావాలి. నీలో నిండిన పరిపూర్ణమైన అమృతతత్వం నాకు కావాలి. అవి నాకు అందని రోజు నేనంటూ ఈ ప్రపంచంలో వుండను.
రాధ : నాకు సేవ చేసే ఓపిక మీకుందేమో కానీ, మీతో చేయించుకునేంత సహనం నాకు లేదు. సరే.. నా రెండో ప్రశ్న.. నేను ఆనందంగా వుండాలంటే మీరేం చేస్తారు.
కృష్ణ : ఏమైనా చేస్తాను. మరో పెళ్ళి చేసుకోవటం తప్ప..
రాధ : ఎందుకు?
కృష్ణ : సమాధానం చెప్తాను..కానీ నా ప్రశ్నకు నువ్వు చెప్పే సమాధానం మీదే నా సమాధానం ఆధారపడి వుంటుంది.
రాధ : ఏంటి?
కృష్ణ : ఈ వ్యాధి నీకు కాకుండా నాకొచ్చి వుంటే.. నేను కూడా నీలాగే వుండి వుంటే, బ్రతికుండగానే మరొక పెళ్ళి చేసుకోమంటే.. నువ్వు ఆ పనిచెయ్యటానికి సిద్ధంగా వుంటావా?

రాధ : వుంటాను.

కృష్ణ : నా కళ్ళలోకి చూస్తూ.. నా తలమీద చెయ్యివేసి మనస్ఫూర్తిగా ఆమాట చెప్పు..

(రాధ చెయ్యి తన తలమీద పెట్టుకుంటాడు కృష్ణ. రాధకి ఏం మాట్లాడాలో అర్థంకాదు. చెయ్యి అతని తలమీద నుంచి తీసేసింది. ఏదో నిర్ణయానికి వచ్చిన దానిలా..)

రాధ : చేసుకుంటాను. మీరు మనస్ఫూర్తిగా చెబితే, మీపై వున్న ప్రేమతో మరోమాట మాట్లాడకుండా మీరు చూపించిన వ్యక్తితో జీవితం పంచుకుంటాను.. మరి మీరో.. మాట్లాడండి.. మరి మీరూ..

కృష్ణ : ఏం మాట్లాడమంటావ్ నన్ను.. నేను నీమాట ఒప్పుకోకపోతే నీపై ప్రేమలేనట్లే అర్థం చేసు కుంటావ్.. ఒప్పుకుంటే నా మనసులో నీపై వున్న ప్రేమ నన్నుననునగా వుండనివ్వదు.. ఏం మాట్లా డమంటావ్..?

రాధ : మాట్లాడాలి.. ఇప్పుడే మాట్లాడాలి.. ఈ సమస్యకి పరిష్కారం ఇప్పుడే మాట్లాడాలి.. నిజంగా.. నా మీద మీకు ప్రేమ వుందిగా.. (వుందని కృష్ణ తలూపుతాడు) మీకింకా బోలెడు జీవితముంది. చూడండీ.. జీవితంలో ఎంతోమంది వస్తుంటారు..పోతుంటారు. అందులో ఒకరితోనే జీవితాంతం రిలేషన్ మెయింటేన్ చెయ్యాలనిపిస్తుంది. మరొకరి జీవితం చాలా వుంది. ఆ జీవితానికో తోడు అవసరముంది. మరొక తోడుని వెతుక్కోక తప్పదండీ.. అయినా ఎన్నాళ్ళిలా.? చూడండీ.. ఇన్నాళ్ళూ మీకేంకావాలో మీకంటే ఎక్కువగా నాకే తెలుసు.. నేను చనిపోయాక మీకవన్నీ ఎవరు చేస్తారు? ఒంటరితనంతో మీలో మీరు నరకం అనుభవిస్తారు. అవన్నీ ఊహించటానికే నాకు చాలా ఇబ్బందిగా వుంది. మిమ్మల్ని ప్రేమించే ఒక ప్రియురాలిగా.. మీరు కష్టపడకూడదనే .. నా భర్త కి నాలా ప్రేమను పంచే మరొక భాగస్వామిని మీ జీవితంలోకి తీసుకొద్దామని నిర్ణయించుకున్నా.. మిమ్మల్ని ప్రేమించే నేను తీసుకున్న ఈ నిర్ణయాన్ని నన్ను ప్రాణంకన్నా ప్రేమించే మీరు కాదనద్దు.. ప్లీజ్.. (దణ్ణం పెడుతుంది. కృష్ణ ఆమె చేతులు పట్టుకొని ఏడుస్తూ..)

కృష్ణ : నన్నేం చెయ్యమంటావ్..

రాధ : సత్యని పెళ్ళి చేసుకోండి.

కృష్ణ : సత్యా..

రాధ : అవును.. రమేష్ అన్నయ్య చెల్లెలు.. తనైతేనే మిమ్మల్ని నాలా చూసుకుంటుంది. నిజానికి నాకంటే ఇంకా ఎక్కువగానే చూసుకుంటుంది.ఈ విషయం నేను రమేష్ అన్నయ్యతో మాట్లాడాను. సత్యని ఒప్పించే బాధ్యత అయన తీసుకున్నాడు. నా కళ్ళముందే ఈ పెళ్ళి జరగాలి. నా చేతులతో అక్షింతలేయాలి. అప్పుడే నా మనసు ప్రశాంతంగా వుంటుంది. ఎన్నడూ ఏమీ కోరని నేను నా ఈ ఆఖరి క్షణాల్లో కోరుతున్న ఈ చిన్ని కోరికని తీర్చండి.. ఈ రాధపట్ల మీకున్న ప్రేమ నిజమని, పరిపూర్ణమని రుజువు చేసుకోండి. (కడుపు పట్టుకొని రాధ మెలికలు తిరుగుతూ విలవిలలాడుతుంది.. ) నాకు ఆఖరిక్షణాలు వచ్చేశాయండీ.. నాకు తెలుస్తోంది.. నాకు మాటి వ్వండి..

కృష్ణ : ఇలాంటి సమయంలో నువ్వు ఎలాంటి కోరిక కోరుతున్నావ్ రాధా..

రాధ : ఇలాంటి సమయమనే ఇలా కోరికుంటున్నాను. అమ్మా.. (పెద్ద శ్వాస తీసుకుంటూ) నాకు పిలుపొచ్చింది. అయినా మిమ్మల్నొదిలీ నేనెక్కడికి పోతానండీ.. సత్య మీకు పంచే ప్రేమలో నేనుంటా.. మీ జ్ఞాపకాల్లో నేనుంటా.. మీ ఇద్దరి నవ్వుల్లో, మీ సంసారసౌఖ్యంలో నిరంతరం మీ మధ్యే నేను తిరుగుతుంటా.. యావండీ.. నా చేతిలో చేయివేసి ప్రమాణం చెయ్యండి.. ప్లీజ్.. (కృష్ణకి ఏం చెయ్యాలో అర్థంకాదు. రాధ కృష్ణ చేతిని తన చేతిలోకి తీసుకుంటుంది. రాధ కన్నుమూస్తుంది. రాధ శరీరాన్ని చివరిసారిగా కృష్ణ ప్రేమగా తడుముతాడు. ఆమె ఒడిలో తలపెట్టి కృష్ణ ఆమెని చూస్తూ అలాగే కూర్చుండి పోతాడు. చనిపోతాడు..)

ఓ.బీ : భౌతికంగా ఈ ప్రేమికులు మరణించవచ్చు.. కానీ వారి ప్రేమ ఎప్పటికీ ఈ సువిశాల సృష్ఠిలో భ్రమిస్తూనే వుంటుంది..ఏదో ఒక రూపంలో అది మనల్ని ఎప్పుడో అప్పుడు పలకరిస్తూనే వుంటుంది. ప్రేమకి తెలిసింది కేవలం ప్రేమించటమే.. ప్రేమని పంచటమే.. అది మనుషులు కావచ్చు, పశుపక్ష్యాదులు కావచ్చు, వృక్షజాతులు కావచ్చు.. ఏవైనా కావచ్చు. జగమంతా ప్రేమే నిండివుంది. ఆస్వాదిద్దాం.. అనుభూతి చెందు దాం.. ఈ రాధాకృష్ణుల అమరప్రేమని ప్రపంచంలోని ప్రతి ప్రేమికులకీ అంకితం చేద్దాం.. సా.. అంటే స్వచ్ఛమైన.. విరహే.. అంటే ప్రేమ..

# మా ఇతర ముద్రణలు

స్వర్ణకమలాలు (నాటికల సంపుటి)
కమనీయం (నాటికల సంపుటి)
శ్రీగురురాఘవేంద్రచరితం (పద్యనాటకం)
శ్రీ సోమనాథ చరితం (గద్యనాటకం)
మనోరంజితీయం (పద్యనాటకం)
యువకెరటం (కథల సంపుటి)
సుందరహనుమాన్ మంత్రమకరందం
దత్తాత్రేయా తవశరణం
నా ఆత్మయానం

ఈ పుస్తకములు కేవలం తక్కువ మోతాదులోనే ముద్రించటం జరిగింది. కావలసిన వారు ఈ క్రింది మెయిల్ ఐడికి పుస్తకం పేరు కోరుతూ రచయితకు మెయిల్ చేసిన ఎడల వారికి పిడిఎఫ్ ఫార్మెట్ లో ఫైల్ పంపటం జరుగుతుంది.  ముద్రణలు కేవలం మా ఫౌండేషన్ మెంబర్స్ కోసం మాత్రమే చెయ్యటం జరిగిందని గమనించగలరు.

భజరంగీ పబ్లికేషన్స్,
పట్టాభిపురం, గుంటూరు